శ్రీరస్తు.

# శ్రీ తారకనామ రామాయణమ్.



శ్రీమత్తోతాద్రిప్రవర మహాయోగీంద్రానుకంపా సమాసా
దితోభయ వేదాన్త శాస్త్రబోధోజ్జ్వలితా సఙ్ఖ్యనిజ
శిష్యప్రశిష్యప్రపూజ్యమాన సగుణస్థాన వైభవ, మన్నాథవంశ్య
భారద్వాజగోత్ర పయఃపారావార రాకాసుధాకర,
శ్రీమద్రంగార్యదేశికోత్తమా పారకారుణ్యపాత్రేణ శ్రీమ
న్నాతమహాశ్యేన వేంకటరమణార్య తనూభవేన


## తె. వేంకట నరసింహాచార్యేణ.


శ్రీరామ భక్తజనానా మనవరత శ్రీరామగుణ కీర్తనాయ
రాగతాళభణితి మనుసృత్య విరచిత మిదమ్
శ్రీరామకథాసుధారసాఖ్య యాంధ్రవ్యాఖ్యయా
సమ్మిళితంసత్ ప్రకాశితం విజయతేతరామ్


**MADRAS:**

PRINTED BY SWAMY BRAHMANANDA AT THE BRAHMO ORPHAN ASYLUM PRESS, MADRAS, & PUBLISHED BY T. VENKATA NARASIMHA CHARYULU.

1912.




దీని వెల రూ. 1 0 0.

# పీఠిక.

ఆర్యులారా!

1903 సంవత్సరమున నేను ఆధ్యాత్మికరుజాక్రాంతుడనై యున్న సమయమున, సర్వలోకశరణ్యుండగు శ్రీరాముని విషయమై కొన్ని స్తోత్రచరణంబులు రచించితత్ప్రభావంబున శరీరారోగ్యముం జెందితి. పిదప కొంతకాలము గడచిన వెనుక, అట్టి శ్రీరామస్తోత్రచరణంబుల, తిరిగి విమర్శించి శ్రీరఘువరచరితమంతయు నిండియుండునట్లు శ్రీతారకనామరామాయణంబను పేర రచియించి యద్దానిని నా మిత్రులకు వినిపించినవారు విని మిక్కిలి సంతసించి సకలాపన్నివారకంబగు, నీస్తోత్రమును ఆంధ్రతాత్పర్య సహితంబుగ ముద్రించిన, సర్వజనసులభ్యంబుగనుండునని తెలిపినందువలన, శ్రీరామకథాసుధారసంబను పేర నాంధ్రవచనమును, శ్రీవాల్మీకి రామాయణసప్తకాండల కథాసంగ్రహములో సవిమర్శంబుగ పొందుపరచి స్త్రీబాలవృద్ధాలకందఱకు సుబోధంబగునట్లు మిక్కిలి సులభశైలిని రచించి ప్రకటించితి. ఇందు సర్వమైన భ్రమప్రమాదాదులర స్ఖాలిత్యాది దోషంబులుండినేని నీరమును విడిచి క్షీరమునుగ్రహించు రాజహంసములట్లు దోషంబులవదలి గుణంబులనే గ్రహింతురని ప్రాజ్ఞశిఖామణులను బదింబదిగ ప్రార్థించుచున్నాడను.

సుజనవిధేయుడు,

1912 జూలై — తెన్నేరం - వేంకట నరసింహాచార్యులు.

నెం, 77 - మల్లా వీధి, జార్జిటౌను మద్రాసు.

## శ్రీహనూమద్విరచిత శ్రీ సీతారామస్తోత్రము.

అయోధ్యాపుర నేతారం,
మిథిలాపుర నాయికామ్ ।
రాఘవాణామలంకారం,
వైదేహానామలంక్రియామ్ ॥

అయోధ్యాపురనాయకుండును మిథిలాపురనాయకియును రఘుకులోత్పన్నులకు భూషణంబైనవాడును, జనకవంశోత్పన్నులకు భూషణంబైనదియు,

రఘూణాం కులదీపం చ,
నిమీనాం కులదీపికామ్ ।
సూర్యవంశసముద్భూతం,
చంద్రవంశే సముద్భవామ్ ॥

రఘువంశజులకు ప్రకాశకుండును, నిమివంశజులకు ప్రకాశకురాలును, సూర్యవంశమున బుట్టినవాడును, చంద్రవంశమున బుట్టినదియును,

పుత్రం దశరథస్యాపి,
పుత్రీం జనకభూపతేః ।
వసిష్ఠానుమతాచారం,
శతానందమతానుగామ్ ॥

దశరథునకు బుత్రుండును, జనకునకు బుత్రికయును, వసిష్ఠోక్తాచారము ననుష్ఠించువాడును, శతానందమతము ననుష్ఠించునదియు.

కౌసల్యాగర్భసంభూతం,
వేదిగర్భోదితాం స్వయమ్ ।
పుండరీక విశాలాక్షం,
స్ఫురదిందీవరేక్షణామ్ ॥
మత్తమాతంగగమనం,
మత్తహంసవధూగతామ్ ।
చందనార్ద్రభుజామధ్యం,
కుంకుమార్ద్రభుజాంతరామ్ ॥
చాపాలంకృతహస్తాబ్జం,
పద్మాలంకృతపాణికామ్ ।

కౌసల్యాగర్భమునుండి జనించినవాడును, యజ్ఞవేదికనుండి స్వయముగ జనించినదియు తెల్లతామరరేకులవంటి విశాలనేత్రములుగల వాడును, నల్లకలువరేకులవంటి నల్లని విశాలనేత్రములు గలదియు, మత్తగజమువలె నడచువాడును మత్తహంసాంగనవలె నడచునదియు, చందనపంకముచే దడిసినఱొమ్ముగలవాడును కుంకుమపంకముచే దడిసిన ఱొమ్ముగలదియు, ధనుస్సుచేనలంకరింపబడిన కరములు గలవాడును,

సర్వలో... తాభ్యాం
సర్వలో... ధాయినీమ్॥
లోకాభి... మం శ్రీరామం,
అభిరామ... దమైథిలీమ్।
దివ్యసింహాస...
దివ్యస్రగ్వస్త్రభూష...
అనుక్షణం కటాక్షాభ్యాం,
అన్యోన్యేక్షణకాంక్షిణౌ।
అన్యోన్యసదృశాకారౌ,
త్రైలోక్యగృహదంపతీ॥
ఇమేయువాం ప్రణమ్యాహం
భజామ్యద్య కృతార్థతాః।
అనయాస్తౌతియస్తుత్యా రా
మంసీతాంచ భక్తితః।తస్య
తౌతనుతాం ప్రీతౌ సంపదస్స
కలాఅపి।క్షిప్తం హనుమతా
ప్రణ్యాం స్తోత్రం సద్యోవిముక్తి
దమ్।యఃపఠేత్ ప్రాతరుత్థా
యసర్వాన్ కామానవాప్ను
యాత్॥ య ఇదం పఠతిస్తో
త్రం మైథిలీరామచన్ద్రయోః
శ్రీ వైకుంఠ మవాప్నోతి స నరో పాతకిల్బిషః॥

...ముచే నలంకరింపబడిన కరం
ములు గలదియు, సకల లోకముల
సృజించునట్టి...దియు, సకలలోక
ములసృజించునట్టిదియు, లోకాభి
రాముడును శ్రీరాముండును, సర్వ
లోక మనోహరురాలును, మైథిలి
...దివ్యసింహాసము నధివసించిన వా
రును, దివ్యమాల్యాంబర భూషణ
ములు గలదియు, ప్రతిక్షణము కడ
కంటిచూపులచే పరస్పరసందర్శన
మపేక్షించుచున్న వారును, ఒకరి
కొకరుతగియున్న, ఈముల్లోకము
లనియెడి గృహమునకు దంపతులగు
ఇట్టి మిమ్ము నేనతిధన్యతతో నమ
స్కరించి సేవించుచున్నాను.
(అని) ఈ అంజనేయకృతిస్తోత్రము
చే సీతారాములను భక్తితో స్తుతిం
చువానికి, సకలసంపదలుగలుగను,
పఠనమాత్రమున సకల పాపముల
హరించునట్టి ఈ సీతా రామ స్తోత్ర
ము హనుమంతునిచే రచింపబడినది,
దీనిని ప్రాతఃకాలమున నిదురలే
చ్చి నిత్యమునే చదివినవాడు స
కలాభీష్టములు బొందును. మరియు
ఈస్తోత్రము నెల్లప్పుడు పఠించువా
డు సకలపాప విముక్తుడై అంత
మున శ్రీవైకుంఠము ను బొందును.

| | | |
|---|---|---|
| ప ప - పప ప ని సీ | నిధదా ధా - ధపపాపా | ప ప - పప నిధధప |
| దయ - యఅపఅఅ | ట్టఅఅ భి - రఅఅమ | ది ఇ - నంమఅఅం |

వసంతరాగము - రూపకతాళము

| | | |
|---|---|---|
| స స - స స రి స సీ | ధనిదా ధ - మమమ | గమ - గ రి స ని |
| జయ - జయ సఅఅ | కే ఎ ప త - ర అ మా. | జయ - జయలోఒ |
| స స - గ రి గా | మా గ - రి స ని | స రి - స ని స ని |
| దయ - య అ ప | ట్టా భి - ర అ మ | ది ఇ - న ం మ ం |

ఆనందభైరవిరాగము - రూపకతాళము.

| | | |
|---|---|---|
| ప ప - ప ప పా | పా-ప - పధపామా | గ గ - మమపమ |
| జయ - జయ సా | కే-త - ర అ అ మ | జయ - జయలోఒ |
| ప ప - స స సా | నిసరిస నిధపమ | గ గ - మధపమ |
| దయ - య అ ప | ట్టఅఅ భి ర అ మ | ది ఇ - న ం మ ం |

నీలాంబరి - రూపకతాళము

| | | |
|---|---|---|
| స స - రి స నీ | స గ - గ మా మ | గ మ - ప ధ ప మ |
| జయ - జయసా | కెఎ - త రా మ | జయ - జయలోంబ |
| గ మ - ప స సా | స ని - పపమగ | గ మ - ప ని ధ ని |
| దయ - యఅప | ట్టఅ - భిరఅమ | ది ఇ - న ం మాం |

సురటిరాగము - రూపకతాళము.

| | | |
|---|---|---|
| రి మ - ప ప పా | నీ - ధ పా ప | రి మ - ప ధ మ గ |
| జయ - జయసా | కే - త రా మ | జయ - జయలోంబ |
| ప ని - స రి సా | రిసనీ - ధ పా ప | రి మ - ప ధ ని ద |
| దయ - య అ వ | ట్టఅఆ - భిరామ | ది ఇ - న ం మాం |

మధ్యమావతి రాగము - రూపకతాళము.

| | | |
|---|---|---|
| ప ప - ప ప పా | పమపని - ప మ రీ రి | ప మ - రి స ని స |
| జయ - జయసా | కెఎఎ - తఅరామ | జయ - జయలోంబ |

పమగా - గ రి గ మ

ప అ ఆ - హిం ర అమ

సరి - గ మ ధ ని

కఅ - భి ర అ మ

ధనిదా సా-గమదానీ

ప అ ఆ హిం-ర అ ఆ మ

గమపమ గ రి గ మ

క - అఅ భిరఅమ

మపమా గ-రిగమ

ప అ ఆ హింరఅమ

పమ - గ రి మ మ

క అ - భి ర అ మ

పమ - గ -రిగమపమగ

ప అ - హిం-రఅఅఅమఅ

పమ - గ-రిమరిమసా

క ఆ - భిరఅఅఆమ

పమ - గ-రిమరిమసా

ప ఆ - హింరఅఅఅమ

రీ - మ పా ప

కా - భి రా మ

| | | | |
|---|---|---|---|
| మప - నీ సా | రీ - రి మ రీ స | సా - స ని ప మ | రీ - స రీ మ |
| దయ - యాంప | ట్టా - భిషరామ | దీ - నంమాం | పా - హింరామ |

బిలహరి - రూపకము.

| | | | |
|---|---|---|---|
| ప ప - ప ప ప ప | ధప - మగరిరి | స రి - గ స ని ధ | స రి - గ పా ప |
| జయ - జయసఅ | కెవ - తిరఅమ | జయ - జయలోంబ | క అ - భి రా మ |
| గ ప - ధ రి సా | సని - ధ పా ధ | రి స - ని ధ ప ధ | మగ - రి స రి గ |
| దయ - య అ ప | ట్టఅ - భిరఅమ | గి ఇ - నంమాం | ప అ - హిరఅమ |

కల్యాణి.

| | | | |
|---|---|---|---|
| స స - స స స ని | ధని - ధపమప | గమ - ప ధ ని ప | ధా - ని సా స |
| జయ - జయసఅ | కెవ - తరఅమ | జయ - జయలోంబ | కా - భి రా మ |
| ధ ని - స రి గ రి | సని - ధప ధని | రి ని - ధ ప ప మ | గా - మ ప ధ ని |
| దయ - యఅపఅ | ట్టఅ - భిరఅమ | గి ఇ - నంమాం | పా - హిరఅమ |

ఓం

శ్రీ రామాయ నమః.

శ్రీ సీతాలక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత

శ్రీ రఘునందన పరబ్రహ్మణే నమః.

# శ్రీ తారకనామరామాయణే.

## బాలకాణ్డః.

(జయజయ సాకేతరామ జయజయ లోకాభిరామ)
(జయజయా పట్టాభిరామ దీనంమాం పాహి రామ)

శ్రీశపరమపదనివాస శేషతల్పశయనరామ
విశ్వరూప విమలచరిత శాశ్వత జగదేక రామ 1

నిత్యముక్తసమనుభావ్య నిరతిశయానంద రామ
నిర్వికార నిరుపమాన నిర్మలాంతరంగ రామ. 2

హేపరాత్పరా సమాన హేయగుణవిహీన రామ
వాగతీత పరమశాస్త్ర వందనీయచరణ రామ. 3

పరబ్రహ్మ పరమేశ్వర పరమాద్భుతకాయ రామ
నారాయణ పరమయోగి నారదాది గేయ రామ 4

భూతభవ్యభవన్నాథ భూరిదయాసాంద్ర రామ
భక్తమూలక పరమపురుష భవ్యగుణాధార రామ 5

సామగానసక్తచిత్త సఫలసకలకామ రామ
హేమరుచిరపీతవసన సోమసూర్యనయన రామ 6

ఆదిమధ్యాన్తరహిత వేదవేద్య విమల రామ
ఆగమాన్తవినుత దివ్యమంగళస్వరూప రామ. 7

విధిశివసనకాద్యచింత్య వైభవ స్వభావ రామ
సకలజగత్సృష్టిస్థితి సంహృతి కారణ రామ. 8

అప్రమేయపురుషోత్తమసుప్రసన్నహృదయ రామ
అప్రాకృతదివ్యదేహ సుప్రకాశ లసిత రామ. 9

దివ్యదేహవిలసిత బహు దివ్యాలంకరణ రామ
దేవదేవ కౌస్తుభమణి దివ్యహారధరణ రామ. 10

శంఖచక్రగదాఖడ్గ శార్ఙ్గహస్త చతుర రామ
శేషసూత్రవతీనాథ సుపర్ణాదిసేవ్య రామ. 11

సచ్చిదానందరూప సాత్త్వికసంభావ్య రామ
స్వాభావిక నిరవధిక స్వామిత్వాంచిత రామ 12

క్షీరార్ణవనిలయమహాలే సురజ్యేష్ఠజనక రామ
శ్రీకర సంవాహిత పా సరసిజ సర్వేశ రామ. 13

ప్రణతనిఖిలసురమునిసం ప్రార్థితామరాప్త రామ
ఆర్తసురాభయదహస్త ధూర్తదైత్యహరణ రామ. 14

దుష్టరాక్షస ప్రభీత శిష్టదేవశరణ రామ
ఇష్టవిభవ సకలసురాభీష్టఫలవితరణ రామ. 15

స్వేచ్ఛా స్వీకృతనానా విగ్రహ సతఫలద రామ
పరిశుద్ధాఽమోఘ్యావరపత్తన జనపేచ్ఛ రామ. 16

పశుపతి విధి సురపతినుత దశరథవరతనయ రామ
చండకిరణకులమండన పుండరీకనయన రామ. 17

రఘుకులతిలకానమాన రమణీయాకార రామ
భానుకోటిసుప్రకాశ భాసమానవేష రామ. 18

భూమిభార పరిహారక భక్తపరాధీన రామ
కౌసల్యాగర్భ శుక్తిమౌక్తికాయమాన రామ. 19

కామ కోటిసౌందర్య కోమలదివ్యాంగ రామ
లక్ష్మీకరసాముద్రిక లక్షణ సంయుక్త రామ. 20

లక్ష్మణశత్రుఘ్నభరత లగ్నసదయహృదయరామ
దినదిన ప్రవర్ధమాన దివ్యలావణ్య రామ. 21

దానవహృద్భేదనపటు దీర్ఘబాహుదండ రామ
గురువరాత్త నిఖిలశాస్త్ర గంభీరార్థజ్ఞ రామ. 22

సురుచిర శస్త్రాస్త్రకళా శోభిత శృంగార రామ
పితృదశరధ నిరవధిక ప్రీతిదామబద్ధ రామ. 23

పుత్రప్రేమానుబద్ధ పితృజన సంప్రీత రామ
కౌశికముని వాక్యభీత దశరథ నిర్గమిత రామ. 24

గాధితనయ సంప్రాపిత గహన సంచరణ రామ
సముచితగుణ లక్ష్మణాఖ్య సహజనిత్యయుక్త రామ. 25

సురరిపుచయనిర్వాపణ కరధృతకోదండ రామ
కౌశికోక్తవివిధకథా కౌశలవిజ్ఞాన రామ. 26

విశ్వామిత్రాత్త బలాఽతిబలా విద్యాభి రామ
మధ్యమార్గ తటకాఖ్య రాక్షసీప్రమథన రామ. 27

ఋషిప్రవర సముపదిష్ట జృంభకాద్యస్త్ర రామ
మఖువినాశ కరరాక్షస మథన సముద్యుక్త రామ. 28

క్రూర సుబాహు మారీచ శౌర్యగర్వ హరణ రామ
స్వబాహు బలవిజితదుష్ట సుబాహు ముఖ దైత్యరామ 29

విశ్వామిత్రాంతరంగ విదితసకలధర్మ రామ
కౌశిక మఖ రక్షణ గురుకార్యనిర్వహణ రామ. 30

మిథిలాపుర నయనోగ్యతమునివర సంగత రామ
నుతపాద స్పర్శగమిత నిజ రూపాహల్య రామ. 31

గౌతమజాయాపూజిత గజయూథపగమన రామ
విశ్వామిత్ర శ్రావిత విష్ణుపదీచరిత రామ. 32

మిథిలానగర ప్రవేశ మోదితజన సేవ్య రామ
జనక రాజ దర్శిత శివచాపవర విభంగ రామ. 33

సీతా కరకమలార్పిత సూనమాలి కాభిరామ
కృత వైవాహిక కౌతుక సీతాకల్యాణ రామ. 34

వైదేహార్పిత బహువిధ వస్త్రాలంకార రామ
వసిష్ఠాది మున్యాశీర్వచనా మోదిత రామ. 35

పరశురామ గర్వహరణ పితృపరివృత్త రామ
సాకేతపుర ప్రవేశ సర్వజనశరణ్య రామ. 36

---

# అ యో ధ్యా కాం డః.

జయజయ సాకేతరామ జయజయ లోకాభిరామ
దయయా పట్టాభిరామ దీనంమాం పాహి రామ

ప్రోషితసుతయుగసంస్మృత దశరథహర్షద రామ
సంస్మృత భరతరిపుఘ్నానుహాసకరకులజాప్త రామ. 1

వైదేహీప్రియ సురుచిర వైష్ణవతేజోభి రామ
వీర్యవినయమధురవచన శౌర్యధైర్యనిలయ రామ. 2

మహితాయోధ్యాపురవరమండనాయమాన రామ
మానిత పితృసహజమిత్ర మండల లోకేశ రామ. 3

సకలలోకహితతత్పర శుభగుణసాగర రామ
సాధుబృంద పరివేష్టిత సత్యవాక్యనిరత రామ. 4

క్షత్రధర్మ పరిపాలన చాతురీ ధురీణ రామ
క్షోణీకాంతా కామిత వాణీపతివినుత రామ. 5

ధనుర్వేదకోవిదవర ధార్మిక ప్రతాప రామ
దర్శనాభిలాషి పౌర దృష్టిచిత్త హరణ రామ. 6

యౌవరాజ్యాభిషేక యోగ్యవయఃపూర్ణ రామ
అభిషేక ప్రయతమాన నృపతి సమానీత రామ. 7

కైకేయీ వారితాఽభిషేక యత్నజనక రామ
అనృతభీత దశరథనృప వాక్యాశ్రితవిపిన రామ. 8

మిత్రబృందకుముదచంద్ర శత్రుతమస్తపన రామ
పటుగుహ విని వేదితపద జటాచీరధరణ రామ 9

ప్రియగుహతారితగంగాఽపగ మునివరవేష రామ
భరద్వాజ మునిదర్శిత చిత్రకూటవాస రామ. 10
సీతాలక్ష్మణసేవిత సౌమ్య గిరివిహార రామ
పుత్త్రవియోగాసహిష్ణు పితృవరసంస్మృత రామ 11
సాకేతాగతభరత ప్రోక్తపిత్రాసంత రామ
స్వపితృమృతిశ్రవణజాత శోక తప్తహృదయ రామ. 12
పితృక్రియానిర్వర్తక పృష్టకుశల భరత రామ
పావనభరత ప్రార్థిత పిత్రాజ్ఞాసక్త రామ. 13
భరతార్పితనిజపాదుక పరమదయాపూర్ణ రామ
అనసూయాసమలంకృత వినత జనకతనయ రామ. 14
దుష్టదైత్యమృగభీకర దండకాప్రవేశ రామ
దుర్గమకాననవిహరణ దానవగణకాల రామ. 15
రక్షోబాధితమునివర రక్షణ తత్పర రామ
రాక్షసగణభీకరశుభవక్షోరాజిత రామ. 16

---

## అరణ్యకాండః.

{ జయజయ సాకేతరామ జయజయ లోకాభిరామ }
{ దయయా పట్టాభిరామ దీనంమాం పాహి రామ }

ఘోరవిరాధభుజద్వయ ఖండనపండిత రామ
శరభంగ సుతీక్ష్ణాది సాధుబృంద సంగ రామ. 1
అగస్త్య మునివర్యదత్త వజ్రశరాసన రామ
పంచవటీతటసుస్థిత పుణ్యకథాసక్త రామ. 2

శూర్పణఖా కర్ణనాస కృంతక లక్ష్మణ రామ
ఖరదూషణముఖ్య దుష్ట ఘోర దైత్యహరణ రామ. 3
హతరిపుచయ కృతమునిహిత సీతాలింగిత రామ
మహర్షిగణమోహావహ మారశతాకార రామ. 4
సీతావాంఛితకాంచన మృగగ్రహణాసక్త రామ
సంహృతమారీచాసుర సీతాసంస్మృత రామ. 5
సీతాప్రేషితలక్ష్మణ దర్శన శంకిత రామ
మాయామయతిరస్కర వంచిత మిథిలాధిపతనయ రామ. 6
మునివిరహిత రావణహృత సీతాచింతిత రామ
సీతాశూన్యాశ్రమ సందర్శన శోచిత రామ 7
గృధ్రపతి సముదీరిత సీతావృత్తాంత రామ
రావణాపహృత సీతా న్వేషణ తత్పర రామ. 8
సంస్కృత గృధ్రకళేబర దుష్కృతనాశక రామ
అయోముఖీ కర్ణ నాస కుచ విచ్ఛేదక రామ. 9
భీమకబంధాఖ్య దైత్య బాహుయుగళ దళన రామ
తదుదీరిత పూర్వజన్మవార్తాది శ్రవణ రామ. 10
శబరీదత్త ఫలాశన సంతుష్టస్వాంత రామ
స్ఫటికవిమల జలపూరిత పంపాతటగత రామ. 11

---

## కిష్కింధా కాండః

జయజయ సాకేతరామ జయజయ లోకాభిరామ
దయయా పట్టాభిరామ దీనం మాం పాహి రామ

పంపాదర్శనవర్ధిత దారవిరహదుఃఖ రామ
నిర్మలలక్ష్మణసంస్తుత నిజప్రభావజ్ఞ రామ. 1

గతమోహోఽస్మృతదర్శన గిరివనసంచరణ రామ
అగ్రజభటమతి భయగత సుగ్రీవేక్షిత రామ. 2

సుగ్రీవప్రేషిత కపిసత్తమ సంస్తుత రామ
భిక్షురూపధరమారుతి భాషిత సంతుష్ట రామ. 3

మరుత్సూనుసందర్శిత మిత్రపూగానువిదిత రామ
తథాన్యోన్య వినివేదిత భూతపూర్వ చరిత రామ. 4

ఉభయశత్రు నిర్వాపణ విరచితప్రతిజ్ఞ రామ
సూర్యసుతప్రత్యయాయ దర్శిత నిజబల రామ. 5

పాదాంగుష్ఠోత్సారిత దుందుభిదేహ రామ
స్వీయైకశరపాతిత సప్తసాలసాల రామ 6

సాలభేదవిస్మితరవి సూనువినుతశౌర్య రామ
సోదరజాయా లంపట సురపతిసుత హరణ రామ. 7

కిష్కింధాసమభిషిక్త భాస్కరతనయాప్త రామ
ప్రావృషిమాల్యవదాశ్రయ ప్రేరితసుగ్రీవ రామ. 8

వ్యగ్రవిస్మృతాజ్ఞమత్త సుగ్రీవామర్ష రామ
సోదరలక్ష్మణ తర్జిత సుగ్రీవ ప్రణుత రామ. 9

తపనసుతాజ్ఞాగత బహు కపిగణసేవిత రామ
సీతాన్వేషణజిగమిషు వత హనుమద్వంద్య రామ. 10

నానాదిక్ప్రస్థాపిత వానర సంస్మృత రామ
జాంబవదాదిప్రేరిత జగత్ప్రాణజ నుత రామ. 11

## సుందరకాండః.

{జయజయ సాకేతరామ జయజయ లోకాభిరామ}
{దయయా పట్టాభిరామ దీనంమాం పాహి రామ}

సముద్ర సంతరణోద్యత సదాగతిజ వినుత రామ
సాగరమైనాకార్చిత సమీరసుత శస్త రామ. 1

జితసురసాసింహిక మరు దాత్మజ మానిత రామ
లక్షితలంకాపురవర లంఘితాబ్ధి హృదభి రామ. 2

వామముష్టి నిహతలంక వాయుసూను వంద్య రామ
సీతాపరిమార్గణ చర వాతాత్మజసేవ్య రామ. 3

పుష్పకదర్శనతుష్ట స్పర్శనసుత మాన్య రామ
అశోకవనగత సీతాన్వేషక కీశాప్త రామ. 4

శింశుపాద్రుమాధిరూఢ సత్కపిహృద్ధామ రామ
సీతాదర్శన ముదిత స్వాంత హనుమదాప్త రామ. 5

వైదేహ్యై శ్రావితరఘువరకథ కపివినుత రామ
సమీరతనయాశ్వాసిత సీతాప్రాణేశ రామ. 6

మైథిల్యర్పితముద్రిక మారుతి సంస్తుత రామ
ముద్రికేక్షణప్రహృష్ట మైథిలీమనోభి రామ. 7

సీతాచూడామణికర సమీరసుత వినుత రామ
అశోకవన విధ్వంసక హనుమత్సంస్మృత రామ. 8

రావణకింకరనాశక రాక్షసాంతకేడ్య రామ
బ్రహ్మాస్త్ర నిబద్ధ పవన పుత్రి మనోనిలయ రామ. 9

భాషితతర్జితరావణ పావని సంనుత రామ
లంకాదహనోద్యతకపి శంకా పరిహరణ రామ. 10

పునర్మైథిలీదర్శన పూతపవనతనయ రామ
పునస్సింధుతరణోద్యత పావనిభావిత రామ. 11

వానరసేనాసంగత వాయుపుత్రి వినుత రామ
మధువన భంజక మారుతి ముఖ్య కపిగణేడ్య రామ. 12

అహంపూర్వ మహంపూర్వ మితి కపిసేవిత రామ
దృష్టాసీతేతి హనుమదుక్తి సంప్రీత రామ 13

సీతోదిత కాకావన వృత్తాంత శ్రవణ రామ
మారుతిదర్శిత చూడా మణిప్రవరహస్త రామ. 14

అభిజ్ఞానకథాశ్రవణ హర్షిత రఘువీర రామ
సువిజ్ఞాత వైదేహీ సుకుశల వృత్తాంత రామ. 15

## యుద్ధకాండః.

{ జయజయ సాకేతరామ జయజయలోకాభిరామ }
{ దయమయా పట్టాభిరామ దీనంమాంపాహిరామ }

పరిష్వక్తపవనాత్మజ పరమామోదక రామ
పరిష్వంగ సంప్రహృష్ట పావనిమానిత రామ. 1

సుగ్రీవాంగదముఖ కపి సైన్య సమావృత రామ
రావణవధ సముద్యుక్త లంకాప్రస్థిత రామ. 2

దక్షిణసాగరతటగత దశరథనందన రామ
సోదరవిధుత విభీషణ సంశయ భయహరణ రామ. 3

విభీషణాభయదాయక వైభవదాయక రామ
సాగరజల సమభిషిక్త సాధువిభీషణ రామ. 4

శరణాగత జనరక్షక కరుణారసభరిత రామ
సుదర్భసంస్తరణశయన సంస్తుతసాగర రామ. 5

అప్రసన్న సాగరజల సుప్రశోషణాసక్త రామ
కాలానల సదృశ ధనుష్కర శర భీకర రామ. 6

శోషిత సింధు ప్రార్థిత సుప్రసన్న చిత్త రామ
నలకారిత సేతుమార్గ విలంఘిత సముద్ర రామ. 7

వానరసైన్య విలంఘిత వననిధి తట వాస రామ
సువేలగిరి శిఖరాశ్రిత శుభలంకేక్షణ రామ. 8

క్రుద్ధ ఘోర రావణాది యుద్ధసన్నద్ధ రామ
వానరసేనా శాలిత వీర దైత్యమథన రామ. 9

నిజశరాణవినిహత నిఖిల నిర్జరరిపు నివహా రామ
ఇంద్రజి ద్విసృష్ట నాగపాశ బద్ధ వేష రామ. 10

స్వేచ్ఛాగత పక్షిరాజ సేవిత పదయుగళ రామ
ముక్త నాగపాశ బంధ ముదితసర్వలోక రామ. 11

సమరనిహత ధూమ్రాక్ష స్వప్నసుతవిముత రామ
మత్త దుష్టదైత్య నివహ మారణ కారణ రామ. 12

కీశవ్రజహాసనోద్యత కుంభకర్ణ కుపిత రామ
ఘోర కుంభకర్ణ శిరః ఖండన జయశీల రామ. 13

లక్షితేంద్రజిద్వ్యసి లక్ష్మణచింతిత రామ
సంహృతేంద్రజిద్దానవ సౌమిత్ర్యాశ్రిత రామ. 14

ద్వంద్వయుద్ధసంక్షోభిత దశకంధరభయద రామ
రావణశీర్షచ్ఛేదక రక్షోగణ కాల రామ. 15

దుష్టనిశాచరమారణ హృష్టదేవ వినుత రామ
లంకారాజ్యాభిషిక్త రావణసోదర రామ. 16

విధిభవముఖసురసముదయవిస్మయకర చరిత రామ
సీతాగ్ని సంశ్రావిత శత్రు నిధనవృత్త రామ. 17

స్నాతాలంకృతసీతా సందర్శన కుపిత రామ
చితాప్రవేశ కృతయత్న సీతా నమసిత రామ 18

అగ్నిగర్త్తే వైదేహీ లగ్నహృదయసదయ రామ
దేవవినుతగుణ సీతా న్యస్థితాంకపీఠ రామ 19

విమానసుస్థిత నిజపితృ వీక్షణ సంముదిత రామ
స్వర్గాగత దశరథనృప సంభాషణ హృష్ట రామ 20

వాసవవర జీవితనిజ వానర సేనాభిరామ
పుష్పక యానారోహణ పురగమనోద్యత రామ. 21

వాయుతనూజాది నిఖిల వానర పరివృత రామ
సుగ్రీవస్త్రీ పరివృత సీతాసేవిత రామ. 22

వైదేహ్యా వినివేదిత వనచరవృత్తాంత రామ
భరద్వాజమునివరోక్త భరతాదిక్షేమ రామ. 23

పవనజోక్త భవత్కుశలభరత నమస్కృత రామ
భరతభక్తి సంప్రహృష్ట పరిష్వక్త భరత రామ 24

సాకేతపురప్రవేశ సర్వానందద రామ
పౌర బంధుపరివేష్టిత పరమానందద రామ 25

సురుచిర నవరత్నపీఠ సుస్థిత సీతాభి రామ
సుముహూర్త పట్టాభిషేక సమయాలంకృత రామ 26

చతుస్సింధు సమానీత శుభజలాభిషిక్త రామ
నవరత్నస్థగితమకుట నవ్యాభరణాఢ్య రామ. 27

ఛత్రచామరాదిహస్త సోదరసేవిత రామ
దేవదేవసంప్రేషిత దివ్యహారధరణ రామ. 28

వామదేవ వసిష్ఠాది వర్ణిత సుగుణాభి రామ
కాత్యాయనముని గౌతమ కశ్యపాది వినుత రామ. 29

ముక్తిమార్గబోధన పర ముద్రాహస్తాభి రామ
సకల రాజధానీశ్వర సంసేవిత చరణ రామ. 30

సర్వలోకసంమానిత సురుచిరపట్టాభి రామ
బహుసువర్ణదానతృప్త బాడబనుత సుగుణ రామ. 31

బహుభూషణబహుమానిత పరిజనసందోహారాను
నైదేహీసంమానిత వాయుకుమారాప్త రామ. 32

మూక్తికహార విభూషిత మారుతి సంస్తుత రామ
స్వర్ణమాలికా మానిత సుగ్రీవప్రణుత రామ. 33

హేమాంగదసువిభూషిత విమలాంగదవినుత రామ
రంగేశ్వరదానతృప్త రమ్య విభీషణ రామ. 34

సకలదానపరితోషిత సాధుకల్పభూజ రామ
వానరసేనావందిత విమలచరణయుగళ రామ. 35

నారదాదిముని వందిత నరవరసేవిత రామ
నిజనివాససంప్రేషిత నిఖిలాశ్రితబృంద రామ. 36

మాయామానుషవిగ్రహ మారమణీరమణ రామ
నిజకరుణారస పోషిత నిఖిలలోకపాల రామ 47

ఏకదారనిరత సత్యలోక మహిత చరిత రామ
సత్యవిజితలోక నిత్య సద్గుణసాగర రామ. 38

---

# ఉత్తరకాండః.

(జయజయ సాకేతరామ జయజయ లోకాభిరామ)
(జయమా పట్టాభిరామ దీనంమాం పాహి రామ)

స్వస్వరాజ్యసంస్థాపిత, సుగ్రీవప్రముఖ రామ
ధర్మనీతి పరిపాలిత ధరణీమండలాభి రామ. 1

సకలసుగుణ గణశోభితసోదర పరిచరిత రామ
మాతృవర్గహర్షప్రద మహితసార్వభౌమ రామ. 2

ముదిత సర్వలోకపాల మహారాజరాజ రామ
ఋషివరగణ సంశ్రావిత రావణాద్యుదంత రామ. 3

జనకసుతా సంశ్లేషణ జాతపరమహర్ష రామ
మారకళాపరితోషిత మైథిలీమనోభి రామ. 4

సీతాచేతోభిలాష సంపూరణ కరణ రామ
అపవాదశ్రవణవిధుత సుపతివ్రత సీత రామ. 5

ప్రాపితవాల్మీకాశ్రమ పరమసతీ తిలక రామ
హయమేధాధ్వర దీక్షిత నయవిత్సంశ్రిత రామ. 6

రుచిరకుశలవశ్రావిత రామాయణముదిత రామ
వాల్మీక్యానీత విమలవైదేహ్యాలోక రామ. 7

సీతాప్రత్యయకృత్యాసక్త శుద్ధహృదయ రామ
రసావివరగత సీతా దర్శన శోచిత రామ. 8

మునివర విధివినివారిత మనోదుఃఖవేగ రామ
సుతకుశలవ సంశ్రావితఉత్తర రఘుచరితరామ. 9

నానావిధ మఖతర్పిత నాకవాసవినుత రామ
బ్రహ్మాజ్ఞాగత పితృపతి భాషణ తత్పర రామ. 10
అత్రిసుతాగమన వక్త్ర సౌమిత్ర్యాలోక రామ
అసమయ లక్ష్మణ దర్శన అధిగతవ్యాత్తాప రామ. 11
సువిసర్జిత సౌమిత్రే సత్యవాక్య నిరత రామ
సరయూభువన ప్రవిష్ట సౌమిత్రిధ్యాత రామ. 12
పరమాంబరగమనోన్ముఖ పరమభక్తసహితరామ
పరమేష్ఠిప్రార్థిత నిజపరమాద్భుతరూప రామ. 13
విధిశివసంస్తూయమాన వైష్ణవతేజోభి రామ
ప్రాప్తరుచిర దివ్యదేహ దీప్తిరాజమాన రామ. 14
ధృతశరీరనిఖిలాశ్రిత దివ్యపురుష సహిత రామ
శంఖచక్రరంజితకర శేషగరుడ మహిత రామ. 15
సుప్రవిష్ట పరమాంబర సూరిబృందవినుత రామ
శ్రీరమణాశ్రిత వత్సల సామగానలోల రామ. 16

---

## విజ్ఞాపనమ్.

సకల చేతనోద్ధారక సర్వపాపహరణ రామ
మదపరాధ తతిమపహర మాధవ మహనీయ రామ. 1
గతిస్త్వమేవ మేసదా గజేంద్రార్తిహరణ రామ
చపలచిత్త మగణితాపచారం మాంరక్ష రామ. 2
భవసాగరగత ముద్ధర భాస్కరకుల తిలక రామ
శరణాగత మగతింమాం పరిపాలయ సదయ రామ. 3

త్వత్పదా విరళభక్తిం దిశమే సర్వజ్ఞ రామ
శ్రితజనరక్షణదీక్షిత పతితావన శీలరామ. 4
శ్రీతారకనామ కథా శ్రోతృసకలఫలద రామ
దారగృహక్షేత్ర పుత్ర ధన ధాన్యప్రద రామ. 5
మనుజసింహవరదయశోఘనతాదయజయద రామ
నమామి తే విమలచరణ నళినయుగళ మనఘ రామ. 6
నౌమిసదా తవతారక నామ సదాధార రామ
అంగజశతకోటి సదృశ శృంగారావయవ రామ. 7
మంగళగుణ కృపయా తవ మంగళాని సంతు రామ
వరగౌత మవంశ్యభక్త నరసింహప్రణుత రామ. 8
జయజయ సాకేత రామ జయజయ లోకాభిరామ
దయయా పట్టాభిరామ దీనం మాం పాహిరామ.

---

శ్రీ తారకనామ రామాయణాంధ్ర వచనంబును.

# శ్రీరామకథాసుధారసము.

## బాలకాండము.

అయోధ్యా పురంబున నెలకొన్న శ్రీరామా! సర్వోత్కర్షముగానుందుము. సకలలోకములకు మనోహరుండవగు శ్రీరామా! సర్వోత్కర్షముగానుందుము. అభిషేకసమయమున చక్రవర్తిత్వసూచకమగు ఫాల పట్టియచే నొప్పుచున్న శ్రీరామా! సర్వోత్కర్షముగానుందుము. దీనుండనగునన్ను దయతో రక్షింపుము.

[పూర్వము చతుర్ముఖునిగూర్చి యనేక వేల వత్సరం బులు తపంబొనర్చి దేవరాక్షసులచే దనకు మరణంబు లేకుండ వరంబులబడసిన రావణుండు అతిగర్వితుండై సాధువులగు మునీంద్రులను, ఇంద్రాది దేవతలను మిక్కిలి బాధింపగా నాబాధలకోర్వజాలక ఇంద్రాది దేవతలు బ్రహ్మ కడకేగి మొరలిడ, నలువ వారిపలుకుల విని దేవతలకిట్లనియె. రావణుండు దేవదానవ గంధర్వులకు అవధ్యుండు మనుష్యునివలన జావంగలండని చెప్పుచుండగా నంతలో మహాద్యుతియగు శ్రీమన్నారాయణుండు అచ్చటికి వచ్చెను అప్పుడు బ్రహ్మ పురస్సరముగా దేవతలందరు నారాయణు నిట్లని స్తుతించిరి.]

ఓ శ్రీయఃపతీ, వైకుంఠవాస, నాగపర్యంకశయన, విశ్వస్వరూప నిర్మలచరిత్రా, శాశ్వత, నీవొక్కండవే లోకంబున కధికారివి, నిత్యముక్తులచే బాగుగధ్యానింపబడుచుండువాడవు, నిరతిశయానందుండవు, నిర్వికారుండవు, ఉపమానరహితుండవు, పరిశుద్ధాన్తఃకరణుండవు, ఓపరాత్పరా, నీకు సమానుడులేను, దుర్గుణరహితుండవు, వేదాతీతుండవు, పరమశాంతులచే వందనీయమైన పాదములుగల వాడవు. పరబ్రహ్మవు, పరమేశ్వరుండవు పరమాశ్చర్యకరమైన దేహముగలవాడవు, ఓనారాయణా ? నీవుపరమయోగులగు నారదాదులచే గానము సేయంబడు వాడవు, భూతభవిష్య ద్వర్తమాన కాలములయందుండు ప్రభుండవు, అపారకరుణాసముద్రుండవు, భక్తసులభుం

డవు, ఓపరమపురుషా, కల్యాణగుణాశ్రయ. నీవు సామ
గానమునందాసక్తమైన మనస్సుగలవాడవు, సఫలమనో
రథుండవు, స్వర్ణకాంతిగల పీతాంబరమును ధరించినవా
డవు, చంద్రసూర్యులు నేత్రములుగాగలవాడవు, ఆదిమ
ధ్యాన్తరహితుండవు, వేదవేద్యుండవు, విమలుండవు,
ఉపనిషత్తులచే స్తుతింపబడిన దివ్యమంగళాకారము గల
వాడవు, బ్రహ్మరుద్రాదులచేతను, సనకాదిమహాత్ములచే
తను, తలంపనశక్యమైన వైభవమును, స్వభావమునుగల
వాడవు, సమస్తజగత్సృష్టిస్థితిసంహార కారణభూతుండవు
పరిమితిలేనివాడవు, పురుషోత్తముండవు, మిక్కిలి ప్రస
న్నమైన మనస్సుగలవాడవు అప్రాకృతమైన దివ్యదేహ
కాన్తిచే స్వయంప్రకాశముగలవాడవు, దివ్యదేహమందు
ప్రకాశించుచున్న అనేక దివ్యాభరణములుగలవాడవు,
దేవదేవుండవు, కౌస్తుభమణి దివ్యహారముల ధరించిన
వాడవు. శంఖచక్రగదాఖడ్గ శార్ఙ్గాయుధములను హస్త
ములయందు ధరించినవాడవు, సమర్థుండవు, అనంతగరు
డ విష్వక్సేనాది సేవ్యుండవు, సచ్చిదానందరూపుండవు,
సాత్వికులచేభావింపబడు వాడవు, స్వభావసిద్ధమైనదియు
మేరలేనిదియునైన ప్రభుత్వముచే ప్రకాశించువాడవు,
క్షీరసాగర నిలయుండవు, ఆశ్రితపాపహరుండవు, పితా
మహజనకుండవు, లక్ష్మీదేవి కరములచేవహింపబడిన పా
దకమలములుగలవాడవు, సర్వేశ్వరుండవునై యొప్పుచు
న్ననిన్ను శరణుజొచ్చితిమి, లోక కంటకుండగు రావ

ణుండు నిరంతరము మమ్ము అతిక్రూరముగ బాధించు చున్నాడు. ఇంద్రాధిపత్యంబునకు హానివచ్చుచున్నది, సూర్యచంద్రులు భయపడుచున్నారు, కావున వానిని మనుష్యుండుగాని జయింపజాలడు. పరాక్రమంబున వానికంటె మించిన శక్తిగల మనుష్యుండెవడున్నాడు? భూలోకంబున నయోధ్యాధిపతియగు దశరధునకు ముగ్గురుభార్యలు కలరు వారియందు నీవు పుత్రత్వమునుపొంది మానుష దేహుండవై యవతరించి, దేవర్షిసంఘముల నిష్కారణముగా పీడించుచున్న యద్దురాత్ముని సంహరించి మమ్ము రక్షింపుమని వేడిన వైకుంఠుండు వారలకిట్లనియె, ఓ ఇంద్రాది దేవతలారా! అట్లులంగానిండు, నేను రఘుకులంబున దశరధపుత్రుండనై యవతరించి యద్దురాత్ముని వధించెద. మీరందరు నిజాంశములచే, భూమియందు వానరులై జన్మించి నాకుసహాయముజేయుడు, అనిపలికి వారికి అభయంబొసంగి హరియంతర్ధానముజెందె, అంత ఇంద్రాది దేవతలు భూమియందు వాలి సుగ్రీవ హనుమదాది నామములుగల వానరులై జనించిరి. శ్రియఃపతియు స్వేచ్ఛాంగీకృత నానావతారుండుగావున, దుష్టనిగ్రహశిష్ట పరిపాలనార్థము రఘుకులంబున జనియింపదలంచియుండె.

## కథాప్రారంభము.

ఉత్తరకోసలదేశమున నయోధ్యయను పట్టణముకలదు. దానిని సూర్యవంశ సముద్భవుండును ఇక్ష్వాకు కుల

తిలకుండును నగుదశరథుండను రాజు పరిపాలించుచుండె ను. ఆనరేంద్రునకు, కౌసల్య, కైకేయి, సుమిత్రలనియెడి ముగ్గురు భార్యలుకలరు. ఆదశరథుడు పెక్కువత్సరం బులు సంతానములేక, వసిష్ఠ వామదేవాది పురస్సరము గా పుత్రకామేష్టియను యాగముచేసి శ్రీమన్నారాయణు నారాధింప నాయజ్ఞకుండమునుండి శంఖచక్రాది ధరుం డును, లక్ష్మీసమేయుక్తుండును నగు భగవంతుండు వెలువడి పాయస పూర్ణంబగు సువర్ణపాత్రమును దశరథునకొ సంగి, నీభార్యలకొసంగుము నావంటి పుత్రులుగలుగుదు రనిచెప్పి యంతర్ధానమునొందె. ఆపాయసంబును రెండు భాగములుచేసి దశరథుండు కౌసల్యా కైకేయిలకు పంచి యిచ్చెను, అంతలో సుమిత్రయు పుత్రార్థినియై వచ్చిన, నామెకు, కౌసల్యతనభాగములో సగమును, కైకేయితన దానిలో సగమును. ఇచ్చిన, వారలుగర్భములుదాల్చిరి, అప్పుడు శ్రీమన్నారాయణుండు, కౌసల్యయందు రాముడు గను, చక్రాంశముచే కైకేయియందు భరతుడుగను, శేషశంఖాంశములచే సుమిత్రయందు లక్ష్మణ శత్రుఘ్ను లుగను, అవతరింప, వారునలుగురు పుత్రులు దివ్యతేజ ముతో నొప్పుచుండిరి. వారిలో జ్యేష్ఠుండై శ్రేష్ఠుం డైన రాముండు ఇక్ష్వాకు కులప్రకాశకుండై, కౌసల్యా గర్భమనియెడి శుక్తియందు ముక్తామణివలె నావి ర్భవించి కోటిమన్మథ సౌందర్యముగల కోమలమై శ్రేష్ఠ మైన దేహముచే భాసిల్లుచు లక్ష్మీకరములగు సాముద్రి

కలత్రుణములతో గూడి, తమ్ములగు లక్ష్మణ భరత శత్రుఘ్నులయం దనురాగముగలిగి దినదినప్రవర్ధమానంబైన దివ్యలావణ్యముతోడను, రాక్షసులయొక్క వక్షస్థలమును బ్రద్దలుసేయ సమర్థములైన అజానుబాహువులతోడను నొప్పుచున్న నాదాశరథి, సోదరసహితుండై యుపాధ్యాయులవలన నిఖలశాస్త్రముల నధ్యయనము జేసి శస్త్రాస్త్రనిపుణుండై తల్లిదండ్రులకు నత్యంతసంతోషమును గలుగంజేయుచు పుత్రప్రేమముచేత సకలమును మరచిన దశరథునిచే నతిగారాబముతో లాలింపబడుచుండు సమయంబున విశ్వామిత్రుండు దశరథునొద్దకు వచ్చి, ఓమహారాజ! రాక్షసులచే ధ్వంసముచేయంబడు నాయజ్ఞమును రక్షించుటకై నీపుత్రరత్నమగు శ్రీరాముని, నాతోడం బనుపుమని వేడిన, దశరథుండు పుత్త్రప్రేమముచే శ్రీరాముని విడువంజాలక సంశయింపుచుండ, నది తెలిసికొని శ్రీరాముని ప్రభావంబు నెఱింగిన విశ్వామిత్రుండు మిక్కిలి కోపగింప, శపించునను భయముచేత, దశరథుడు లక్ష్మణసహితుండైన శ్రీరాఘవుని కౌశికుని వెంట బనుపగా నాఋషి కోదండతూణీరధరులగు నా రామ లక్ష్మణులను దోడ్కొని నిజాశ్రమమునకుబోవ సమకట్టి అరణ్యమార్గమునబోవుచు, మార్గాయాసము, రాక్షసుల వలనిభయము, గలుగకుండుటకై యా రామ లక్ష్మణులకు బల అతిబలయనియెడి విద్యలనుపదేశించి, మఱియుననేక కథాప్రస్తావనలచే వారిని సంతోషపరచు

చుబోవుచుండగా నాయరణ్యమున తాటకయను రక్కసి అతి భయంకరాకారముతో మార్గము నడ్డగింప, నా శ్రీరామచంద్రుండు విశ్వామిత్రాజ్ఞచే నారక్కసిని సంహరించెను, అంతె కౌశికుండు శ్రీరాముని ధైర్యసాహసములకు మెచ్చుకొని జృంభకాద్యస్త్రముల నుపదేశించి నిజాశ్రమముజేరి యజ్ఞమునలుపుచుండ, తాటకా పుత్రులగు సుబాహుమారీచులని యెడి రాక్షసులచటికివచ్చి యజ్ఞకుండమున శిలారక్తమాంసములనుబడవైచియజ్ఞధ్వంసము సేయుచుండ శ్రీరాముండదియెఱింగి వాయవ్యాస్త్రముచే మారీచుని సముద్రమునం బడవైచి మఱియొక బాణముచే సుబాహుమొదలగు రాక్షసగణమును విలాసంబునవధించి బ్రహ్మర్షిబృందపరివేష్టితుండగు విశ్వామిత్రునిం జూచి మహాత్మా మీకింకరులమగు మేము ఇంకనుయేమిచేయవలయునో, ఆజ్ఞాపింపుడు అనినరాముని వాక్యములను విని బ్రహ్మర్షులు విశ్వామిత్రపురస్సరముగా రామలక్ష్మణుల కిట్లనిరి, ఓ రామా! జనకుండు మిథిలానగరమున యజ్ఞముసేయుచున్నాడు మనమందరము అచ్చటికిబోవుదము అచ్చట శివచాపమున్నది దానిని నీవు చూడవచ్చునని చెప్పి విశ్వామిత్రుండు రామలక్ష్మణులందోడ్కొని పోవుచుండ మార్గమున శ్రీరామచంద్రుని పాదధూళిసోకిన మాత్రమున శాపవిమోచనముచెంది నిజరూపమును ధరించిన గౌతమపత్నియగు నహల్య శ్రీరాముని చరణారవిందముల బూజించి నిష్పాపయై నిజపతింజేరెను, అప్పుడా కౌశి

కుండు అహల్యాపూర్వ వృత్తాంతమును, అచ్చటఁబ్రవ
హించుచున్న గంగాప్రభావంబును సవిస్తరముగ రామ
లక్ష్మణులకుఁజెప్పుచు మిథిలానగరంబుఁజేర జనకుండు రామ
లక్ష్మణ సమేతముగావచ్చిన కౌశికుని వీక్షించి అతిథి
సత్కారముగావించి, సంతోషముతో శివచాపమును వా
రికి జూపి సీతాస్వయంవర వృత్తాంతము నెఱింగింప
శ్రీరఘునందనుఁడు విశ్వామిత్రుని నియమనముచే
ఆశివ ధనుస్సును సకల రాజన్యులు చూచుచుండ అనా
యాసముగా నెక్కుబెట్టి విఱానముతో విఱిచెను అప్పుడ
దిచూచి జనకుండు అమందానంద భరితుండై సీతాకర
కమలముచేత పుష్పమాలికను రాఘవుని కంఠదేశమున
నలంకరింపజేసి దశరథుని కుటుంబపరివారసమేతముగ
నయోధ్యనుండి రావించి భూసుతయగు సీతను శ్రీరాము
నకును, నిజతనూజయగు నూర్మిళను లక్ష్మణునకును తన
తమ్మునికూతులగు మాండవీ శ్రుతకీర్తులను భరతశత్రు
ఘ్నులకునొసంగి సీతాకల్యాణ మహోత్సవమును మ
హావైభవముతోఁజేసి శ్రీరామచంద్రుని నానావిధ వస్త్రా
భరణాదులచే సత్కరించి యానందింపుచుండ వసిష్ఠవిశ్వా
మిత్రాదిమహర్షులందరు వేదోక్తాశీర్వచనములు సలిపిరి.
ఇట్లుదశరథుండు నిజపుత్రవివాహమహోత్సవంబు పూ
ర్ణముగావించుకొని అయోధ్యకు మరలిపోవుతరుణమున
మార్గమున పరశురాముం డతిరౌద్రాకారంబుతో యుద్ధ
మునకు సిద్ధపడగా శ్రీరాఘవేంద్రుండు పరశురాముని

ధనుస్సును స్పృశించు వ్యాజముచేతనే అతని తేజమును హరించి పరశురాముని భంగపరచెను, అప్పుడు దశరథుండు శ్రీరాముని పరాక్రమధైర్యములకునాశ్చర్యపడి పరమానందభరితుండై పుత్రుని నాలింగనము జేసికొని శిరంబుమూర్కొని నిర్భయుండై మహోత్సవముతోడ నయోధ్యాపురంబు బ్రవేశించెను.

---

## అయోధ్యాకాండము.

ఇట్లు ప్రవేశించినపిదప భరతశత్రుఘ్నులను, మేనమామయగు నశ్వపతి, ప్రీతిపురస్సరంబుగా నిజనగరంబునకు దోడ్కొనిపోయి యమూల్యవస్త్రాభరణ వస్తువాహనాదులొసంగి పుత్రస్నేహముచే లాలించుచుండగా వారు అచ్చట నివసించుచు వృద్ధుండగు దశరథుని తలచుకొనుచుండిరి. ఇచ్చట దశరథుండును, మాతులపురంబున నున్న భరతశత్రుఘ్నులను స్మరించుచు తనపుత్రులలోనెల్ల మిక్కిలి సంతోషమునిచ్చువాడును సాక్షాద్విష్ణ్వంశసంభూతుండును, వైష్ణవతేజంబుచే వెలుంగుచుండు వాడును, వీర్యము, వినయము, శౌర్యము, ధైర్యము, మాధుర్యముగల మాటలుగలిగి అయోధ్యాపురంబున కలంకారభూతుండై యుండువాడును, తలిదండ్రులను సోదరులను మిత్రులనెల్లపుడు గౌరవించువాడును, సకలజనులమేలును, గోరువాడును, అనంతకల్యాణగుణ సాగరుండును, శీలవృద్ధ వయోవృద్ధ జ్ఞాన వృద్ధులగు సజ్జనులచే గొలు

వంబడియుండువాడును, సత్యవాక్య నిరతుండును, రాజ ధర్మమును పరిపాలనము సేయుటయందు మిక్కిలి నేర్పు గలవాడును, దుష్టసంహారముకొఱకు భూదేవిచే గోరంబడి నవాడును, ధనుర్వేదజ్ఞుండును, ధార్మికుండును, తన్ను సేవించిన జనులయొక్క నేత్రములను మనస్సును నిశ్చల ముగ స్తంభింపజేయునట్టి దివ్యసౌందర్యము గలవాడును న.గు శ్రీరామచంద్రునకు యౌవరాజ్య పట్టాభిషేకము సేయుటకు బ్రయత్నించి పురంబలంకరింప జేయుటను, పురజనులు సంతోషముతో రామపట్టాభిషేక వృత్తాంత మును బ్రశంసించుటను, కుబ్జయగు మంధర తెలిసికొని కైకేయి పాలికింబోయి ఓ మూఢురాలా! ఇంకను బరుం డియున్నావు నీసంపదకు హానివచ్చినది. శంబరాసురయుద్ధ సమయంబున నీభర్తవలన పొందిన వరద్వయమును నీభ ర్తకు జ్ఞాపకపఱిచి యావరద్వయమున నొక్కదానికి భరతాభిషేకమును రెండవ వరమునకు రామునకు అర ణ్యవాసమును గోరుము అటులగోరవేని శ్రీరాముండు రా జ్యాధిపతియగును, నీపుత్రుడు రాజ్యహీనుండగును, నీకు స్వాతంత్ర్యము లేక పోవును బాగుగవిచారింపుమని పలు విధములుగ బోధింప నాకైకేయి చిత్తభ్రంశమునొంది మూర్ఛిత వహించి దశరథునిజూచి యోప్రాణనాథా వేయి యేల నీవుసత్య ప్రతిజ్ఞగలవాడవగుదువేని పూర్వదత్త వరద్వయమున నాకుమారుండగు భరతునకు యౌవరా జ్యాభిషేకమును, జేయుము శ్రీరామునకు పదునాలుగు

.వత్సరములు వనవాసమును గలుగజేయుము అట్లుసేయని
యెడల నిపుడె మరణించెదననినవిని దశరథుండు మిగుల
చింతాక్రాంతుడై కైకేయితోడ శ్రీరామునిగుణాతి శయ
ములను పలుమారుచెప్పి రామపట్టాభిషేకము నంగీకరిం
పుమని యనేక విధంబులప్రార్థించినను కైకేయి యొప్ప
నందున నపారశోకార్ణవమగ్నుండై పరశవతజెందియుండె,
ఇంతలో వసిష్ఠునియాజ్ఞచే సుమంత్రుడు దశరథునొద్దకు
వచ్చి మహారాజా! వందనము, పట్టాభిషేక లగ్నంబాస
న్నంబయ్యె పురోహితాదులు సిద్ధముగనున్నారు,సూర్యో
దయసమయంబయినదియని మేలుకొల్పగా దశరథుండు,
ఓసుమంత్రా నీవాక్యములచేదిరిగి నామర్మంబులను భేదిం
చుచున్నావేమియనిన నతండమ్మహీపతి దీనస్వరంబును
ముఖవైవర్ణ్యమునుజూచి భయపడి యేమియుబలుక నే
రక మౌనియై యచ్చటనుండి కొంచెము అవతలికిజరగ,

దశరథుండు దైన్యమువలన స్వయముగ నేమియుజె
ప్పనందున కైకేయి యాతనిజూచి ఓసుమంత్రా! ఇమ్మ
హీపతి, రామ మహోత్సవ సంతోషముచే రాత్రియంత
యు జాగరణంబుజేసినందున డస్సినిద్రించుచున్నాడు కా
వున వేగముగ శ్రీరామునిదోడితెమ్ము,అనిన నతండానంద
ముతో రామసన్నిధికింబోవుచుండ మార్గంబున ననేకవ
స్తువాహనాద్యుపాయనంబుల గొనివచ్చుచున్న మహీపతు
లు తమరాకను మహీపతి కెఱింగింపుమని వేడుకొనిన
సుమంత్రుండు మరల రాజసమీపమునకువచ్చి యనేక

భంగుల స్తుతించి మహారాజ! భవత్సందర్శనార్థము నానాదేశమహీపతులు వచ్చియున్నారు వారిరాకను మీకెఱింగించుటకువచ్చితిననిన నృపతి మేలుకొని ఓసుమంత్రా! ఇంతకుమున్ను రామునిదోడి తెమ్మని నేను జెప్పియుంటిని నా యాజ్ఞను ఎందుకు ప్రతిహతము సేయుచున్నావు నేను నిద్రించలేదు వేగముగ రాముని రప్పింపుమనిన వినిసుమంత్రుం డట్లుసేయ. శ్రీరాముండు కైకేయిగృహంబునకువచ్చి యచ్చట నొకయాసనంబున విచ్ఛాయవదనుండై ముకుళితలోచనుండై యున్న తండ్రిని చూచి నమస్కరించి,పిదప కైకేయికి నమస్కరించి నిలువంబడియుండ, దశరథ నృపాలుండు కన్నులనీరుగ్రమ్మగా రామాయను మాటను మాత్రము పలికి పిదప రామునిచూచుటకుగాని మాటలాడుటకుగాని సమర్థుండు కాకపోయెను, అట్టి యపూర్వము గు జనకుని దురవస్థనుచూచి, శ్రీరాముండు సర్పమును పాదముచేస్పృశించిన వానిచందమున భయముజెంది ఇది యేమి నమస్కరించిన నన్నుజూచి మహారాజు యెదురొక్కని యానందింపకున్నాడు, ఒకప్పుడు నన్నుకోపగించి నను తత్క్షణమున ప్రసన్నుండగు నాతండ్రికి నాయందేమియీయాయాసముగల్గెనోయని దైన్యముజెంది శోకార్తుండై కైకేయికి నమస్కరించి యిట్లనియె.

ఓ తల్లీ అజ్ఞానముచలననే నపరాధమేమియుసేయలేదు ఎందువలననాతండ్రి కోపించుకొనియున్నవాఁడో నాకుజెప్పుము.నీవైననునాతండ్రిని ప్రసన్నునిగాజేయుము, యెల్లపుడు

•నాయందు వాత్సల్యముగలవాఁడు ఇప్పుడు వివర్ణవదనుం డై నాతో మాటలాడకున్నాఁడు, శరీరసంబంధమయిన విగాని మనస్సంబంధమైనవిగాని సంతాపములు బాధించ లేదుగదా? యెల్లప్పుడు సుఖములేగలుగుట దుర్లభంబు, ప్రియదర్శనుండగు భరతునియందుగాని, మహాసత్వుండ గు శత్రుఘ్నునియందుగాని,తల్లులయందుగాని, నశుభము నేమైనంబరికించెనా నాకుజెప్పుము, మహారాజును సంతో షపఱచకయు, పితృవచనమును జేయకయు, నేఁబండుగ లను తండ్రికోపగించిన వెనుక ఒక ముహూర్తకాలమైన ను జీవింపనిచ్ఛయింపను, ఓ యమ్మా నీవుగర్వముచే పరుషవాక్యంబుల నేమైనబల్కితివా? సవి నరముగ జె ప్పుము అని శ్రీరాముండడుగ కైకేయి యతనికిట్లనియె.

ఓరామా, మహారాజునకు కోపములేదు, వ్యసన మేమియులేదు, కొంచెము మనోభిప్రాయము గలదు నీవలని భయమువలన మాటలాడకున్నాఁడు, ప్రియుండ వగు నిన్నుగూర్చి అప్రియమును పలుకుటకు ఆతనికి వా క్కురాకున్నది, నీతండ్రి నాకుజెప్పినదానిని నీవు అవశ్య ము జేయవలయును,ఈయన పూర్వమునాకు వరమిచ్చి గౌ రవించి ఇప్పుడు ప్రాకృతునివలె పశ్చాత్తాపము జెందుచు న్నాఁడు, వరములనిచ్చెదనని ప్రతిజ్ఞచేసి నిరర్థకముగా గ తజలసేతుబంధము సేయనిచ్ఛయించుచున్నాఁడు. ఇదిధ ర్మమూలముగావున నిన్నువలెనే సత్యమునువిడువలేకున్న వాఁడు, మహారాజు మంచికార్యమునుగాని, చెడుకార్య

మునుకాని నియమించిన జేయంగలవేని నేను సకలము
ను జెప్పెదను మహీపతి నీవిషయమై జెప్పినది విపత్తుగా
నేరదు కనుక నేనేచెప్పెదను వినుము, ఈయన చెప్ప నేరడు
అనిధార్ష్ట్యముతో జెప్పగా శ్రీరాఘవుండది విని మిక్కిలి ఖే
దముజెంది మహీపతిసన్నిధియందు కైకేయితో నిట్లనియె.

ఆహా ఓ దేవీ నన్నుగూర్చి ఇట్టిమాటను చెప్పదగదు,
గురుండును హితుండును ప్రభుండును నగు నాజనకుని
యాజ్ఞచే నగ్నియందైనం బడుదును, విషమునైన భ
క్షింతును, సముద్రమునందైన మునుగుదును, కా
వున మహారాజుయొక్క మనోగతాభిప్రాయమును జెప్ప
ము చేసెదను ప్రతిజ్ఞ సేయుచున్నాను రాముండాడితప్పెడి
వాడుకాడు. అని చెప్పగా, ననార్యయగు నా కైకేయి,
అకుటిలుండును సత్యవాదియునగు రామునిజూచి మిక్కిలి
దారుణమైన వాక్యమును పలికెను.

ఓరామా! తొల్లి దేవాసుర యుద్ధమున దన్నిననీతండ్రి
నాచేరక్షితుండై వరద్వయమునొసంగియున్నాడు, దానికి
ఫలము భరతునకు పట్టాభిషేకమును, నీవు ఇప్పుడే దండకార
ణ్యమునకుపోవుటను, గోరుచున్నదానను, ఓరామా! నీవుస
త్యవంతుడవై నీతండ్రినిసత్య ప్రతిజ్ఞగల వానిగ జేయదలం
చితివేని నామాటను వినుము. తండ్రి మాటయందున్న
వాడవై పదునాలుగు సంవత్సరములు దండకారణ్యము
నాశ్రయించి ఈయభిషేకమును మాని జటాజినధరుండ
వై వనవాసముచేయుచుండుము, భరతుండు నానారత్న

సమాకీర్ణంబును, గజాశ్వరథ సంకులంబైన వసుంధరనేలుచు, అయోధ్యయందు నివసించుగాత, ఇదియె మహారాజుయొక్క మనోగతాభిప్రాయము నీతండ్రి నీయందు అధిక ప్రేమముగలవాడగుటం జేసి ఈమాటను నీకు జెప్పుటకుగాని, నిన్నుజూచుటకుగాని శక్తుండుగాడు, ఈ కార్యమును జేసి, నీతండ్రిని సత్యమున దరింపజేయుము అని కైకేయి పలికిన కఠోరవాక్యములవిని రాఘవుండు మనంబున నించుకయైన ఖేదంబునొందక కైకేయికిట్లనియె.

ఓ యమ్మా నీవు చెప్పినట్లు జటావల్కలముల ధరించి వనమునకేగెదను సంతోషింపుము. నాతండ్రినన్నుజూచి విశ్వాసము జూపక విపన్నుడై యుండుటకు కారణంబేమి? గురుండును హితుండును, కృతజ్ఞుండును ప్రభుండునగు నాజనకునిమాటను నేను జవదాటుదునా? భరతునకు నభిషేకము జేయుదునని తానే నమ్మతితో జెప్పనికారణముచేత నామనస్సు మిగులబరితాపము జెందుచున్నది, తండ్రిచెప్పకున్నను నాయొక్క సకలైశ్వర్యమును సంతోషముతో భరతునకిచ్చునట్టి వాడను, పితృాజ్ఞచేనిచ్చుటకు నాకువిచారమెందుకు గలుగును. కావున నాజనకుని సత్యమును చెల్లింపబూని నీకుప్రియముగ నా సంపద్భోగముల విడిచి సకలమును భరతున కొసంగి పదునాలుగు వత్సరంబులు అరణ్యంబుననుండెదను, ఇప్పుడు మహీశుండు, తలవంచుకొని కన్నుల నీరుగార్చుచున్న కారణమేమి, నీవు నాజనకుననునయించి తదాజ్ఞా

నుసారముగా భరతుని రప్పింపు మనిన కైకేయి సంతో.
షించి ఓ రామా! శీఘ్రగమనముగల దూతలంబంపి భర
తునిరప్పించెద, నతండు వచ్చునందాక, నీ విచ్చటనుండక
కుము వేగముగ నిపుడేయరణ్యమునకుబొమ్ము ఈ భూపా
లుండు సత్యమును నెరవేర్చుకున్నానను లజ్జచే మొగం
బువంచుకొని మూర్ఛితుండై సంభాషింపజాలకున్నాడు,
నీ వరణ్యంబునకుంబోవు నందాక భవజ్జనకుండు మజ్జనభో
జనాదులు సలుపండని తొందరపడి దారుణవాక్యంబుల
పలికినను రఘునాధుండు, ధీరాగ్రగణ్యుండుగావున కొం
చెమైనను ఖేదింపకుండె. నచట కైకేయీ దారుణవాక్య
ములకు రోయుచు శోకాశ్రుపరిపుతుండై నిట్టూర్పులు వి
డుచుచు స్వర్ణపర్యంకమునంబడి పొరలుచున్నతండ్రింగాం
టనె త్రినాంత్వవాక్యములచే దేర్చికశాతాడితంబగునశ్వము
చందమున వనగమనంబునకు త్వరపడుచు కైక కిట్లనియె.

ఓ తల్లీ నేను ధనపరుండనుగాను, కేవలము ధర్మ
మందునిలిచి లోకమునకు మేలుచేయువాడను, నన్ను
మహర్షులతో సమానునిగ నెన్నుము, ప్రాణమునైనత్యజిం
చి పితృవాక్య పరిపాలనముసేయుటయే నాకు బరమ
ధర్మము అట్టికార్యమును మజ్జనకుండుచెప్పకున్నను నీవు
నాకు నియంత్రివగుటంజేసి నీయాజ్ఞను శిరసావహించి
అరణ్యముననుండుటకు సిద్ధుడనై యుండ, నాతోజెప్పక
నన్మజ్జనకుని నిర్బంధించితివిగావున నాయందలి బుజుత్వౌ
దార్యాది సద్గుణంబులగొంచెమైన నెఱుంగకున్నావు.

మాతల్లితో జెప్పి సీతను అనునయించి ఇప్పుడే యరణ్యము నకు బోవుచున్నాను కొంచెముసేపు ఓర్చుకొనుము భరతు డు పితృశుశ్రూష జేయుచు రాజ్యపరిపాలనము సేయునట్లు జేయుటయే నీకు పరమధర్మము అనిపలుకుచున్న సుతుని వాక్యంబులువిని దశరధుండు దుఃఖమును సహింపలేక మహాధ్వనితో కన్నులనీరుగార రోదనముచేసెను. అప్పు డు శ్రీరఘునందనుండు జనకుని దుఃఖమును సహింపజాలక తానును చింతాక్రాంతుండై, దశరధునకు కైకేయికి నమస్కరించి యచ్చటనుండి బైలువెడలి పిత్రాజ్ఞను స్మ రించుకొనుచు సీతాలక్ష్మణసహితుండై సుమంత్రానీతర ధారోహణముజేసి పౌరజనులు పరివేష్టించి తనవెంట వచ్చుచుండ బహుదూరంబరిగి వెనుకకు దిరిగిచూడగా పౌరులుగాన్పింప నచ్చటరధంబుదిగి పౌరదుఃఖోపశమనం బుజేసి సుమంత్రాదుల విడిచి పాదచారియై ధనుర్బాణ ములధరించి వనమునబోవుచు నచ్చటనున్న ప్రియసఖుం డగు గుహునిచే సత్కారంబువడసి జటాచీర వసనంబు లధరించి గుహునిచే జూపబడిన మార్గమున బోవుచు గంగాతీరముజేరి గుహునిచేదేబడిన యోడనెక్కిగంగా నదినిదాటి భరద్వాజాశ్రమంబుజేరివారిచే నతిథిసత్కా రంబువడసి అచ్చటనుండి చిత్రకూటంబుజేరి సీతాలక్ష్మ ణ పరిచరితుండై చిరకాలము అచ్చటనివసించె.

అయోధ్యయందు దశరధుడుపుత్రవియోగమునుస హింపలేక అపారశోక సాగరంబున మునింగి కాలధర్మము

జెందగా వసిష్ఠనియమనంబున మంత్రులు దూతలంబ . నిచి యుధాజిన్నగరంబునుండి భరతశత్రుఘ్నుల రావింప మార్గంబునగలిగిన దుశ్శకునములవలన మిక్కిలివిచారపడుచున్న భరతుండు గృహంబున జనకుని, రామలక్ష్మణులను గానక తనతల్లియగు కైకేయివలన యావద్వృత్తాంతమును విని యత్యంతశోకంబుతో భూమిపయింబడి రోదనముచేసి మూర్ఛిల్లి లబ్ధసంజ్ఞుండై కైకేయింజూచి తండ్రిచేతను, పితృసమానుండగు అన్న చేతను విడువంబడిస్వధర్మహతుడనైన నాకీరాజ్యమెందుకు,కులమును నశింపజేయుటకు కాళరాత్రివలె వచ్చియున్నావు ఓ కులపాంసనీ? పతిని పరలోకమునకును సీత పతిని మహారణ్యమునకును, బంపిన నిన్నుపతినుత ఘాతినియని చెప్పరా? క్రూరురాలా! నీవు భ్రూణహత్యాది పాతకమును జెంది భర్తృలోకమును బొందక నరకమును జెందుదువు అని పలువిధములదూఱి, కైకేయీ మంధరలనతిరోషావేశంబున హింసింపంజూచిన శత్రుఘ్నుని సాంత్వవచనములచే కోపశమనంబుచేసి, సత్యపరాయణుండును ధార్మికుండును సర్వభూతహితుండును పితృసముండునునగు శ్రీరఘునందనుని సన్నిధికేగి ప్రసన్నునిజేసి తోడ్కొనివచ్చి పట్టాభిషిక్తుని జేసి జటాచీరధరుండనై నేను అరణ్యంబుననుండెదనని మనమున నిశ్చయించి జనకునికి అపరక్రియలజరిపి శత్రుఘ్న సమేతుండై చతురంగబలముతోడను పురజనులతోడను, మాతృజన బంధుజనసహితముగా పయనంబైచి

త్రికూటంబునకరిగి శ్రీరఘునందనుని చరణారవిందముల పైఁబ్రాలి, ఆర్యా! యనిమాత్రముచ్చరించి కన్నులనీరు గ్రమ్మఁగా దుఃఖముచే నేమియుంబలుకలేక యూరకుండెను.

అప్పుడు భక్తవత్సలుండగు దాశరథితమ్ముని నూరార్చి కౌగిలించుకొని కుశలప్రశ్నముసేయ భరతుండు పితృమరణవృత్తాంతమును జెప్ప నత్యంతశోకావిష్టుండై దశరథునకుదకాంజలి జేసి, తమ్మునిజూచి ఓ భరతా! నీవు జటావల్కలములధరించి ఇచ్చటికివచ్చిన కారణమేమని యడుగ నతండు ఆర్యా! నాకు జ్యేష్ఠుండవును పితృతుల్యుండవుగావున, ననఘా! నీ పిత్రార్జితమగు రాజ్యమును బ్రీతితోఁగైకొని అస్మదాదిలోకబంధుహితమిత్రవర్గమున కానందము సేయుచు రాజ్యమునేలుము. నేనువనముననుండెదననిన, శ్రీరాముండు, భరతు ననేకవిధములుగ నాశ్వాసించి పిత్రాజ్ఞాపరిపాలనం బవశ్యకర్తవ్యము అని అనేకధర్మంబులనుపదేశించి, మఱియునిట్లనియె. ఓ భరతా? నీవు శత్రుఘ్నునితోఁ గూడి బ్రాహ్మణపురస్సరంబుగా రాజ్యము నేలుచు శ్వేతచ్ఛత్రచ్ఛాయల జరింపుచు సౌధప్రాసాద హర్మ్యవిమానాగ్రభాగంబుల వసింపుచు శత్రుఘ్నుండు హితంబాచరింపుచుండ సుఖముగనుండుము, నేను సీతాలక్ష్మణసహితముగా దండకారణ్యంబు బ్రవేశించి మునివేషంబున మునిసహితుండనై మృగంబులం బాలింపుచు దట్టమైనచెట్ల నీడలజరింపుచు పర్ణశాలయందధివసించి లక్ష్మణుండు హితంబాచరింపుచుండ సుఖముగ

నుండెద. పుత్రులమైన మనమునల్వురము నస్మజ్జనకుని సత్యస్థునిజేసి, విషాదమునక్కు వర్తింపుదము అని భరతు నితోనుడువుచుండ జాబాలి వసిష్ఠాదులందరు భరతుని దైన్యమునుజూచి ఓ రాఘవేంద్రా! భరతోక్తులనంగీక రింపుమనియు క్తియుక్తంబులుగా బలికినవిని సీతాపతిధర్మో పపన్నంబుగాపితృసత్యంబు నన్యధాజేయనొల్లననిదృఢము గాజెప్పినవిని, భక్తుండగు భరతుడు కరకమలంబుల ఫాల మునసోక గీలించి మరల గద్గదస్వరముతో నిట్లనియె.

ఓ దశరధపుత్రా! యస్మద్వాంఛితము భవజ్జనసీవాం ఛితము సఫలంబుగాగ గులధర్మంబగు రాజ్యపరిపాల నముసేయుము, నేను ఘనమతినిగాను ప్రజలరంజింప జేయంజాలను. కర్షకులుమేఘుని నిరీక్షించుభంగి, పౌ రులు మిత్రులు, యోధులు, మంత్రులు, మున్నగు వారం దరు సదభిప్రాయముతో కులపావనుండవగు నిన్నేకోరు చున్నారు. శ్రేష్ఠధర్మ కౌశలబలంబునను, ఘనమగుబుద్ధి యోగబలంబునను, బాహుబలంబునను జనులబాలింప సమర్థుండవునీవే మహాత్మాయని పరమార్తుండై శ్రీరా ముని చరణారవిందములపైబడి ప్రాంజలియై బహుప్రకా రంబుల మత్తహంసస్వరముతో బ్రార్థించిన, నతనిసద్భా వంబునకు సంతసిల్లి రఘునాధుండు, శ్యామలదేహుండు ను పద్మదళాయతనేత్రుండునునగు,భరతునిజూచి కరుణాక టాక్షములు సోకనిజాంకమున నిడుకొని యెల్లవారు విను చుండ వత్సా! నేను యెంతచెప్పిననువినక ఇట్లుకృశించు

చున్నావేమి? నీవు స్వభావముగనే గుణగరిష్ఠుండవు గురుశిక్షితంబగు మహాబుద్ధి నిన్నుజెందియున్నది. భూపరిపాలన సమర్థుండవైతివి సందియమెందుకు. చంద్రుండు కాంతిదప్పినను, హిమవంతుడు, హిమమునుపిడిచినను, సముద్రుండు వేలదాటినను, నేను పితృశాసనమును తప్పను, నీవు గురుజన మాతృజనముల మన్నించుచు సుఖముగరాజ్యమునేలుము. అనిచెప్పి బహువిధముల ననునయించిన జ్యేష్ఠపరతంత్రుండగు భరతుండు భ్రాతృవాక్యముల మీర జాలక అంగీకరించిమరల భ్రాతృ చరణంబుల తనశిరంబు సోకం బ్రణామిల్లి యిట్లనియె.

రవికులతిలకా? ధర్మయుక్తమైన భవచ్చిత్తమును ఏప్రకారంబుననైనను మరలింపలేనైతిని నాయందు అనుగ్రహించి దేవరదారు సువర్ణాలంకృతములగు నీపాదుకలయందు భవచ్చరణంబులచే నధిరోహణముసేయుండు, ఈపాదుకలు సకలలోకముల యోగక్షేమమును జేయంగలవు, అనిన సీతానాథుండు సమ్మతించి అటుల పాదుకలనధిరోహించి యాపాదుకలను మహాత్ముండగు భరతునకొసంగ, నాతండాపాదుకల శిరంబున నిడికొని మహాత్మా! నేను ఈపదునాలుగు వత్సరంబులును జటావల్కలముల ధరించి ఫలమూలాశనుండనై సింహాసన ప్రతిష్ఠితంబులైన ఈపాదుకలకు రాజ్యకార్యములను మనవిచేయుచు దేవరవారి యాగమనదినంబుల, గణింపుచునుండెదను. అగడువు పూర్ణంబైన ఉత్తరక్షణంబున మీసందర్శనముదా

రకనియెడల నగ్నింబడుదును. ఇది సత్యంబని ప్రతిజ్ఞ సే. య, మహాతేజుండగు రఘునాథుడు భరత వచనంబుల క త్యంతము సంతసిల్లి ఆలింగనముచేసికొని శత్రుఘ్నునిగూడ కౌగలించుకొని, భరతునకిట్లనియె

వత్సా! తల్లియగు కైకేయిని రక్షింపుము దూషింప వలదు ఇందుకు సీతచేతను నాచేతను ఆనబెట్టబడుచున్నావు. అనిపలికి కన్నులనిండ నశ్రువులనింపుచు భరతశత్రుఘ్నుల నయోధ్యకు బొండని యనుజ్ఞనొసంగి చిత్రకూటాశ్రమమునకు సమీపమునసుండెడి మునులు ఖరాది రాక్షసులవల్ల తమకు జెందు నపకృతులను మొరలిడనాలకించి యచ్చటనుండి ప్రయాణంబై అత్రిమహామునియాశ్రమంబుజేరి యమ్మహర్షిచే సత్కృతుండై, ఋషిపత్నియగు ననసూయచే నలంకరింపబడిన సీతతోడను, సౌమిత్రితోడను చొరనశక్యమైన దండకారణ్యమును బ్రవేశించె.

## అరణ్యకాండము.

అట్టి మహారణ్యంబున బ్రాహ్మ్యలక్ష్మిచే బరిపూర్ణంబై పరమర్షినంఘములచే నిండిన తాపసాశ్రమ మండలములజూచుచు అచ్చటిమునులు తమతమ మనోభావంబులదెలుప వానికి సదుత్తరంబులిచ్చుచు వారొసంగినవన్యంబులగు ఫలమూలంబులకు సంతుష్టులై కొంతదూరం బరిగి శార్దూల భల్లూకాది యుక్తంబగు కాఱడవిని బోవుచుండ వికృతాకారుండై ఘోరదర్శనుండగు విరాధుం

డని యెదు రాక్షసుండొకడు, మూఁడుసింగములను, నాలుగు పులులను, రెండుతోడేళ్లను ఒక ఇనుపశలాకయందు గ్రుచ్చి కేలంబూని, రామలక్ష్మణుల సమీపమునకువచ్చి భయంకరస్వరముతో ఎవరుమీరు మునివేషధారులై ఒక వనితను గూడయుంచుకొన్నారని యాక్షేపించి, నన్నెఱుంగుదురా? నేను ఋషిమాంసముల భక్షించువాఁడను, ఇది నాభార్యగాఁగలదనుచు బరుగిడి సీతనెత్తుకొని పోవుచుండఁగానప్పుడు జనకపుత్రి భయముచే గడగడవడంకుచుండ రామలక్ష్మణు లతికోపంబుతో వజ్రతుల్యబాణంబులచేవాని శూలంబును, ఛేదించి యాదుష్టునిపైపయి బాణవర్షంబు గురిపింప నారక్కసుండు పర్వతంబులు పగులునట్లు అతిభయంకరంబుగ నఱచి సీతనువిడిచి రామలక్ష్మణులనెత్తుకొనిపోవుచుండ రామ లక్ష్మణులు తమదివ్య శరములచే వానిబాహువుల ఖండించి చిత్రవధచేసినను వాఁడుచావక నేలంబడియుండిన వానిని భూమియందు మహాబిలంబు త్రవ్వి యందుప్రవేశింపజేసి శిలలచేగప్పి పూడ్చిరి.

అచ్చటనుండి బైలువెడలి శరభంగ సుతీక్ష్ణాది మునివర్యుల యాశ్రమంబులకరిగి వారివలన సత్కృతులంది అచ్చటనుండి యగస్త్యాశ్రమముజేరి యమ్మహర్షికి నమస్కరించి క్షేమంబరసి యమ్మహానుభావునివలన దివ్యంబులగు ఖడ్గబాణతూణీర కోదండంబుల గ్రహించి, యాఋషి పంచవటీ తీరంబు వాసయోగ్యంబనిదెల్ప నచ్చటికేగుచు మార్గమధ్యంబున నొక వటవృక్షము మీఁద

పర్వతమువలెగూర్చుండియున్న గృధ్రమునుజూచి వానిని రాక్షసుండనితలచి నీవెవ్వండవని యడుగ వృద్ధుండగు నాగృధ్రరాజు ఓ రఘునందనా నేను నీపితృసఖుండను జటాయువను వాడను అనిన, నతనినిబూజించి అచ్చటికి సమీపముననున్న పంచవటింజేరి అనుజవిరచిత పర్ణశాలయందధివసించుచు పదుమూడు వత్సరంబులుగడపిరి.

అంత నొక్కనాడు గోదావరీస్నానంబాచరించి మహర్షులు తన్నుగొలువ లక్ష్మణునితోడ బుణ్యకథేతిహాసంబులు వక్కాణింపుచున్న సమయంబున రావణునిచెలియ లగు శూర్పణఖయను నొకరక్కసివిలాసముగావచ్చి శ్రీరఘునందనునిజూచి కామాతురయై, తనవికృతముఖమునకు, శ్రీరాముని సుందరముఖమునకును, తనమహోదరమునకు, శ్రీరాముని సూక్ష్మమై వర్తులమైన నడుమునకును, తనవికటనేత్రములకు, శ్రీరాముని విశాలనేత్రములకును, తనరాగివెంట్రుకలకు, శ్రీరాముని తుమ్మెదలవంటి నల్లని వెంట్రుకలకును, తన విరూపమునకు, శ్రీరాముని దివ్యసుందరాకారమునకును, తనభైరవస్వరమునకు శ్రీరాముని మత్తహంసస్వరమునకును, మఱియు ననేక తనదుర్లక్షణములకు, శ్రీరాముని యుత్తమోత్తమలక్షణములకును నజ్ఞానముచే సరిపోల్చుకొనుచు మోహవిభ్రాంతయై ఓ రామా? ఈకురూపిణియైన సీతను వదలి నన్నుజేకొని నాతో సుఖింపుము, అనినవిని శ్రీరాముండు మందస్మితముజేసి శూర్పణఖ కిట్లనియె,

ఓసీ! ఎట్టిదియో యొకతెనాకు భార్యయున్నది. నీకు సవతిపోరు ఎందుకు, నాతమ్ముఁడు ఈతఁడు మిక్కిలి యంద చందముగలవాఁడు ప్రకృతమున, అతనికి భార్యలేదు అతనిని వరింపుము నీయిష్టము నెఱవేరును పొమ్మని పరిహాసముగా నవ్వుచుబలికిన నిజంబనుకొని యారక్కసి, కామమోహాంబు లినుమడింప లక్ష్మణుంజూచి యడిగిన నాతండు నవ్వుచు ఓసీ! నేనే, రామునకుదాసుండను, నాకు నీవుదాసివై యేమిలాభము. అనిన నారాక్షసి, సీతను భక్షించినయెడల, తననువరింతురను దురపేక్షతో జానకి ని కబళింపబోవుచుండుటనుజూచి శ్రీరాఘవుండు, లక్ష్మణా! క్రూరులతో విశేషపరిహాసము కూడదు దీనిని విరూపిణిగాజేయుమనిన లక్ష్మణుఁడు తెలిసికొని శూర్పణఖముక్కుఁ జెవులను తెగగోసిన నదికొండ గుహాలు ప్రతిధ్వనులిచ్చునట్లు యేడ్చుచు బరుగిడిపోయి యన్నయగు ఖరాసురునితో దెల్ప నాదైత్యుండు విరూపము నొందియున్న దానింజూచి ఖేదించి యావృత్తాంతమంతయు నెఱింగి యుగ్రుండై పదివేల మదపుటేనుంగుల బలముగల పదునలుగురు రాక్షసులను బిలచి యా మనుష్యులనుజంపి రండని యాజ్ఞాపించిన, వారు శూర్పణఖతోడ నచ్చటికిం జని యుద్ధమున రామునిచే హతులగుటయు, శూర్పణఖ తిరిగివచ్చి యావృత్తాంతము ఖరునకు దెలుపవిని ఖరదూషణత్రిశిరఃప్రముఖ రాక్షస వీరులుతమతమ సైన్యముల తోడ రామునెదుర్కొని యుద్ధరంగమున హతులైరి.

ఇట్లు శ్రీరాముండొక్కరుండు జనస్థానమును విజనస్థానము గావింప,నచ్చటనున్న మహర్షులు పరమానందము నొంది దాశరథినిగొనియాడిరి. జానకియు, ఘోరశత్రువుల జయించి మహర్షులకు సుఖమొసంగిన ప్రాణేశ్వరుని జూచి అత్యంత హర్షముతో గాగిలించుకొనెను.

ఈఖరదూషణాదుల మరణవృత్తాంతమును అకంపనుండనియెడి రాక్షసునివలన రావణుండెఱింగిమారీచునిరప్పించి ఓమారీచా! నాచెలియలి ముక్కు చెవులుగోసి జనస్థానము, నరాక్షసముగా జేసిన రామలక్ష్మణులను మోసము జేసి జనకపుత్రిని నపహరింపదలచి, యేనొక్కయుపాయము నూహించితి. అది నీవలనంగాని కానేరదనినవిని మారీచుండు రావణువచనంబుల ఖండించి శ్రీరాముడజేయుడనియు, నతని తేజం బప్రమేయంబనియు నతని నెదిరించిన రాక్షసకులం బంతయు నశించుననియుం జెప్పిన రావణుండతి క్రుద్ధుండై మండిపడగా నతని యాటోపంబుచూచి భయపడి మారీచుండు కాలము ననుసరించి యొప్పుకొనిన రావణుండు సంతసించి మారీచా! నీవు విచిత్రరూపముగల బంగారు లేడిరూపమును ధరించి పంచవటీ సమీపమున నున్న పర్ణశాలయొద్ద తిరుగుచుండుము, అనిన విని మారీచుండట్లుచేయ, నాసమయమున జానకి పుష్పములగోయుటకు నచ్చట దిరుగుచు నావిచిత్ర మృగమునుజూచి యాశ్చర్యపడి రామలక్ష్మణులంబిలిచి యామృగంబును తనకు బట్టియిమ్మని యడుగ రాఘవుండు లక్ష్మణుని పర్ణ

శాలయందు సీతను గాపాడ నియోగించి అమ్మృగమును బట్టుటకు దానిని వెంబడింపనది విచిత్రముగా గంతులువే యుచు సమీపించుచు పట్టబోవునప్పుడుచేతజిక్కక, బహు దూరంబరిగిననది మాయామృగంబని నిశ్చయించి రాఘ వుండలిగి యొక్క బాణంబునేసిన నారాక్షసుండు భయం కరముగా నఱచి మృగరూపంబువిడిచి మారీచరూపము నొంది రాముని కంఠస్వరముతో దైన్యముదోప జానకివిను నట్లు "హా సీతా; హా లక్ష్మణా! యాపద నొందుచున్నా ను" అనియఱచుచు మృతినొందె.

ఆ యార్తధ్వనిని ఆశ్రమ మందున్నసీతాదేవి విని రా మునకు ఎద్దియోకీడువాటిల్లెనని భయము నొంది లక్ష్మణుని బోయి రక్షింపుమని వేడిన, సౌమిత్రిజానకితో నిట్లనియె, ఓయమ్మా! నీవిభుండు దేవదానవ యక్షరక్షోధిపతులచే జిక్కువడడు, మహాధీరుండు, మహాసత్త్వుండు పరంధా ముడు, అవధ్యుడు, అతనికి హానిలేదని నొక్కి వక్కా ణించుచు ఈ క్రూరవనంబున నిన్నొంటిగా విడిచిపోవుట నాకుతగునా? రఘుపతివలన మాటవచ్చును, ఒంటిగాని న్ను విడువగూడదు, అదిరాక్షస మాయయేకాని వేరొం డుకాదు నీవు భయమునొందవలదని యూరడింప, నామా టలను,జానకినమ్మక,నిజముగాభర్తవిపన్నుండాయెనని తల చి తనకు బ్రతివచనముచెప్పిన లక్ష్మణుని యందుకోపించి యనదగని కర్ణకఠోరవాక్యముల బలుమారు దూఱిన, న తండు క్రుద్ధుండై వనదేవతలువినునట్లు ఓజానకీ! నీవు నా

కు తల్లివి నేను పాపకృత్యములజేయువాడను కాను; స్త్రీ స్వభావముననన్నిట్లు దూఱుటబాడిగాదు పోకుండిన శతుని మాడ్కినన్ను దూఱుచున్నావు పోయిన రాఘవుండలుగుటయేకాక నీకేమైన యాపదకలుగునన్న భయము బొడముచున్నది రెంటను నాకుదిరస్కారము సిద్ధముగనున్నదియని పలుకుచు తల్లీ! ఇకనీయాజ్ఞచొప్పున బోయితోడ్కొనివచ్చెదను భద్రముగా నుండుమనిచెప్పి యచ్చటనుండి వెడలి రామసన్నిధికి బోయెను.

అంత దశకంధరుండు సమయముచూచి మాయచేయతివేషమును ధరించి ఆయాశ్రమమునకురాగా, కపటయతియనియెఱుంగక జానకి అతనింబూజింప నాదురాత్ముండు తన నిజరూపమునుజూపి. తన్నువరింపుమని సీతంబ్రార్థింప ఆ సతీతిలకము ఇదియేమి విపరీతమని వడకుచు రావణుని తృణప్రాయునిగాతలచి యరుణలోచనయై ఓరీ నీచా! నీవు కోరందగని యర్థమునుగోరితివి గనుక శీఘ్రముగా నాథుచే నశింపగలవు అని పరుషంబుగా బలికిన; ఆపాపకర్ముండు బలాత్కారముగ నొకచేత జానకి తలవెండ్రుకలను, ఒకచేత కాళ్లనుపట్టుకొని రథమునెక్కి అంకభాగమున గూర్చుండబెట్టుకొని పరుషవచనముల బెదరించుచు గగనంబునకెగసి పోవునప్పుడు వనదేవత లాభయంకరుని జూచి యాక్రోశించిరి.

ఇవ్విధమున పట్టుబడిన సీత తనదురవస్థను నిందించుకొనుచు నున్మత్తవలె భ్రాంతచిత్తయై రామలక్ష్మణు

లంబిలచుచు నన్నురక్షింపుడని విలపించుచు తనవృత్తాం తమును రామునితోజెప్పుండని వనదేవతలం బ్రార్థించు చు తనముందట గనబడిన జటాయువును జూచి యోగృ ధ్రనాథా! నావిభుండగు రాముండు లేనిసమయమున నీ రాక్షసాధముడు నన్ను ఈయరణ్యమున గొనిపోవుచున్న వాడు వీడుఅతి శూరుండు గనుక యుద్ధమున నీవు జయిం పజాలవు ఇదియంతయు నారామునకు జెప్పుము అనినవిని జటాయువు రావణునకు హితముపదేశింప, నతండామాట లవినక జటాయువుతో యుద్ధముచేసి యతనివలన క్రూర ఘాతంబులంబడి విరథుండై నేలంబడియు,ముదిమిచేతడస్సి యున్న జటాయువుంజూచి క్రమ్మఱ నమ్మహీతనయంగొని యంబర వీధి నతిత్వరితగమనంబుతో బోవుచుండ జటా యువు లేచి వెండియు నారక్కసుని తనముక్కుతోను నఖములతోను జీల్చియడుగుసాగకుండునట్లు యుద్ధముసే య రావణుండు సీతనచ్చటవిడిచి బాహుయుద్ధమున దన కత్తిచేత వృద్ధుండగు జటాయువు ఱెక్కలను పాగముల ను ఖండించిన, నతండువిసంజ్ఞుండై నేలంబడియె.

ఇట్లు ప్రాణముల యందాశనుంచక రామకార్యము కొఱకు బ్రవర్తించిన జటాయువునుజూచి వైదేహిమిక్కి లి వ్యసనముజెంది యాతనిని కరంబులచేస్పృశించి నన్ను రక్షింపవచ్చిన యాపుణ్యాత్ముండు ఈపాపాత్మునిచే నిహ తుండాయెను ఈతని ఋణమును నీవెట్లుదీర్పుదువు హాప్రా ణనాథా! హా దయానిధీ! హా లక్ష్మణా! యని యెలుం

గ తిరోదనముచేయుచు వృక్షమూలమున నొదిగియుం

అప్పుడా రక్కసుండు తిరిగి బలాత్కారముగా, తన్ను గ్రహించి ఆకసంబునబోవుచుండ సీతాదేవి ఆ పాపిని, పరుషవాక్యంబులచే దూషించుచు ఓరీ నీవు శూరుండవేని నా ప్రాణనాథుండువచ్చువరకు నిలువుము దొంగవలె పాఱిపోవుచున్నావు నన్నువిడువుము లేకున్న మహాతేజస్సంపన్నుండగు నాప్రాణేశుండునిన్ను చిత్రవధముసేయునని పలికినను, ఆమాటలను చెవినబెట్టక సంభ్రమముతో బోవుచుండ, మార్గంబుననుండు పర్వతమందువసించుచున్న వానర మండలమునుజూచి జానకి తన ఆభరణములను వస్త్రమున మూటగట్టి వారిసమీపమునవేసి తనస్థితిని వారికెఱింగిచి శ్రీరామునితో జెప్పుడని చెప్పగానాకపులు ఆభరణముల మూటనుగ్రహించి రావణాపహృతయగు సీతంగాంచిరి. ఇదియంతయు నాదురాత్ముండు తెలిసికొనక యేపరవశంబునతనయంతఃపురముజేరి తనభాగ్యంబంతయు సీతకుంజూపి నన్నేలుకొమ్మని ప్రార్థించిన, ఓరీ నీచాధమా! వేయియేల, రాముని సతినగునేను నీచేయిని ముట్టను, జగదభిరాముండగు నాప్రాణేశుని బాసి నిమిషమైన బ్రదుకజాలను, నీవునన్ను ద్రుంగినను ద్రుంగుము చంపినను జంపుము, నాపతిచే నీకును నీకులమునకును మరణము త్వరితంబుననే, సంప్రాప్తముగాగలదు చూడుమని యతిదారుణంబుగ బలికిన నలిగి రావణుండు పెదవులదర మిక్కిలి భయంకరమగు కంఠధ్వనితో ఇక ఒక సంవత్స

రముతోపల నన్నుంగలయకుండిన నావంటవాండ్లునిన్ను ముక్కలు ముక్కలుగా గోయుదురనిచెప్పి మహాకోపము తో సింహవ్యాఘ్ర భల్లూక ఖరసూకరాది ముఖంబులు గల రాక్షసాంగనల బిలచి ఈమానినిని మీరలు అశోక వనంబున నునిచిప్రియోక్తులతో సమ్మతిపరచి నాసొమ్ము గాజేయుడని యాజ్ఞాపించి గృహంబునను జనియె.

ఇత్తెఱంగున నాభూపుత్రి క్రూరరాక్షసీ వశంగతయై పులులనడుమనున్న లేడిచందమున భయశోకంబులు మనంబునం బెనగొన శ్రీరఘునందనుని దైవంబుగా భావించుచునశోకవనంబున ననన్యపరాయణయైయుండె.

ఇక్కడ దండకారణ్యమున శ్రీరాఘవుండు మాయామృగంబునుజంపి ఆశ్రమమునకేగు నప్పుడైన దుశ్శకునములకు గుందుచు మార్గమధ్యమున వచ్చుచున్నతమ్ముండగు లక్ష్మణునిజూచి తొట్రుపాటుతో లక్ష్మణా! రాక్షసభూయిష్ఠంబగు కాఱడవియందు సీతను ఒంటరిగా విడిచివచ్చుటతగునా? నాకుభయముగలుగుచున్నది యామృగనేత్రి క్షేమముగనున్నదా? ఈరాక్షస మాయలజూచిన సందేహము గలుగుచున్నది యనిన,లక్ష్మణుండునడిచినవృత్తాంతమును దెల్పగా విని రాఘవుండు సంతాపమోహితుండై అక్కటా? నాయమోఘ పరాక్రమంబునీ వెఱింగియు స్త్రీస్వభావముచే బలికిన కఠినోక్తులకు గోపగించి, మచ్ఛాసనం బుల్లంఘించి వచ్చితివి సీతందోడ్కొనియైన రాకూడదా! నీయవినయమునకేమిసేయుదు నాబాణము

చే హతుండై పడియున్న రాక్షసునిజూచుచు, అచ్చట యేమికీడువాటిల్లెనో దెలియకున్నదియని లక్ష్మణుని దో డ్కొని నిజాశ్రమంబునకుంబోయి యచ్చట సీతలేకుండు టనుచూచి లక్ష్మణా ! నీవు ఇచ్చటికివచ్చుటంజేసి నేనుత లచినదంతయు యథార్థమాయెనుగదా? ఇక యేమి సేయు వారము అని విలపించుచు, ఆహా నాప్రాణసఖి, రాక్షసు లచే నపహరింపబడియెనో లేక క్రూరమృగములచే జంప బడియెనో, భయముచేవనంబున దాగెనో, లేకపుష్పఫలం బుల గ్రహింపవెడలెనో లేక స్నానార్థము గోదావరికి బో యెనో అని తలపోసి నానాప్రకారంబుల జానకిని వెదకి యెందునుంగానక శోకసాగరమున మునింగి చెట్టు చెట్టు ను పుట్టపుట్టను నదీనదములను పర్వతములను గలయదిరి గి వెఱ్ఱిపట్టిన వానివగిది, వైదేహా జాడను వనదేవతల నడుగ నారంభించెను.

భుజంగప్రయాతము॥ లతాంగీ ధృతాంగన్యా, లావణ్య నష్టా, యతాక్షీ గదంబప్రియుండ మల్లీయర్కప, న్నితంబ గదంబావనీ జాతమాచూ,చితే చెప్పుమాయింతి నేమంబునాకున్॥

చామరవృత్తము॥ లోలనేత్రి గానవాదిలోల నారికేళమా, సాల మారసాలమా విశాలకందరాళమా, తాలమాతమాలమా మదప్రవృత్త కాండహిం, తాలమా ప్రవాళమా ఘనస్పృశద్ద్రుజాలమా॥

మత్తకోకిల॥ సారసాయతనేత్రి పోయినజాడ దెల్పవె నాకుమం, దారమా సహకారమా పమునగ్రయ కర్కరవీరమా, సారభూత కవీ రమా ఘనసారమాయటవీరమా, భూరికాంతి మయూరమా ఫలపూర మా సుకరీరమా।

మత్తకోకిల॥ మందయానను గానవా పిచుమందమా వటబృంద
మా, కుందమా యరవిందమా ఘనకోమలాంబరచుంబి మా, కందమా
నవకందమానను గాంచి పుణ్యము నొందుమా, చందనావనిజాతమా
వనిజాతమా గిరిజాతమా॥

తోటకవృత్తము॥ ఘన పల్లవకోమల గాత్రిని కాం, చనవర్ణశరీరి
ణి జారుముఖిన్, ఘనకేశిని సీతను గంటె వె కాం, చనవృక్షమ చెప్ప
ప్రసన్నమతిన్॥

చామరవృత్తము॥ పరాకు మాని నైపరాలి బాళిమీర నేడు నా,
మొరాలకించి యెందుబోయె మోహనాంగి సీత సి, వెతంగితేని వేడ్క
నమ్మహీజ జాడఁజెప్పవా, చిరాశిహర్షదాయవే ప్రవృద్ధబిల్వవృక్షమా॥

తరల॥ మదనురాశము గానవా యల మందయానను జానకిన్, ము
దిత చక్రము గానవా నృపపుత్రి జక్రపయోధరన్, సదమలాంబుజ పా
ణి గానవె సత్యతాంబుజనాదమా, కోకమత్తమ మ్మోన గానవా నవకో
మలభ్రమరీకచన్॥

వనమయూరవృత్తము॥ చంద్రికిరణ ప్రతిమ చారుదరహాసన్, సాం
ద్రమృగరాజ్ఞి విల సన్ముఖవిలాసన్, జంద్రనిభవర్ణ నలచంపకసునా
సన్, జంద్రకి సమూహమ రసాతినయి గంటే॥

మందాక్రాంతావృత్తము॥ కాంతారోర్వన్ ననువిడచి భూకన్య
దా నొంటి నేగెన్, జింతాశోకంబులు వొదమె మచ్చిత్తమందం గావి
లేన్ నీ, చెంతన్ నేడ ట్లరుగు గదా చెప్పి వంశంబ నాహ్వాత్, సం
తాపంబున్ దొలగనిడుమా చాల పుణ్యంబుగల్గున్॥

మాలిని॥ నిరుపమ గుణరాశిన్ నీలజీమూత కేశిన్, నరవరవరపు
త్రిన్ నవ్యహేమాభ గాత్రిన్, సరసిజదళనేత్రిన్ జానకిన్ జూపరమ్మా
పరసపనస జంబుకమ్మ్రజరాజంబులారా।

ఉపజాతివృత్తము॥ సౌదామినీ సన్నిభచారుగాత్రికా,
విదేహరాజాత్మజ విద్రుమోష్ఠికా, కాదంబినీ నీకసమానవాస,
మ్మునంబునన్ జెప్పుము నాకుఁబ్రీతికా॥

వంశస్థవృత్తము॥ ధరాసుతం గంటె కదంబగుచ్ఛమా,
వరాననం జూపు లవంగమంజరీ, గురుస్తనిన్ జూపవె కుందకుట్మలా
కరీంద్రహస్తోరువు గంటె కారికా॥

స్రగ్విణి॥ భామినిం గంటివే బంధు బంధూకమా, భూమిజం గంటివే పుష్పితాశోకమా, కామినిం గంటివే క్రమ కల్హారమా, రామవీక్షించి నేరమ్యమాయూరమా॥

అని యివ్విధంబున విలపించుచు హా లక్ష్మణా, సీత జాడను ఎవ్వరును జెప్పకున్నారు, ఇప్పుడేమి సేయువాడను ఈగోదావరినడుగుదము రమ్ము అని గోదావరినడుగ ఆ నది యేమియు జెప్పనందున మిక్కిలి చింతించుచుండ అచ్చటి మృగంబులు దోవంజూపునట్లు గుంపులుగా నేగుచుండగా ఆమార్గమున రామలక్ష్మణులుపోవుచు నాసమీపమున విఱిగి పడియున్న రథమును, ధనుర్బాణములను శ్వేతచ్ఛత్రమును, జూచి మఱియు పిశాచముఖంబులును మహాకాయంబులునగు గాడిదెలు చచ్చిపడియున్నవి, పగ్గంబులచేతబట్టి సారథియొకండు చచ్చిపడియున్నాడు. దేవరాక్షసార్హంబులైన బాణంబులు విఱిగిపడియున్నవి నాకుజూడగా ప్రాణసఖిని ఎవ్వరో రాక్షసులు చంపిరో లేక గొనిపోయిరోయని తోచుచున్నది. ఓలక్ష్మణా? అసురులతో వైరమునాకు మిక్కుటముగ సంప్రాప్తమయినది లోకము నరాక్షసముగావించెద, ఎవ్వరేని విబుధులు సీత

ను నాకొసంగరేని వారు ఆకాశమునందు చెలగితిరుగలేక చేష్టలుడిగి నాపరాక్రమమును జూడగలరు. అనికాలాగ్నివలె ఉగ్రుండై ధనుర్బాణంబులగైకొని యాలీఢపాదుండై ధనుష్టంకారముచేయుచు లోకత్రయమును సంహరించెదనని నిలువంబడిన లక్ష్మణుండు రాఘవునింజూచి యతిభక్తితో స్తుతించి,కోపోపశమనంబుచేసియిట్లనియె.

మహాత్మా! ఈ ప్రదేశము గిట్టలచేతను రథచక్రములచేతను అణగద్రొక్కబడి నెత్తుటిబొట్లచేదడిసి యుద్ధము జరిగిన స్థలముగాదోచుచున్నది. సైన్యస్థలముగానంబడనందున మనకపరాధియగు వాడొక్కండేయని తోచుచున్నది. ఒక్కని నిమిత్తము లోకమునంతయు ధ్వంసముచేయుట పాడిగాదు భూపతులు శాంతచిత్తులై యపరాధులదండింపుచు, కరుణతో రాజ్యపాలనముసేయ వలయు.నీకెఱుంగనిదేమియున్నది అనిన రఘునందనుండుఁకోపంబుడిగితమ్ముడా?ఇప్పుడేమిసేయుదమనిన.నతండు అన్నా మీబోటి మహాబుద్ధిసంపన్నులగువారు ఆపదలయందు ధైర్యము నవలంబింపవలయుననిన రాముండు లక్ష్మణునింగూడి ధనుర్బాణంబులకేలంబూని వనమున వెదకుచుండగా నొక్కచోట రక్తసిక్తాంగుడై పడియున్న జటాయువుంజూచి యాతనివలన నావృత్తాంతమంతయునెఱింగి మిక్కిలి దుఃఖించి అప్పుడు మృతిజెందిన జటాయువునకు దహనాది సంస్కారముగావించి యచ్చటనుండి క్రౌంచంబను నరణ్యమున సీతను వెదకుచుండ అమ్మహారణ్యంబున

కటిక చీకటివలె గానరాకుండెడియొక పర్వతగుహయొద్ద. మహాఘోరరూపముగల అయోముఖియను నొక రక్కసి తలవిరియబోసికొని కరాళంబు దెఱచి అన్న సమీపమున నున్న లక్ష్మణుని గౌగిటనెత్తుకొని నన్నుభార్యనుగా జేకొనుము, మనమిరువురము పర్వతచరియలయందు క్రీడింతము రమ్మనిన లక్ష్మణుండుకోపగించి దానికుచకర్ణనాసికల దనఖడ్గముచే ఖండించెను, అప్పుడారక్కసి భయంకరముగ నేడ్చుచు జనియె.

అంతలక్ష్మణుండన్ననుజూచి భక్తితోనంజలిచేసి మహాత్మా! నాసవ్యభుజం బదురుచున్నది, చిత్తముక్షోభించుచున్నది, మఱియు మంచిశకునంబులగుచున్నవి, కావున మనకు ముందఱ నొక్కయసహ్యంబైన భయమువాటిల్లును ఆనంతరము గొప్పమేలుగల్గును, అనిన, విని రాఘవుండదియెట్లొకో యని విచారింపుచుబోవుచుండ, వికారరూపముగల కబంధుడనియెడి రాక్షసుండొకడు కానంబడి యూదురాత్ముండు ఆమడదూరము పొడవుగల తన బాహువులుసాచి, సింహవ్యాఘ్రతరక్షు భల్లూక వరాహాది వనమృగంబులనెల్ల భక్షించుచు ప్రమత్తుండై వచ్చుచుండ, వాని బాహుమధ్యంబునజిక్కి

గానక క్రోశమాత్రంబరిగినను కబంధుడు తనబాహువులచే నాకర్షించినందున సమీపస్థులై చిక్కువడి మిక్కిలి ఖేదించుచుండ, ఆదైత్యుండు వీరలభ్రమింగుటకు సిద్ధపడు నంతలోనెఱింగి రామలక్ష్మణులు అతిసాహసముతో ఖడ్గ

ముచే నాకఠినుని బాహువులు ఖండించినవాఁడు భయంక రముగ నఱచి నేలంబడి మీరెవ్వరని యడిగిన వీరలుతమ వృత్తాంతమంతయుఁ దెలుప, నారక్కసుండు తనచరిత్రము ను తెలుపవిని రాఘవుండు, ఓ కబంధా! సీతనపహరించిన రావణుఁడెందు బోయెను వానివృత్తాంతమునంతయు నాకు నె ఱిఁగింపుమనిన నాతండు నేను శాపోపహతుండను, నాకు దివ్యజ్ఞానములేదు నన్నుమీరు దహనముచేసినయెడల ఆ వృత్తాంతము నెఱింగిన నాగుండెడి బోయినవారి పేరును నేను చెప్పఁగలనిన, శ్రీరాఘవుం డచ్చట గుంటత్రవ్విం చి అందు కబంధునునిచి శుష్కేంధనములచే దహనము సేయ, వాఁడు శాపవిముక్తుండై దివ్యదేహముందాల్చి వి మానమందుండి శ్రీరామునకిట్లనియె.

ఓ రాఘవేంద్రా, పంపాసరోవరమునకు దూర్పుభా గంబున ఋశ్యమూకంబను నొక పర్వతముగలదు అందు నలుగురు వానరులతోడ సుగ్రీవుండను వానరుండు వసిం చుచున్నాఁడు అతడుతన అన్నయగు వాలిచే దరమఁగొట్ట బడి దీనుండై యున్నవాఁడు, తేజస్సంపన్నుఁడు సత్యసంధు ఁడు మహాబల పరాక్రమములు గలవాఁడు ధైర్యవంతుఁడు నగు ఆసుగ్రీవుండు నీకుఁదగిన మిత్రుఁడు నీకు సహాయము చేయఁగలఁడు, సీతా వృత్తాంతము నెఱింగినవాఁడని చెప్పి యాకబంధుండు శ్రీరామునకు మార్గముచూపి. అనుజ్ఞ జెంది స్వర్గమునకు బోయెను.

శ్రీరామ లక్ష్మణులును కబంధోక్తమార్గముచే పం

పాతీరంబునకుబోయి యచ్చట శబర్యాశ్రమముజూచి పరమభక్తయగు శబరిచే వన్యఫలాదుల స్వీకరించి యాతిథ్యంబువడసి యాతాపసిచే నచ్చటియాశ్రమ విశేషంబులుదెలిసికొని అనుజ్ఞనొసంగిన శబరి చితిప్రవేశంబై దివ్యదేహంబుదాల్చి స్వర్గంబుజేరె నంత రామలక్ష్మణులు నానావృక్షవిశేష విచిత్రితంబును అతిమనోహరంబును, నిర్మలోదక పూరితంబును నగు పంపా తీరంబుజేరిరి.

## కిష్కింధా కాండము.

శ్రీరఘునందనుండు అతి శృంగారమగు నా పంపాసరోవరమునుజూచి, మిక్కిలి ప్రియా విరహవేదనను బొందుచు శోకించుచుండ లక్ష్మణుండుచూచి, అన్నా ! మహాత్మా ? నీవు మహానుభావుండవు సుజ్ఞాననిధివి, ధైర్యవంతుడవు జగదీశుండవు నీవంటి నిర్మలాత్ములు ఇట్లు దుఃఖపడగూడదు వియోగజమైన దుఃఖమును విడువుము, నీకుమేలుగలుగ గలదు, సీతాపహరముచేసిన రావణుని స్థితిగతులు తెలియువరకు మాత్రమే యీవ్యసనము, తెలిసిన వెనుక ఆయధముడు పాతాళమునకేగినను, దితిగర్భమును జొచ్చినను, వానిని చిత్రవధముసేసి సీతంబొందగలవని ధైర్యంబుజెప్ప, వినిపురుషోత్తముండగు దాశరథి దుఃఖంబువిడిచి లక్ష్మణుంగూడి యావనంబున సంచరింపుచుండ, నాఋశ్యమూకసమీపమున దిరుగుచున్న సుగ్రీవుండు ఆమహాను భావులంజూచి, వీరు మహావిక్రమ సం

పన్నులు వీరింజూడ, వాలివలన ప్రేరితులైన వారని నా కుతోచుచున్నదియని యావలికింబోయిన, నాతనిమంత్రు లగువానరులు వృక్షములనుండి దిగివచ్చి ప్రాంజలులై నిలచిరి. అప్పుడు సుగ్రీవునింజూచి ఆంజనేయుండిట్లనియె.

మహారాజ! పాపకర్ముండగు వాలి ఇచ్చటలేడు ఇదిమ లయపర్వతము నీకేమియు భయములేదు కపిత్వమును వ దలి ఇంగితజ్ఞుండవై సకలకార్యముల సాధింపుమనిన సు గ్రీవుండతనింజూచి, ఓహనుమంతుడా! ఈకానంబున మ హాత్ములు దీర్ఘబాహులు విశాలాక్షులు, శరచాపాసిధా రులు, నీవుప్రాకృతునివలె వారిసన్నిధికేగి నాకు అభిము ఖుండవై నిలచి వారియాగమన కారణమునంతయు, బా గుగ నరసివచ్చి నాకుదెలుపుమనిన, మహానుభావుండగు నాంజనేయుడు భిక్షురూపధారియై శ్రీరామ సన్నిధికివచ్చి నమస్కరించి ప్రాంజలియై నిలచి వారినామరూపములను వారియాగమనకారణంబు నడుగుచు బహువిధములుగా వారిరూపలావణ్యముల వినుతించి మహాత్ములారా! మీరు నా ప్రశ్నంబులవినియు, మాటలాడకుండుటకు కారణమే మి? నేను సుగ్రీవ సచివుండను, తమతోసఖ్యమును గో రి సుగ్రీవుండు తమయొద్దకు నన్నుబంపెను, అతనికిమేలు చేయగోరి భిక్షురూపముచే వచ్చినవాడను నాపేరు ఆంజ నేయుండనిన శ్రీరాముండు ప్రహృష్టవదనుండై తమ్ముని జూచి యోలక్ష్మణా! నేను ఎవనినికోరుచున్నానో అట్టి సుగ్రీవుని సచివుండు నాసమీపమునకు వచ్చినవాడు స్నే

హాయుక్తమగు వచనములచే నితనితో సంభాషింపుము, ఇతడు వ్యాకరణశాస్త్రమునుసకలము జదివినవాడగుటవలన విస్తారముగ సంభాషించునప్పుడు ఒక యపశబ్దమైనను లేదు ఇతని సంభాషణమును వినిన మాత్రమున చిత్తము ఆనందపరవశమగుచున్నది. ఇట్టిదూతగలవాని కార్యములు తప్పకసిద్ధింపగలవు. అనిన లక్ష్మణుండు ఆంజనేయునిజూచి ఓ విద్వాంసుడా? మహాత్ముండగు సుగ్రీవుని గుణముల దెలిసికొనియున్నాము, అతని నే వెదకుచువచ్చితిమిగావున నీవుచెప్పినట్లుచేయగలమనపలుక ఆంజనేయుండు సంతసించి లక్ష్మణునివలన వృత్తాంతమంతయు నెఱింగి, సుగ్రీవుని వృత్తాంతమును వారలకుజెప్ప, తానుభిక్షురూపమును విడచి, నిజరూపమునుదాల్చి రామలక్ష్మణులను తనభుజములపై నెక్కించుకొనిఋశ్యమూకమును దాటి మలయాద్రికిబోయి,సుగ్రీవునకు వీరిచరిత్రమంతయు జెప్పి ఉభయులకు స్నేహము గలుగజేసెను.

అప్పుడు సుగ్రీవుండు శ్రీరామునివలని భయమునువదలి తన అన్నయగు వాలివలన జెందిన యవమానంబును వాలి దుర్నయమును శ్రీరామునకెఱింగింప రఘునందనుండును కన్నీరొలుక రావణహృత సీతావృత్తాంతము నెఱింగించెను, అప్పుడు సుగ్రీవుండు శ్రీరామునిజూచి ఓ యరిందమా! ఆపాప రాక్షసుండు నివసించుచోటును నేనెఱుంగను, వాని సగణంబుగ నశించుయత్నమును నేనుజేసెదను, శీఘ్రముగా సీతను బొందగలవు దుఃఖమును విడు

వుము. నాకును భార్యాహరణజంబగు దుఃఖముగలదు, ప్రాకృత వానరుండనైన నేనిట్లుదుఃఖింపను, పురుషోత్తముండవగు నీవుధైర్య మవలంబింపకుండిన లాఘువముగ నుండును. మహాత్మా! ఇదిగోయంజలిచేసి ప్రీతితోవేడుచున్నాను శోకమునకు ఎడమీయక పౌరుషము నాశ్రయింపుము, అనిన రాముండు ఉత్తరీయము చెఱగుచేగన్నులనొత్తుకొనుచు, సుగ్రీవుని గౌగిలించుకొని వయస్యా! హితుండవును స్నిగ్ధుండవును నగునీచేత ప్రకృతిస్థుండనగు నేను ఊరడింపబడుట యుక్తమే, ఈ సమయంబున ఇట్టి బంధువు దుర్లభుండు, మిత్రమా! సీతను వెదకుటయందును, రావణుని వధించుటయందును,యత్నింపుము నేనేమైన జేయదగిన కార్యముండిన జెప్పుము తప్పకచేయుదును, ఇదివరకునే నసృతము పలుకలేదు ఇకయెప్పటికిని బలుకబోను, దీనిని నేను సత్యముచే శపథముసేయుచున్నాను. అనిన సుగ్రీవుండు తనకు వాలిచేసిన యపకారమును విస్తరించిచెప్పి శరణంబువేడిన దాశరథి మందస్మితముజేసి ఓ మిత్రమా! భవద్భార్యాపహారియగు వాలి నిప్పుడే వధంచెదననిన సుగ్రీవుండు హర్షమునుజెంది యిట్లనియె.

రాఘవేంద్రా! వాలిమహాపరాక్రమశాలి అతడు బలాతిశయమువలన, పర్వతశిఖరమువంటి యీదుందుభిశరీరమును దూరమునంబడవైచెను. ఈయెదురుగ గాన్పించుచున్న మహాస్థూలంబులగు సప్తసాలవృక్షములలో నొక్కదానిని తనబాణవేగముచే నిర్మూలముచేసెను, అత

డు వేయియేనుంగుల బలముగలవాడు, యుద్ధమున నెట్లు జయింపగలవో? యనిన లక్ష్మణుండు నవ్వి అతనినిజూచి ఓ కపిరాజ! ఏకార్యమును జేసిన, వాలిని వధముసేయగ లండని నమ్మెదవు అనియడుగ, సుగ్రీవుండు ఈచెట్లలో నొక్కదానిని శ్రీరాఘవుండు నిజబాణవేగముచే గూల్చి, ఈచచ్చిపడియున్న దుందుభికాయంబును ఒక పాదము చే నెత్తి ఇన్నూరు ధనుఃప్రమాణముల దూరమున పార వైచినయెడల వాలిని నిస్సంశయముగ జంప గలండనిన విని శ్రీరాముండు కనుసెజ్ఞ జేసినజూచి సుగ్రీవుండిట్లనియె.

ఓ రఘుకులతిలకా నిన్ను వాలితో సరిపోల్చియవమా నించిన వాడనుకాను, భయపరచువాడనుకాను. వాలిప రాక్రమునకు భయముజెంది హిమవంతునివలె నిన్ను ఆశ్ర యించితిని, నీపరాక్రమము నెఱుంగనికారణముచే నిట్లు పలికితిని నీ ఆజానుబాహుతయు నీ నిరుపమ శరీరాకృతియు నీధైర్యమును భస్మచ్ఛన్నమైన అగ్నివలె నీయొక్క ప రమతేజమును సూచించుచునేయున్నవి. అని సుగ్రీవుం డు పలుకగా, దాశరధిమందహాస పూర్వకముగా ఓ మిత్ర మా! ఇదిగోచూడుము! అని యాదుందుభి కాయమును కాలిబొటనవ్రేలితో విలాసముగా బదియోజనములదూర మున బడవేయుటచూచిసుగ్రీవుండుస్వామీ! ఆదుందుభి కాయము పచ్చిదిగానున్నపుడు మిక్కిలి బరువైన దానిని వాలి, పరిశ్రాంతుడై మత్తుడైయున్న సమయమున విస రివైచెను, అది యిప్పుడు ఎండి నిర్మాంసమై తేలికగాను

న్నందున నీబలంబు నెఱుంగకున్నాను. ఈసాలములొక్క దానిని నీబాణముచే భేదించిన బలాబలములప్పుడు స్పష్టమగుననిన శ్రీరాఘవుండు ధనుస్సున బాణమును సంధించి సప్తసాలంబుల గురిచేసి వేసిన యాబాణము తనధ్వనిచేది క్కులనిండించుచుఆసప్తసాలంబులభేదించి పుడమింజొచ్చి తిరిగి యమ్ములపొదియందు కడురయంబునజొచ్చెను.

అప్పుడు సుగ్రీవుండు రామబాణవేగమునుజూచి పరమాశ్చర్యమగ్నుండై రామునకంజలిజేసి, పలువిధంబుల గొనియాడి విగతశోకుండై రామలక్ష్మణులం దోడ్కొని కిష్కింధకు బ్రవేశించి రామాజ్ఞచే యుద్ధసన్నద్ధుండై వాలిసమీపమున సింహనాదము సేయుచుండె, రాఘవుండును వృక్షములచాటునదాగి యుండెను. అప్పుడు సుగ్రీవుని కంఠధ్వనినివిని వాలి అతికోపముతోవచ్చి సుగ్రీవునియుద్ధరంగమున నిష్ఠురముగాబ్రహరింప విహ్వలుండై పారివచ్చి దైన్యముదోప, మిత్రమా! నన్ను యుద్ధమునకు బొమ్మని, సమయమున ఇట్లు ఉపేక్షింపవచ్చునా? యనిన శ్రీరాఘవుండు అతికరుణజూపుచు వయస్యా! నీరూపము వాలిరూపము ఏకాకారముగాదుండుటచే బాణము వేయుటకు విరమించితి, మఱియొకపర్యాయము ఒక గురుతును నీవు ధరించి వాలినియుద్ధమునకు బిలువుము అప్పుడు తప్పక వాలినిఖండించెదను సందియములేదనిచెప్పుచు ఓలక్ష్మణా! ఈ కనబడుచుండు గజపుష్పమాలికను సుగ్రీవుని కంఠమున వేయుమనిన సౌమిత్రియాప్రకారముచేసి, సుగ్రీవుని తిరిగి

యుద్ధమునకు బంపగా, పూర్వమట్లు సుగ్రీవుండు వాలిస మీపంబునకుబోయి యతిప్రహారముగా నఱచెను.

ఆహ్వానిని అంతఃపురగతుండగు వాలివిని యుద్ధమునకు బైలువెడల, తారగనుంగొని ప్రాణనాథా ఇంతకుమున్న పరాజయము బొందిపోయి వెంటనే మరలవచ్చిన సుగ్రీవుండు అసహాయుండు గానేరడు ఆశ్రయబలముతో వచ్చినట్లు నాకు తోచుచున్నది. ఇక్ష్వాకు కులోద్భవులగు రామలక్ష్మణులు సుగ్రీవసహాయార్థము వచ్చియున్నారని అంగదుని వలన వినియున్నాను, వారు అజేయులు మహాప్రభావసంపన్నులు. వారితో సఖ్యము చేసి సుగ్రీవుని యౌవరాజ్య పట్టాభిషిక్తునిగా చేయుము అని హితము బోధించినను, వినక మహాసర్పమువలె నిట్టూర్పులు విడుచుచు తారను నిరాకరించి, సుగ్రీవసమీపమునకు వచ్చి ఇద్దరును తలపడి శిలా వృక్షప్రహారములచే ఘోరయుద్ధము చేసి, పిదప మల్లయుద్ధము చేయ వాలి కరప్రహారములకు సుగ్రీవుండు సహింపలేక నేలంబడిననుచూచి రాఘవుండు అమోఘంబగు బాణంబును ప్రయోగింపగా వాలివక్షస్థలము ననాటిన వాతండు వీర్యంబుడిగి నేలంగూలె.

ఇవ్విధంబున వాలిని సంహరించి సుగ్రీవుని కిష్కింధాపురంబున పట్టాభిషిక్తునిగాచేసి సుగ్రీవవచనముచొప్పున మాల్యవన్నగరియందు నిలచి వర్షకాలమునుగడుపుచుండ, కిష్కింధయందు సుగ్రీవుండు చిరకాలంబునకు రాజ్యభో

గంబులం బడసి నందున, కామాసక్తిచే బ్రమదాలోలుడై రామకార్యంబును మఱచియుండె.

అంత వర్షకాలమునుగడపి రాఘవుండు సుగ్రీవునియందు మిక్కిలి కోపగించి తమ్మునిజూచి, లక్ష్మణా! శరత్కాలము సంప్రాప్తమయ్యెను సుగ్రీవుండు భోగాసక్తుండై మదముచే మనకార్యమును మఱచియున్నాడు, కావున నీవు వెడలి సుగ్రీవునొద్దకుబోయి యతనికి సామవచనంబులచే బోధింపుమనిన, లక్ష్మణుండు వెడలి కిష్కింధాపురద్వారసమీపంబునకుంబోవ నచ్చటవానరులు ఈయనని ఱుంగక వృక్షములబెరికికొని క్రుద్ధులై నిలువంబడిన సౌమిత్రి కాలాగ్ని సదృశుండై ఓష్ఠంబులదర భీకరంబుగ వారింజూచిన మాత్రమునవారు మూలకొక్కరు పఱచిరి.

అందుకొందఱు సుగ్రీవభవనమునుజొచ్చి లక్ష్మణాగమనమును వివరింప తారాసహితుండై కామాసక్తిచే సుగ్రీవుండు వినకుండెను, అప్పుడు లక్ష్మణునికోపమును సహింపలేక అనేకవానరులుచేరి కిచకిచయని యఱచుచు భయపడుచుండ అంగదుండువచ్చి లక్ష్మణునింజూచి, అతనిచేనియమితుండై సుగ్రీవునితోదెల్ప నతండు శయనంబు విడిచివచ్చి తారాసహితుండై కుపితుండైయున్న లక్ష్మణునకు వందనముచేసి యిట్లనియె.

ఆర్యా! రామప్రసాదంబునంజేసి ఇదియంతయు నాకబ్బెను మహానుభావా! మన్నింపుము నాసహాయము,నిమిత్తమాత్రమే రాఘవుండు స్వతేజఃప్రభావముచేతనే రావ

ణుని సంహారింప గలండని జెప్పుచుండ లక్ష్మణుండు ప్రస న్నుండై యుండ సుగ్రీవుండు ఆంజనేయునిబిలచి మహేం ద్రహిమవ ద్వింధ్య కైలాస మందరాచలములం దుండెడి వానరులనందఱిని ఇంక నానాస్థలములయందున్న వానరుల నందఱినిరప్పింపుమనిన నాంజనేయుండటుల జేయుంజూచి లక్ష్మణుండు సుగ్రీవసహితుండై శిబికనెక్కి వానరబలము తో రామసన్నిధికి వచ్చినముఖ్యులై నిలువంబడిన రఘు నందనుండు సుగ్రీవుని సంతోషముతో నాలింగనముచేసి, బహుప్రకారంబులగొనియాడెను.

అంత సుగ్రీవుండు వానరులజూచియోకపులారా మీ రందఱు దిగ్దేశములన్నియు గలయవెదకి ఒకమాసములో పల వచ్చిసీతాక్షేమమును నాకుజెప్పవలయును, అట్లురా కుండిన మీరు వధ్యులగుదురు. అని వారిని ఆజ్ఞాపించి, ఆంజనేయుని శౌర్యధైర్యసాహసంబుల వీక్షించి సుగ్రీవుం డు రామునితో, ఆంజనేయుండు కార్యసాధకుండని నిరూ పింప రాఘవుండు స్వనామాంకితమగు ఉంగరమును సీత కుజూపుమని అతనిచేతికి ఇచ్చిసీత అభిజ్ఞానమును తెమ్మ నిచెప్పి ఇంకను గురుతులుచెప్పి దక్షిణ దిక్కునకు హను మజ్జాంబవదంగద నీలప్రముఖులగు వానరులను బంపెను.

ఇట్లు సుగ్రీవాజ్ఞచే బూర్వ పశ్చిమోత్తర దిక్కులకు బోయిన వానరులు నగరములను వనములను, దుర్గము లను పర్వతములను వెదకి సీతనెచ్చటనుగానక మాసము నకులోపలనే వచ్చిచేరి యాసంగతిని సుగ్రీవునకుజెప్పిరి.

దక్షిణదిక్కునకు వెడలిన ఆంజనేయాది వానరులు సుగ్రీవుండు చెప్పిన దేశవిశేషంబులంతయు గలయదిరిగివింధ్య పర్వతారోహణముచేసి యచ్చటవెదకి సీతంగానకపన్నెండు యోజనముల ప్రమాణముగల మరుభూమియందుసంచరించి యాయాసముజెంది యచ్చట ఒక పర్వతముంగాంచి అందు గుల్మావృతంబైన నొకగుహయందు భయంకరుడగు నొక రాక్షసునిజూచిన వాడు కన్నుల నిప్పులు చినుకగ వానరులజూచి తన ముష్టితో బొడువ వచ్చిన నారాక్షసాధముని రావణుండు వీడేయని యంగదుండు ఒక్క కరతలప్రహారముచేవానింజంపిన వాడు భూధరంబు వగిది నేలంగూలె. అంత నాగుహాభ్యంతరమున వెదకి అచ్చటగానక ఋక్షబిలంబను నొకబిలము ప్రవేశించి అచ్చట వెదకి కానక వానరులందరు మార్గాయాసముజెంది ఆంజనేయుని మున్నిడుకొని ఆబిలమార్గమున బోవుచుండ కటిక చీకటిచే నావృతంబైన యచ్చోట నొకరి నొకరి గనలేక గాగిలించుకొనుచు వీడుచు నతికష్టముచే నొకయోజనదూరంబజేగి ముఖములువాడి ఆకటడస్సి యచ్చట నిలువంబడి కొంతవెలుగు గనబడిన చూచి ధైర్యమవలంబించిపోవుచు సువర్ణమయమైన నానావస్తువ్రాతములుగలిగి మహాదీప్తితో వెలుంగుచున్న నొకపట్టణముగని అచ్చట వెదకి సీతంగానక అచ్చటనున్న ఒక తపస్వినిజూచి నీవెవ్వతెవనియడుగ నది నేను మేరుసావర్ణికూతురను నాపేరు స్వయంప్రభయనిజెప్పి మీరెవ్వరనియడుగ వీరు తమ

వృత్తాంతమంతయు దెలుప, ఆతపస్వి యానందముజెంది యచ్చటి ఫలమూల మధూపహారములచే వారిం బరితృప్తుల జేసినవారు శ్రమరహితులై తిరిగి బిలంబుదాటివచ్చు నుపాయంబుగానక పరితపించుచుండ ఆస్వయంప్రభ వీరియందనుగ్రహించి వానరుల నందఱిని కనులు మూసికొనుండని చెప్పిన వారటులజేయ దన తపఃప్రభావముచే బిలమునుదాటింప వారలు ఆవింధ్యగిరి చరియయందు గూర్చుని మనకు సుగ్రీవు డొసంగిన గడువుమించినది ఇప్పు డచటికి బోయిన నతడు మనలను తప్పకజంపును కృతకార్యులముకాకపోవుటచే నింతభయము జెందవలసియున్నది అనుచు దిగులొంది యచ్చట ప్రాయోపవేశముసేయసమకట్టి నిర్మలజలంబులు స్పృశించి దక్షిణాగ్రంబులగు దర్భాస్తరణములయందు ప్రాఙ్ముఖంబుగా నాసీనులై యందరు నేకవాక్యంబున, రామచరిత్రమును దలపోయుచు నాక్రందనము చేయుచుండిరి.

అప్పు డచ్చట గుహయందణగియున్న సంపాతియను గృధ్రరాజు, వానరుల ధ్వనినివిని సమీపమునకు నచ్చిచూచి నా యాకలికి సరిగాచావబూనియున్న ఈవానరులు దొరికిరి అని చెప్పుచుండ ఆ గృధ్రవాక్యములువిని యంగదుండు ఓ వాయుపుత్రా! సుగ్రీవుని వాక్యమును, రఘునందనుని కార్యమును నెఱవేర్పని దోషమున మనకిట్టివిపత్తు వచ్చియున్నది, అని సంపాతివినునట్టుగా భూపుత్రికొఱకు ఆజటాయువుచేసిన దుష్కరకార్యమును అతని

మరణమును మనము వినలేదా, అటులనే రామకార్యా ర్థమైవచ్చిన మనము ఇచ్చట మడియుదము అని చెప్పు చుండవిని సంపాతి అనుజ మరణంబునకు దుఃఖితుండై అం గదునివలన జటాయువు వృత్తాంతమంతయు విని సీతయున్న స్థలమును రావణుని రూపరేఖావిలాసములను సాకల్యము గ దెలిపినవిని యత్యంతహర్షమునొంది వానరులందరు ప్రా యోపవేశంబుమాని బలవిక్రమంబులబూని సీతా సందర్శ నాకాంక్షతో దక్షిణసముద్ర తీరంబుజేరిరి. అప్పుడు వా నరులందరు సముద్రమును దాటువిషయమున నేను పది యామడదాటగలననియొకండును, నేను ఇరువది, నేనుము ప్పది, నేను నలువది, నేను యేబది, నేను అరువది, నేను డెబ్బది, నేను యెనుబది, నేను తొంబది యామడ దాట గలనని గజగవాక్షాది వానరులు జెప్పుచుండ, అంగదుం డు నేను నూరామడ దాటగలనుగాని, తిరిగి రాగలనని నిశ్చయము జెప్పజాలననిన, అందరిలో వృద్ధుండగు జాం బవంతుండు హనుమంతునిజూచి రామభక్తవర్యా! శత యోజన విస్తీర్ణంబుగల సముద్రమును దాటుటకు నీవుద ప్ప నింకొక్కండు శక్తుండుగాడు నీవు బుద్ధియందు బృహ స్పతి తుల్యుండవు, పరాక్రమమున ఇంద్ర తుల్యుండవు కార్యమును సాధించుటయందు నేర్పుగలవాడవు, ఈ పృ థివియందు నీకుసాటి యెవ్వండును లేడు, ఈ వానరులు నీ పరాక్రమమును జూడదలచి యున్నారు విజృంభింపుము లెమ్ము, సీతం గనుగొనిరమ్ము నీవు వచ్చునంతవరకు మే

మిచ్చటనే కాచియుండెదము అనిజాంబవంతుండు పెక్కు విధముల స్తుతించి ప్రోత్సాహపరచిన ఆంజనేయుండు ఆ మందహాసముతో ఒడలుపెఱిగి మహేంద్ర పర్వతము నెక్కి యోవానరులారా నాప్రతాపమును జూడుండని, వారలకు నమస్కరించి మీరలు భయము జెందవలదు, త్రివిక్రముండు త్రిలోకముల నాక్రమించినట్లు నేను మిక్కిలి ప్రవృద్ధమైన దేహము నవలంబించితిని, విలాసముగా నీసముద్రమును దాటి సీతను జూచి వచ్చెదనని వారలకు ధైర్యముజెప్పి వారియనుజ్ఞవడసి లంకా గమనోత్సుకుండై ఆపర్వతమునుండి అంబరవీధి కెగయునప్పుడు తనపాద ఘట్టనముచే పర్వతము గడగడ వడంకెను, అందలి మృగములు భయముచే పాఱిపోయెను, విద్యాధరాదిగణములు స్వస్థానంబుల విడచిరి, వృక్షములు గదలెను, అప్పుడా మహానుభావుండగు పావని మనస్సమాధానముగలవాడై, మనోవేగముచే లంకకు వెడల నుద్దేశించెను.

## సుందర కాండము.

శత్రువుల నిరసించు స్వభావముగల యాంజనేయుండు రావణాపహృతయగు సీతయుండు స్థానమును వెదకుటకై సిద్ధచారణ గంధర్వులచే నంచరింపబడు గగనమార్గమున బోవందలంచి నానాధాతుమండితంబగు నామహేంద్రపర్వతమున ప్రవృద్ధమైన సింగమువలె ప్రకాశించుచు నిరుపమానమైన గొప్పకార్యమును చేయంబూని తూర్పునకు

దిరిగి సూర్యునకు ఇంద్రునకు తన తండ్రియగు వాయువునకు చతుర్ముఖునకు భూతములకు అంజలిచేసి, వానరులు చూచుచుండ విస్తారముగాపెరిగి నిష్ప్రమాణ శరీరుండై బాహువులచే నాపర్వతమును బీడింపనది ఒక ముహూర్తకాలము వృక్షములతోగూడ గడగడ వడంకెను. అందున్న సిద్ధగంధర్వచారణాదులు అంబరమందునిలచి పర్వతసంకాశుండగు నాంజనేయుని పొగడిరి. అంత వాయుపుత్రుండు సింహనాదముచేసి దీర్ఘములగు తన బాహువులనుచాచి స్తంభనముచేసి పాదంబులజోడించి తగువిధంబుగా కటితటంబునజేర్చి భుజములు శిరము, బొందుగాన మర్చుకొని, చెవులు నిక్కబెట్టి, ప్రాణంబుల హృదయంబుననాగిపట్టి పదంబులు స్థిరముగనిలిపి, తేజస్సత్వవీర్యములబూని, ఆకసంబున దృష్టినిలిపి పొంచి తమకించి మించి తాటించి రామబాణమువలె చివ్వున నంబరమార్గమునకెగసి పోవుచుండగా సముద్రుండు తనయందు డాగియున్న మైనాకపర్వతమునుజూచి యిట్లనియె.

గిరీంద్రా! రామకార్యముకొఱకు వాయుపుత్రుం డాకసమున నేగుచున్నాడు. ఇక్ష్వాకు కులప్రవర్ధితుండనగు నేను అతనికి సహాయము చేయవలయును, కనుక నాచే బలిరక్షితుండవైన నీవు జలమునుండి వెలువడి పైకినెగసిన నా మహానుభావుండు కొంతదడవు నీయందు విశ్రమించి ఆతిథ్యంబుగైకొని వెడలును అని పలుక మైనాకుండట్లు పెఱిగినచూచి దానిని రాక్షసుం డనుకొని హనుమంతుడు

తనబొమ్మచే నణగ్రద్రొక్కిన సుడివడి మైనాకుండు మను
ష్యరూపముదాల్చి ఓరామదూతా! నేను మైనాకుండను
సాగరప్రేరితుండనై నీకుసహాయముచేయ వచ్చినవాడను.
నాశిఖరములయందు విశ్రమించి ఈ కందమూల ఫలంబుల
నారగించి సుఖంబుగ వెడలుమనిన నతండు, ఓ పర్వత
శ్రేష్ఠుడా! నీవు చేయుమర్యాద, నన్ను జెందినది. సూ
ర్యాస్తమయము కాకమునుపే సముద్రము దాటెదనని ప్ర
తిజ్ఞజేసితిగావున వేగముగనటిగి కృతకార్యుండనై వచ్చు
నప్పుడు నీవు చెప్పినట్లుచేసెదనని చెప్పిపోవుచుండ, దేవ
తలు ఆంజనేయుని యుపాయసామర్థ్యముల నెఱుంగగోరి
నాగమాతయగు సురసనుబిలచి, నీవు వాయుపుత్రునకు
కొంతసేపు విఘ్నమాచరింపుమని చెప్పిరి

అప్పుడా రక్కసి కాటికకొండవలె మేఘమండల ప
ర్యంతము పెరిగి హనుమన్తునికడ్డమై వికృతముగా నోరు
దెరచి నీవు నాకు ఆహారము గావలయుననిన విని ఆంజనే
యుడు దానినిజూచి, ఓ రామరాజ్య నివాసినియగు సుర
సా! నేను రామకార్యార్థమేగుచున్నాను. ఇప్పుడు నీకు
నేను ఆహారము గాదగదు, సీతనుజూచి రాముని యా
నందపరచి నీయాస్యము జొచ్చెగననిన నాసురస మిక్కిలి
క్రుద్ధయై, ఓ వానరుడా! నాకు దొరికితివి ఇంకనిన్ను బో
నిత్తునా? నీమాటలు నీబలము నాకడ చెల్లవు, నిన్ను బట్టి
మ్రింగెద, జూడుము! నాకు బ్రహ్మ వరమున్నదియనిన,
హనుమంతుడు దానింజూచి కోపోద్దీపితుండై ఓ సురసా!

ఇదియేమి ఎన్నిభంగులజెప్పినను వినక నాకడ్డమై రామకార్యమును జెఱుపబూనితివి యెటులనన్ను మ్రింగెదవో చూచెద, నీ నోరుదెరువుము అనిన నాగమాతలోకము ఆశ్చర్యపడునట్లు పదియామడల వెడల్పున నోరుదెరచిన, హనుమంతుడు తానును పదియోజనముల ప్రమాణము తన దేహమును బెంచెను. అంత సురస యదిచూచి ఇరువది యోజనములు నోరుదెరచిన, ఆంజనేయుడు ముప్పది యోజనములు మేనుబెంచెను, అంత సురస నలువదియోజనములు నోరుదెరచిన నాతడు యేబది యోజనములుపెరిగెను, సురస అరువదియోజనము లాస్యంబుపెంచిన నాతండు డెబ్బదియోజనములు పెరిగెను, ఆనాగమాత ఎనుబదియోజనములు నోరుపెంచిన కపివరుండు తొంబది యోజనములు పెరిగెను, అది నూరు యోజనములునోరు పెంచినంజూచి యప్పుడు ఆంజనేయుడు అంగుష్ఠమాత్రుండై దాని వదనగుహయందుజొచ్చి వెలువడివచ్చి పకపక నగుచు అంతరిక్షముననుండి, ఓ నాగమాతా! నీ కడుపుజొచ్చివచ్చితి నీయాకలి దీఱె నీవరంబు సఫలమాయెగదా? ఇక సీతాన్వేషణముకొఱకు నేగెదను నీకుమ్రొక్కెద దయయుంచుమనిన విని నిజరూపమును ధరించిన నాగమాత కపివరునిజూచి సౌమ్యుడా! ఇక కార్యసిద్ధికొఱకు వెడలుమనిచెప్పి తానును యధేచ్ఛంజనియె.

అంత నాతండు గరుత్మంతునివలె నంబరంబున కెగసి మేఘజాలంబుల నాకర్షించుచు పోవుచుండగా సింహికయ

నుపేరుగల ఛాయాగ్రాహిణియైన యొకరక్కసి, సముద్ర మునుండి వెలువడి ఆంజనేయుని నీడను ఆకర్షించినందున అతనికి బలవీర్యంబులు కొరవడుచుండుటవలన నాతండు ఇరుప్రక్కలజూచి క్రిందుగజూడగా నొక క్రూరరాక్షసి భయంకరముగ పెటిగి, తనఛాయను గ్రహించి పాతాళ గుహావలె నోరుతెఱచి అరచుచుండ, ఆంజనేయుండు తన శరీరమును సంక్షేపించి వజ్రతుల్యముగ నతిబరువై పిడుగుబడినట్లు ఆసింహిక వక్త్రింబునబడి దానికి గర్భనిర్భేదముచేసి ఆకళేబరంబుగొని మింటికెగసి కొండొకదూరముచని సముద్రంబునం బడవైచె.

అప్పుడు ఖేచరంబులగు భూతంబులు ఆంజనేయుని అద్భుతచేష్టితమునుచూచి ఆశ్చర్యమునొంది అతనికి ఎట్టికర్మలయందైనను దృష్టి, ధృతి, మతి, సామర్థ్యము, నశియింపకుండుగాక యని అనుగ్రహించిరి. అంత నాతండు శతయోజనాయతంబైన సాగరంబు ననాయాసంబునదాటి లంకాద్వీపమునుచూచి తన గొప్పరూపమును కురుచజేసికొని బహువిధవృక్ష లతాసంకీర్ణంబగు లంబపర్వత శిఖరముపైవ్రాలి. అందు అతిమనోహరంబులగు నుద్యానవనములను అనేక సరస్సులను గనుంగొనుచు, పద్మములుగల యగడ్తలచే జుట్టబడి స్వర్ణమయధ్వజ పతాకాదిశోభితంబై సకలము స్వర్ణరత్నములచే నిర్మింపబడి అత్యద్భుతమైన శిల్పచాతుర్యముగల్గి పరులకు దుష్ప్రవేశమై యొప్పుచున్న నా లంకాపురిని అంత యుగలయంజూచి అత్యా

శ్చర్యముబొంది ప్రొద్దుగ్రుంకునంతవరకు నచ్చట కాచి యుండి, ఇంతలో జంద్రుండుదయింప సీతా దర్శనలాల సుండై లంకాపురద్వారంబుజేరె.

అప్పుడా లంకాధిదేవత రాక్షసీ రూపముదాల్చి హను మంతుని దిరస్కరించి అడ్డమై చొరనీయక నీవెవ్వండవని యడుగ నాతండు నీవిధమంతయు ముందుగ దెల్పుమనిన, నారక్కసి నేను ఈ పట్టణమును రావణాజ్ఞచే గాపాడుచు న్నలంకాధిదేవతను. ఇకనీవిధమును దెల్పుమనవుడు, నేను పట్టణమునందలి విశేషశృంగారముల జూడవచ్చినవాడ ననిన, నది నన్నుగెలువక లోపలబ్రవేశింపనీయనని కనుతె ఱ్ఱజేసి యాతని వక్షంబున, దనబిడికిటంబొడువ, సమీర కుమారుం డత్యంతాగ్రహముజెంది తనరూపమును బెంచి వజ్రముతో సమానంబైన తనముష్టిప్రహారముచే దానిని నేలంబడవేసిన నది విహ్వలాంగియై మూర్ఛిల్లి మహాను భావా నన్నుజంపకుము. నేనాడుదాననని, కరుణింపుము, ఎప్పుడు ఒక వానరుడు నిన్నుజయించునో అప్పుడు లంకకు గీడునంభవించునని చతుర్ముఖుండు నాకువరమిచ్చియున్నా డు, అది సత్యమైనది. సీతాపహారకారణమున రక్కసు లందరితో దశకంఠుడు చావగలడు, నీవీపురంబుసొచ్చి జా నకిని వెదకి వచ్చినకార్యములను సుఖముగ నెఱవేర్చుకొ నుము నీకు మంగళమగుగాక యనెను.

అంత కపివరుండు ద్వారంబువిడిచి లంకాప్రాకారము ను చులకనగాదాటి పురంబు బ్రవేశించి రాజమార్గంబున

బోవుచు స్వర్ణమయంబులగు రక్షోగృహంబులజూచుచు, త్రిస్థానస్వరభూషితంబగు రాక్షసాంగనల గానంబును, రాక్షసకృత వేద ఘోషంబును వినుచు, అచ్చటనున్న రక్షోభటులను వీక్షింపుచుంజనిచని రావణుని గూఢచారులగు దీక్షిత జటిల ముండిత శిరస్కులను, మఱియు ఏకాక్ష, ఏకకర్ణ, లంబోదర, లంబకుచ, లంబోష్ఠ, కరాళవక్త్ర, భుగ్నవక్త్ర, వామన, అతివామన, విరూప, సురూప నాములగు నానావిధకూట ముద్గర, ఖడ్గ, చాప, శతఘ్ని ముఖ్యాయుధ ధరులను గుంపులుగుంపులుగ జూచుచు, మఱియు మద్యపానమత్తులై పురుషులంగూడి కామసుఖంబను భవించు రాక్షసాంగనల ననేకులనుచూచి లజ్జించి యాహనుమంతుండు, పతివ్రతా తిలకంబగు సీత నెచ్చటనుం గానక, మఱియు ప్రహస్త, కుంభకర్ణ, విభీషణ, విరూపాక్షాది రాక్షసగృహంబులెల్లశోధించి, అతిసుందరంబును నానాచిత్ర విచిత్రితంబగు రావణాంతఃపురముసొచ్చి అందు గల విచిత్రంబులంగాంచి యచ్చెరువొందుచు నాగృహమధ్యభాగమున తప్తజాంబూనదాభమై మణివజ్రవిచిత్రితంబై అర్ధయోజనమాత్ర వైశాల్యము, యోజనప్రమాణ దైర్ఘ్యముగల్గిన పుష్పకంబనియెడి విమానంబును చూచి దానినడుమనుండెడి రావణాంతఃపురమున మధుపాన క్రీడలనలిపి అలసి సొలసి వీణా వేణు మృదంగాది వాద్యంబులం గౌగిలించుకొని బరుండిన వారిని, ఒండొరుల వక్త్రంబులు జేర్చుకొని నిద్రాపరవశలైన వారిని జూచి అచ్చట

ఒక విచిత్రశయనంబున నిద్రించుచున్న రావణునిజూచి యమ్మారుతి భీతునివలె మెల్లననొదిగి యొకవేదికామధ్యంబుననుండి, దశవదనుండు కామరూపిగావున నక్కాలమున నేకముఖుండై, ద్విబాహుండైయుండుట కాశ్చర్యమునొందుచు, పరమసాధ్వియగు రామపత్ని ఇచ్చోట ఉండుట అసంభవమని యెంచి యెచ్చటను సీతంగాననందుకు దుఃఖించుచు తిరిగి ధైర్య మవలంబించి బహువిధంబుల వితర్కించి అచ్చట అతిరమణీయంబగు నశోకవనమునుగాంచి తన్మధ్యదేశంబున నొకసహస్ర స్తంభమంటపమునందు మణిమయవేదికా తలంబున, శుక్లపాడ్యమినాటిచంద్రునిపోల్కి యుపవాసములచే కృశించి బాష్పపూరితనేత్రయై రామునేధ్యానించుచు, అప్రియలగు రాక్షసీ గణములచే జుట్టబడి, కుక్కలచే నావరింపబడిన లేడివలెభయమును జెందుచున్న భూసుతంగాంచెను.

అప్పుడామె లోకోత్తర సౌందర్యమును చూచి చూచి నిశ్చయముగా రావణాపహృతయైన సీతయేయని మనసు ననిర్ణయించి, రాఘవునిచే జెప్పంబడిన **గు**రుతులన్నియు నీమెయందుగని, ఆశ్చర్యసుఖముల జెంది ఈమహనీయయగు నారీరత్న మమ్మహాత్ముండగు నారామునకేతగును ఈదివ్య లక్షణ శోభితయగు సతీతిలకమును ఎడబాసి రాముండు ఇంకను దేహమును ధరించియున్నాడేయని బహుప్రకారములుగ దలచి యాసతీమణి, నైజశీలముచే రక్షితయై భర్తృతేజమువలన నదీనయై, ఆభరణములులేక యే

ప్రకాశించుచుండుటనుజూచి మారుతి యమందానందము
జెంది ఆనందబాష్పములవిడిచి మనంబున శ్రీరాఘవునికి
నమస్కరించి, సీతతో సంభాషించుటకు సమయమును ని
రీక్షించుచు వృక్షమునందుమ సంవృతుండై యుండె, అప్ప
టికిమూడు యామములు గడచి నాలవయామము ప్రా
రంభింప, బ్రహ్మరక్షస్సుల వేదఘోషంబులు మంగళవా
ద్యములు వినంబడిన రావణుండు మేల్కొని కామపరా
ధీనుండై అంగనామణి శతము ఛత్రచామరాదులగైకొని
తన్నునెంబడింప సీతాసక్తమానసుండై మందగమనము
తో నశోకవనమునకేతెంచిన నద్దురాత్ముని జూచి జానకి
పెనుగాలికి కదలుచున్న కదళివలె భయముజెంది తన స్త
నోదరముల కరోరువులచే గప్పుకొనివట్టి నేలగూర్చుని కన్నీ
రు విడుచుచు శ్రీరాముని దనహృదయమందు నిల్పుకొని
ఉపవాస, శోక, ధ్యానములచే గృశించి, నిరానందయై
యుండె, ఆపతివ్రతా తిలకమునుజూచి, రావణుండు, ఓ
రామామణీ? నన్నుజూచి అవయవముల ఏల గప్పుకొను
చున్నావు? ముఖమునెత్తినన్ను జూడుము, జగదేకసుం
దరివగు నిన్నుగోరివచ్చినవాడను, నీసరి నిలవేణిజగంబున
లేదు, నాచూపులు నీయందె నాటిమరలకున్నవి చలము
వదలి ననునేలుము, నీవుకావలసినన్ని దుకూలాంబర నానా
రత్నభూషణంబుల గైకొనుము, తాపసవేషియై వనమ్ము
న నాకలమ్ములుదిని కష్టపడుచున్న దీనమానవుండగు రా
ముని వదలి, అనుపమభోగ భాగ్యంబులు గలిగి మహాప

• రాక్రమ సౌందర్యాది సంపన్నుండనగు నన్నుబరిగ్రహింపుము, నాలంకారాజ్యమంతయు నీయది నాస్త్రీలందరు నీకు పరిచర్యసేయుదురు. నీ సర్వాతిశయ సౌందర్యము నుజూచి స్వదారలయం దనురాగమును వదలితిని కావున నిట్టిదగిత సన్నాదితెంబులగు ఈసముద్రప్రాంతకాంతారములయందు నన్నుంగూడి. లీలావినోదంబుల విహరింపుము ని. కర్ణకఠోరంబుగా బలికిన ఆరావణదుర్వచనంబులువిని తపస్వినియగు నాజానకి తనపరిశుద్ధాంతఃకరణంబున దీనశరణ్యుండగు శ్రీరాముని నిలుపుకొని రావణునితోడ సాక్షాత్తుగభాషించుట యనహంమని తలచి తృణశకలమును అడ్డముగావైచి దానింజూచి దశకంఠున కిట్లనియె.

పాపాత్మా! నన్నుకోరుట నీకుదగదు నీమనస్సును నన్నుండిమరలింపుము. స్వదారలయందు మనసును నిలుపుము, సత్కుల ప్రసూతనై, సత్కులమునుజొచ్చి రాఘవపత్నియైననేను ఇట్టినింద్యకార్యమునుచేయను. అని పలికి యాసతీమణి పరాఙ్ముఖియై ఓనీచా! పరసతినైన నేను నీకు యుక్తభార్యనుగాను సాధుధర్మమును, సాధువృత్తిమును అవలంబింపుము. నీభార్యలు నీచే నెట్లురక్షించుకొనదగినవారలో అట్లునే యన్యులకును స్వదారలు రక్ష్యలగుదురు కావున నిను నీవే యుపమగానెంచుకొని నిజభార్యలయందు తృప్తినొందుము, స్వదారయందు తనివినొందనివానిని. చపలుని, చలితేంద్రియుని, దుర్విచారాసక్తునిజూచి పరదారలు అవమానింతురు. ఇచ్చట

సాధువులు లేరోకో? ఒక వేళయుండిన నీవువారిని యనువ ర్తింపకున్నావో? ఆచారవర్జితంబగు విపరీతంబైన ఈదుర్బుద్ధి రాక్షసులందరు ఒక్కపర్యాయము నశించుటకొఱకు నీకుగలిగినది నీసంపదనుచూపి నన్నులోపరచుకొన నెంచితివేమొ, సూర్యునిప్రభవలె రఘునందనుని విడువనిదానను. ఈదుర్బుద్ధినివదలి ఆర్తనైన నన్ను, దాశరథితోడ గూర్చి, శరణంబువేడుము, ఆయన శరణాగత రక్షకుడు, కరుణానిధి, భక్తవత్సలుడుగావున నిన్నుమన్నించును. అటుల నామాటవినవేని, నాప్రాణేశుని యతితీవ్రశరంబులచే చిత్రవధంబెందుదువు. ఓరాక్షసాధమా! జనస్థానవాసులగు రాక్షసులందరు యుద్ధరంగమున జగదేకవీరుండగు నాభర్తచే మరణించినందున నీవు శక్తిలేకదొంగతనముగ ననుగొనివచ్చితివి. రాముండనియెడిగరుడుడు శీఘ్రముగవచ్చి రాక్షసేంద్రులనియెడి మహాసర్పములను ధ్వంసముచేసి, ననుగొనిపోవును. నీవు నక్కవు. నాప్రాణేశుండు సింహము, పతియాజ్ఞ లేనందునను, ధర్మహానిగలుగునను తలపుచేతను నిన్ను భస్మమగునట్లుశపింపనైతిని గాని లేనియెడలనిన్ను నీవుసేయకుందునా, నన్నుగైకొననీవశమా, నీమరణముకొఱకేబుద్ధినీకుగలిగెనని పలువిధంబులదూరిన వినిరావణుండిట్లనియె.

ఓలలనా; మగవారలు కోరను కోరను, మానినులు విరసంబుగ మాటలాడుటనైజము. నీయందు నాకుకామముండుటచే నూరకున్నాను నీవాడినమాటలకునిన్ను వధ

చేయువలయును, ఇకరెండు మాసములు గడువిచ్చితిని అంతలోపల నీవు నేను అనుగకమునుందే ననుగలయువలయును, లేనియెడల చలిపన్నమునకు నిన్ను వండగలరు అని మహాక్రౌర్యముతో నిప్పులుగ్రక్కుచు నక్కతివలె నెగురుచు, అచ్చట సీతను పరివేష్టించియున్న ఏకాక్షి, ఏకకర్ణి, హస్తికర్ణి, గోకర్ణి, అశ్వపాది, హస్తిపాది, గోపాది, ఏకపాది, పృథుపాది, అపాది, అతిమాత్ర శిరోగ్రీవ, అతిమాత్రకుచోదరి, దీర్ఘజిహ్వ, అజిహ్వక, అనాసిక, సింహముఖి, గోముఖి సూకరీముఖి, మొదలగు రాక్షసులంబిలచి మీరు సామదానభేదములచేత, బెదరించి మరలించి నావశముజేయుండని యాజ్ఞాపించి పలుమారు కోపము పెలుగుచుండ జానకిని బెదరింప వెడలిన రావణునిచూచి ధాన్యమాలినియను సక్కసి అడ్డమువచ్చి, ఓ అసురనాయకా! కామమోహములులేని వివర్ణయగు ఈమనుజాంగనయందు నీకు మోహమేటికి. స్నేహముతో నన్నుగూడి సుఖింపుము. ప్రతికూలయగు వనితనుబొందినవానికి అనేక కష్టములువచ్చును, ఈమర్త్యాంగనకు నీయుత్తమ భోగంబు లబ్బునట్టిభాగ్యము జతుర్ముఖుండు వ్రాయలేదు అనిన, రావణుండు హీహీయని నవ్వుచు నందుండిమరలి పదఘట్టనములచే భూమియదర ఇంటికివెడలిపోయెను.

అంతనా రాక్షసులు బహుభంగుల దుర్బోధనలుసేయనదివిని జానకివారలంజూచి మీరెంతబోధించినను అకార్యమునందు నామనసు పోరదు,పతినివిడచి పరునిపొం

దను, అనిన, ఆరక్కసులు కోపాటోపంబున బెదరించుచు నాయుధంబులు దీసికొని మామాటలువినకుండిన నిన్ను ఖండఖండములు జేతుమనుచు బహువిధముల తర్జింపనా రలజూచి మీరు మ్రింగిన మ్రింగుడు, జంపిన జంపుడు మీ వాక్యము విననొల్లననుచు, నంతకంతకగ్గలంబైన శోకంబు ననించుకయైన సుఖంబుగానక శరీరమును సంకోచింపజేసి మిక్కిలి వడకుచు దిగ్గునలేచి హనుమంతు డెక్కియున్న శింశుపావృక్షసమీపమునకుబోయి, అశోకవృక్షశాఖనుపట్టుకొని శోకించుచు నిట్టూర్పులువిడుచుచు విలపించె, హారామ! హాలక్ష్మణా! హానాయత్తా కౌసల్యా! హాసుమిత్రా! ఇప్పుడు నేనేమిసేయుదానను? స్త్రీలకుగాని పురుషులకుగాని అకాలమున మృత్యువుదుర్లభంబను లోకప్రవాదమును పండితులుచెప్పుచున్నారు నిజమైనది, ఇచ్చట ఇట్లు క్రూరలగు రాక్షసులచే దర్జింపబడుచున్న నేను పతిహీననై బ్రదుకుచుంటినే, నేనేమిపాపము జేసితినో, విషభక్షణముసేసియైన ప్రాణముల ద్యజింపదలచితినేని యదియుదుర్లభము రాక్షసీవశంగతయగు నాకు విషమెటుల దొరకును, అనివిలపించుచు, శ్రీరాఘవుండు ఇచ్చటికివచ్చి ఈ రావణుని వధించినన్ను గొనిపోయినమేలగు, నటుగాని సడల నాప్రాణేశుని దివ్యాకారంబు హృదయంబున నెంచుచు మరణించెదగాని ద్రోహమైనను ఈరాక్షసవశము గానేరను. హా రామ! కరుణానిధీ! హా లక్ష్మణా! యని గోడ్పుచుండవిని యూక్రూరవికృతరాక్షస స్త్రీలు, దుం

తచెప్పినను సీత సమ్మతింపలేదని రావణునకు జెప్పిరి. కొం
దగు భయంకరముగ నోరుదెరచి గ్రుడ్లు పీకుకొనివచ్చు
నట్లు కన్నులుదెరచి ఓమానినీ! మా మాటలు వినకున్నా
వు ఇకనిన్నువిడువము కఱచిమ్రింగెదమని తర్జనభర్జనల
సేయుచు సీతను పట్టుకొనబోవు సమయమున నిద్రించు
చున్నవిభీషణపుత్రి యగు త్రిజటలేచి వారికిట్లనియె.

ఓ రాక్షసాంగనలారా! ఈ మానినిని మ్రింగవల
దు, నన్నుమ్రింగుడు దశరథకుమారునకు విజయము, దశ
ముఖునకు మరణము తప్పదు. ఈ విధంబంతయు స్వప్న
మందు నేను ఈరాత్రి గాంచితిని అనిన వారందరు వెఱ
గుపడి యోత్రిజటా! ఆవిధంబెట్లు చెప్పుమనిన త్రిజట
ఇట్లనియె, శ్రీరాముడు, శుక్లమాల్యాంబరములు ధరించి
మంచి దుకూలములగట్టుకొని వేయిహంసములతోగూడి
న దంతపల్లకినెక్కి లక్ష్మణునితోగూడి ఇచ్చటికివచ్చి,
హరిణాంబరధారిణియైన సీతను అంకమునగూర్చుండబె
ట్టుకొనినటులను, మఱియు శ్వేతగజంబు నధిష్ఠించిన సీత
చంద్రసూర్యుల బట్టుకొనినటులను, ఇట్లు ఆగజో త్తమము
ఆ మువ్వురినిధరించి ఈపురంబుపైనున్నట్లును, మఱియు
రాముండు ఈదనుజుల వధించి లక్ష్మణజానకీ సమేతుడై
పుష్పకంబునెక్కి ఉత్తరదశకు నేగినట్లు స్వప్నంబైనది, రా
వణుండు తైలమునుబూసికొని రక్తవస్త్రములు ధరించి
మధుపానమత్తుండై గన్నేరుపూలదండలుధరించి పుష్పక
విమానంబునుండి నేలంబడినట్లునుమఱియు నల్లనివస్త్రము

గట్టుకొని ఎఱ్ఱనిమైపూఁత ఎఱ్ఱనిపుష్పములు ధరించి తల బోడిచేసికొని ఒకస్త్రీచే లాగఁబడినట్లును పిదపగాడిదెలచే లాగఁబడిన రథము నెక్కి వికలంబుగ నవ్వుచు నాడుచు, నూనెను త్రాఁగుచుఁ భ్రాంతుండై తిరిగినట్లును, మఱియు గాడిదె నెక్కి దక్షిణాభిముఖుండై యేఁగినట్లును, గాడిదెమీఁదనుండి పడినట్లును దిగంబరుండై దుర్వాక్యములఁబలుకుచు నరకోపమంబగు మలపంకంబునంబడి మునుంగుచున్నట్లును, బురదపూసికొనిన వనిత రావణ కంఠంబున పాశముఁగట్టి దక్షిణాభిముఖముగా నీడ్చుకొనిపోవుచున్నట్లును మఱియు రావణసంబంధులకునిట్టి యశుభములు గలిగినట్టు స్వప్నమునంజూచితిని, లంకసమూలంబుగ విఱిగి సముద్రమునఁగూలినట్లును రామదూతయగు నొకవానరుఁడు లంకను ధ్వంసముచేసినట్లును రాక్షస స్త్రీలు విధవలై వికవికనవ్వుచు తైలమును ద్రాగి యేడ్చుచు నరచుచుండునట్లును, విభీషణుండొక్కరుండు శుక్లమాల్యాంబర, శుక్లగంధానులేపనంబులధరించి, శ్వేతచ్ఛత్రమును ధరించి చతుర్దంతదంతావళంబుపై నెక్కి దుందుభితూర్యనిర్ఘోషంబులు చెలఁగ బైలు వెడలినట్లును, స్వప్నంబుఁగంటిని కావున నీసతీమణి భర్తచే నచిరంబుగ రాక్షసులకందఱకు గీడుసంభవింపఁబోవుచున్నది ఈవనితకు మ్రొక్కుడు, మనకు రాఁబోవు ఆపదలనుండి రక్షించును, ఈ మానినికి అనేక శుభసూచకములు గలుగుచున్నవి, కానమీరిమ్మహీకుమారిని తర్జన భర్జనోక్తులం దూలనాడక మృదుమధు

రవాక్యముల ననునయింపుచు వినయభక్తి స్నేహంబులం గొలిచి బ్రతుకుండనిన నాత్రిజటపలుకులుఁవిని యద్దానవాంగనలు తత్ప్రకారంబున జానకి నాశ్వాసింపుచు ప్రియంబుల బల్కుచు సీతంగొలిచియుండిరి.

అంత, నద్దేవి, దురాత్ముండగు రావణుండు తన్నుమాసద్వయంబునకు హింసించెదనన్న పలుకులందలచుకొని రాక్షసీమధ్యంబునజిక్కి భయకంపితాంగియై అక్కట! ఈదురాత్ముండగు రావణుండు పెట్టిన గడువు సమీపించుచున్నది వీడు పరమమూర్ఖుండు ఆడినదుర్వాక్యమును చలముతో సాధించును హా దయాసముద్ర ! ఈదుష్టరావణుండీలంకయందునన్ను చెరలోనుంచి ఘోరప్రక్రియంజంపబూనియున్నాడు నన్ను వేగమెవచ్చి కాపాడి, కొనిపొమ్ము అనిబహు విధంబులంబ్రార్థించుచుమఱియునిట్లనియె.

ఆహా నాపాతివ్రత్యనియమంబు లన్నియు కృతఘ్నునియందుచేసినమేలువలె వ్యర్థములయ్యెంగావున నాకుప్రాణేశ్వరాఇక నీసమాగమంబుగాదేమో, ఇనకులతిలకా నీవు పిత్రాజ్ఞను నియమముగా జరపి వనమునుండి మరలి అయోధ్యకుజేరి కృతార్థుండవై నిర్భయముగ విపులేక్షణలతో సుఖించుచున్నావో? ప్రాణనాథా! ఆర్యపుత్రా! నేనైతే నీయందు కోరికగలదాననై ఇంతవరకు జీవించితిని అల్పభాగ్యనగు నావ్రతోపవాసములు వ్యర్థములయ్యె నికనేనెందుకు బ్రతుకుట, విషాదులదెచ్చియిచ్చువారు లేనందున నురిగొని మరణించుటకంటె వేరుపాయంబులేదని నిశ్చ

యించి విలపించుచు హృదయమున రామునితలంచుచు దిగ్గునలేచి అతిదీర్ఘంబగు తనజడనుకేలంబూని అశోకశాఖనుబట్టుకొని మరణవ్యవసాయమందు కృతనిశ్చయయైయున్న సమయంబున నద్దేవికి వామనేత్రంబును, వామభుజంబునదరె, ఇంకను కొన్నిశుభసూచకంబులు బయల్పడ, యాభూపుత్రి సంతుష్టాంతరంగయై దుఃఖముచాలించియభిరామయై యుండె.

ఆసమయమునసీతావృత్తాంతమునుత్రిజటావాక్యములను, రాక్షసస్త్రీల దుర్వాక్యములను వినుచు నాచెట్టుకొమ్మలనడుమనున్న హనుమంతుడు (తనలో,) ఏ మానిని కొఱకు వానరులందరు వెదకుటకై వెడలిరో అట్టిసాధ్వీమణిని నేనిచటజూడంగంటినని మనంబున నానందించుచు, ఈసతీమణి దుఃఖంబపనయింపం దలచి, యారాక్షసాంగనలువినకుండ మెల్లన రామునింబ్రశంసింపవిని యాసాధ్వి, రామగతమానసయైయుండె నూరుతి, నడిచిన రామచరిత్రంబంతయు మధురవాక్యంబులచే వినుపింపవిని జానకి మనంబుననిట్లని వితర్కించె.

ఆహా ఏపుణ్యాత్ముఁడో నాకన్నులకు గనబడకనే, నేడు నాపతివృత్తాంతమును కడుమధురంబుగ మృదుభాషణిలిన వినిపించెనని, తలయెత్తి నలుదిక్కులు కలయజూచి వృక్షశాఖలలో నణగియున్న వానరరూపమునుగాంచి వెరగంది ఇదియేమి నాకిట్లుగానంబడుటకు కారణమేమని శోకించుచు మూర్ఛిల్లి కొంతసేపటికితెలివొంది, శాస్త్రనిషిద్ధమ

యున వానరాకృతికలవో గానంబడియె, రామలక్ష్మణుల కుస్వస్తియగుగాక, ప్రాణేశ్వరు నెడబాసినది మొదలుగ కూరుకేలేని నాకుస్వప్నమెట్లువచ్చును. ఇదిస్వప్నముగాదు, రావణమాయయో, హృదయవైకల్యజనితమో నిజమో, కేవలభక్తిచేత ఒకానొకవానరుండు నావిభునివర్ణింపుచుండుటకేమి హేతువో యేర్పరించుటకు మహాశ్చర్యజనకమైయున్నది. అని వితర్కింపుచున్న సమయమున, వృక్షమునుండిదిగి ఆంజనేయుండు సీతకిట్లనియె.

ఓయమ్మా! మీరెవ్వరు ఈవృక్షశాఖ నవలంబించి దుఃఖించుచున్నారు? నాగగంధర్వయక్ష కిన్నరకన్యవో? లేక కోపించుకొనిన ఋషికన్యవో? నీవారలెవ్వరు? నీవెందుకు దుఃఖించుచున్నావు? నీపతిగతులేమి చెప్పుము? లేక జనస్థానమునుండి రావణాపహృతయైన శ్రీరామమహిషియగుదువేని నీకుక్షేమమా? నాకుజెప్పుమని యడిగిన, సంతోషముజెంది జానకి తనవృత్తాంతమంతయు దెలుపవిని వాయుపుత్త్రుండు దేవికి రామకుశల వృత్తాంతమునంతయు చెప్పి దుఃఖమును బోకడచి సీత సమీపమునకు బోవుచుండ నద్దేవి భయపడి ఓరీ! వానరరూపుండవైన రావణుడవాయని శంకించుచు నవతలికిబోయి జనస్థానమున సన్యాసివేషివై మాయచే నాకాపదగలిగించి ఇప్పుడిట్లుచేయుట, నీకుమేలుగాదు అని మాటాడక యుండుటజూచి సీతాభిప్రాయ మెఱింగి తిరిగి, రామకథావిస్తారకథనములచేత ఆమె మనస్సును సంతోషపరచి, ఓ దేవీ! నేను

రామదూతనగు వానరుండను నాపేరు ఆంజనేయుడు రామ కుశలమును నీకు దెల్పవచ్చితిని ఆ రాముని సద్గుణములు గణుతింపశక్యముగానివి ఆమహాత్ముని రూపరేఖాలావణ్యములు సాముద్రికోక్తలక్షణ ప్రకారము ఉత్తమోత్తమములు అని స్పష్టమేర్పడ వర్ణించిచెప్పి ఇదిగో నీవు విశ్వసించుటకై రామనామాంకితమగు అంగుళీయకమును నీభర్తయొసంగెను చూడుమని చేతికిచ్చెను.

అప్పుడు దానిని గ్రహించి యాదేవిభర్తను పొందినట్లుగసంతసించి యప్పుడాంజనేయుని బహుప్రకారముల ప్రశంసించిన, నాతండు ఓతల్లీ! ఇక నీవుఖేదింపవలదు శ్రీరాఘవుండు సుగ్రీవాది వానరులగూడి ఇచ్చటికివచ్చి రావణాదుల సంహరించి నిన్నుంగొనిపోగలండు లేదా, ఇప్పుడేనాభుజంబులపై కూర్చుండిన నేనే రామసన్నిధిం జేర్చెదననిన నద్దేవిమందస్మితము జేసి, మర్కటబుద్ధితో నిట్లనుచున్నావేమి! నీవు అల్పదేహుండవు నన్నెట్లు మోసికొని సముద్రమును దాటెదవు అనిన, నాతండు అమ్మా! ఏకటాక్షముచేత ఈలంకనుగూడ నేను మోసికొనిపోగలను,అని చెట్టునుండిదిగి మేరుమందరసంకాశుండై పెరిగియద్దేవి కెదుట నిలువంబడిన, జూచి, యాశ్చర్యముపొంది ఆంజనేయా! నీవు వాయువేగముగ సముద్రమును దాటునపుడు నేను సముద్రంబున బడుదునేమో? కావున నేను నీతోడ వచ్చుటతగదు ఒకవేళ భద్రముగాగొనిపోయెదనని యంటివేని యీక్రూర రాక్షసులు మెటులనైన కనిపెట్టి

యుద్ధమునకువత్తురు అప్పుడు మీరంగరుకలిసి యుద్ధముసేయ నేనైన విపత్తుఁబొందుదును. రాక్షసులు నీచేతనుండి నన్నులాగికొనియైన పోవుదురు, ఎవరికిని యుద్ధమున జయాపజయములు నియతములుగావు, కావున నీవు చేసినయత్నమంతయు వ్యర్థమగును.

మఱియు, కపివర్యా! నీవు అధికసత్వశాలివగుటంజేసి బలపరాక్రమములచే రాక్షసులజయించి నన్నుంగొనిపోయెదనంటివేని, సుగ్రీవాదులం గూర్చుకొని రావణుని సబాంధవంబుగా నున్మూలనముచేసి పౌరుషంబున నన్నుంగొనిపోవ నుద్యమించిన రఘువంశజుని యత్నమంతయు వ్యర్థమగును, అట్లుగాక రాక్షసుల మోసముచేసి గొనిపోయెదనంటివేని, రామునకు పౌరుషము లేనందున ఇట్లుచేయించెనని వీరపురుషులు నిందింతురు కనుక ఇదియంతయు రాఘవునకు కీర్తికరముగాదు. కావున నిన్ని ప్రకారములచేతను నన్నుంగొనిపోవ నీకు న్యాయంబుగాదు, . మఱియు నేను రామేతరుని శరీరమును తాకను, బలాత్కారముగా గ్రహింపబడి యీనీచశరీర స్పర్శమును బొందినందుకు మనంబునగుందుచు వాని ఘోరవధము నపేక్షించుచున్నాను. అప్పుడు అనాథనై వివశనైయున్న నేనేమిసేయంగలదానను, రాఘవుండు రావణుని సపుత్ర బాంధవముగావధించి ఇచ్చటనుండి నన్నుంగొనిపోయిన అది ఆయనకు సత్కీర్తికరంబగును. అనినవిని వాయుపుత్రుండు మిక్కిలి సంతుష్టుండై యాదేవి పాతివ్రత్యమునుం గొనియాడుచు తల్లీ! నేను

భవద్దుఃఖహేతువు లన్నియుఁజూచి, రామునకు బ్రియంబుగా నమ్మహాత్మునితో నిన్నుంగూర్చుతలంపున స్నేహప్రసన్నమానసుండనై యిట్లంటినిగాని వేఱొండుగాదు. ఇంక నేను భవద్వచన ప్రకారంబున రామసన్నిధికేగి నీవుపడుచుండెడి కష్టంబుల నన్నింటిని విశదంబుగ విన్నవించి శీఘ్రింబున లక్ష్మణ సుగ్రీవసహితముగా నిచ్చటికి దోడ్కొనివచ్చెద రాముఁడు నమ్మునట్లుగా నొక్కయభిజ్ఞానంబొసంగుమని పలికిన నాదేవి ఒకపిసత్తమా రామప్రత్యయార్థము ఒక సందేశమును జెప్పెద దానిని నామాటలుగా నమ్మహాత్మునకు నెఱింగింపుమని యిట్లనియె.

ఓ రవికులమండనా! చిత్రకూటమునకు సమీపముననుండెడి మందాకినీ తీరమందలి సిద్ధాశ్రమంబున ఉద్యానములయందు విశేషముగ విహరించి డస్సి శ్రమముపోవుటకు నీయంకమందు బవ్వళించియుండ వాయసమొక్కటి అస్మదీయ స్తనాంతరమందు వాఁడిగలముక్కుతోఁ జీర, నేను కోపించి ఒక మంటిపెల్లను దానిపై విసరితిని, అప్పుడది పోకుండిన నేను లేచి నీవీబంధంబువదల, వసనంబుజారి దిగ్గన లేచి ఆవాయసమును దోలుటకు కొంతదూరమరిగి మరలి వచ్చి నీచే నపహాసింపబడి సిగ్గునంగలనాంచి తిరిగి నీయంకము నధిష్ఠించి వాయసమునుదోలుటకు నసమర్థనై దుఃఖింపుచుండ నీవు నాకన్నీళ్లనుతుడిచి నన్నునోదార్చితివి, అంత గొంతదడవు నీయంకతలంబున నిద్రించి మేల్కొనిన పిమ్మట క్రమంబున నీవు మదంకంబుననిద్రించుచుండ వెం

డియు కాకంబు మదీయ స్తనాంతరంబును జీరిన యా వ్రణ
మునుండి జారినరక్తబిందువులు నీపయింబడినఁజూచి నన్ను
నిదుర లేపితిని అప్పుడు నీవు మేలొ్కని, నా వ్రణంబునుజూ
చి మహాకోపముతో నలుప్రక్కలఁజూచుచు రక్తసిక్తనఖం
బై నాకభిముఖంబుగ చలముతో దిరుగుచున్న వాయస
మునుచూచి కోపముతో మనంబున దాని నింద్రపుత్రుని
గా నెఱింగి దర్భఖండమును బ్రహ్మాస్త్రముచే నభిమంత్రిం
చి దానిపై వైచిన, నయ్యస్త్రము భగభగమండుచు నా
కాకంబుపైబడిన నది వెఱచి యమ్మహాస్త్రంబు వెంటరా
నతిత్వరితగతి దివంబునకుంబఱచి ఇంద్రునిం బ్రార్థించి య
తనిచే బరిత్యక్తంబై ముల్లోకంబులుదిరిగి తనకు రక్షకం
బు నెందునుంగానక క్రమ్మర నీసమీపమునకువచ్చి నిన్ను
శరణంబు వేడి నీచరణంబులపై వ్రాలిన గరుణించి దాని
కుడికన్ను నస్త్రముచే హరించి ప్రాణదానంబు జేసితివి, ఇది
భవచ్చిత్తంబున స్మరింపుమని గురుతును జెప్పి తన చెఱంగున
ముడిచియున్న చూడామణి నతనిచేతికిచ్చి యిట్లనియె.

శా॥ ఈరక్షఃపతిపీట నిష్క్రమములో నేనున్న చందంబునన్।
ఘోరంబైన విదీనశోకమును రక్షోభవిసీతర్జన।
క్రూరోక్తుల్ సకలంబెఱింగితిగదా క్షోణీశుతో జెప్పు మే।
పారన్నా తెఱగెల్ల మార్గమున గల్యాణంబు నీకయ్యెడిన్।

అని వీడుకొలిపిన జానకికి ప్రదక్షిణ నమస్కారములుచేసి
పయనంబై మారుతి తనమనంబున నిట్లని వితర్కించె.

నా పుణ్యంబువలన సీతంగంటిని, ఇక కొంచెము కార్య
శేషంబున్నది, దురాత్ములగు నిశాచరులయెడ సామదా

సభేదంబులొరగవు, నేను పరాక్రమమవలంబించి దైత్య వీరులందునిమినంగాని రావణునకు మృదుత్వముపుట్టదు. అని యోచించి, ఆరావణున కత్యంతము సంతోషావహం బగు నశోకవనంబును ధ్వంసముచేసి తోరణంబధిష్ఠించె.

ఆవృత్తాంతమును కావలివారలు రావణున కెఱింగింప రావణుండు ఆరాక్షసాంగనలవలన సకలంబువిని ఆహా ఒక వానరుడువచ్చి సీతతో సంభాషించి ఇంతకార్యమును జేసెనా? యని శిరకంపముజేసి ఎనుబదివేల ఘోరరాక్షసులంబంపిన వారు వివిధసాధనంబులంగైకొని యాంజనేయునెదుర్కొనిన వారలంజూచి యమ్మారుతి బ్రహ్మాండంబుపగులునట్లు గర్జించిన, ఆరాక్షసులు ఆనాదమునువిని మూర్ఛిల్లిరి, అంతలో రాక్షసవీరులు మూర్ఛదెలిసి పటువేగంబున నాంజనేయుని నిశితాస్త్రశస్త్రంబుల బ్రహరించిన నతండు దోరణాశ్రితంబైన ఇనుపగుదియను కేలంబూని ఒక్కవ్రేటున నందరినిజంపి తోరణస్తంభమున నిలిచెను.

అప్పుడు హతశేషులు భయభ్రాంతులై ఈవృత్తాంతమును రావణునకెఱింగింప నాతడు రోషతామ్రాక్షుండై ప్రహస్తకుమారుండగు జంబుమాలిని యుద్ధంబునకు బంపె, నంతలో హనుమంతుండు మిగిలియున్న అశోకవనంబంతయుపాడుజేసి చైత్యప్రాసాదమును గూలద్రొన్ని, అందలి, రాక్షసులనందరినిం బరిమార్చె నంత జంబుమాలి యాంజనేయునిగదిసి శరపరంపరలచేగప్పిన నతండు కొంతదడవు యుద్ధంబుసేసి అత్యంతకోపంబుతో ఇనుపగుది

,యచే నొక్క పెట్టున నాతనింగూల్చె. అవివిని రావణుం డు వేఱొరు మంత్రికుమారులం బంపిన వారు ఆంజనేయునితో ఘోరయుద్ధమును సేయ నాతండు కోపంబు పెఱిగి కరతల ముష్టిప్రహారములచేత వారిని అనాయాసముగ యమపురికింజేర్చె ఈవృత్తాంతమునువిని దశకంఠుండు శోకరోషవిషాదంబులు మనంబున ముప్పిరిగొన నింద్ర జిత్తు నవలోకించి యిట్లనియె.

కుమారా! ఇకనీవు ఉపేక్షింపగూడదు ముల్లోకములందు నీకు సమానుడెవండును లేడు నీవు శస్త్రాస్త్రవిశారదుండవు అవశ్యము రణంబుగావింపుమనిన, ఇంద్రజిత్తు సముగ్రము చండంబున నుప్పొంగి ధనుర్బాణంబులధరించి అతి భయంకరుండై చతురంగబలములతోడ నతిరభసంబుగా యుద్ధమునకు వెడలిన వానింజూచి హనుమంతుండు సింహనాదముచేయుచు చూచుటకే భయంకరుడై పెఱిగియుండె, ఇట్లిరువురు దలపడి ఘోరయుద్ధంబుచేయ, బలాబలంబుల నొకరొకరికి తారతమ్యం బేర్పడకుండుట గని ఇంద్రజిత్తు ఆంజనేయుని అవధ్యత్వమును లక్ష్యగోచరుండుగాక చిత్రగతులం బరిభ్రమించుటయుంజూచి యతనిపై బ్రహ్మాస్త్రంబు బ్రయోగింప నయ్యమోఘాస్త్రంబు నగ్నికణంబులు చెదరవచ్చి పితామహవచనంబుల దలచి మారుతింజంపనొల్లక బద్ధుంగావించిన నవ్వానర సింహుండు చేష్టలుదక్కి భూమియందుబడి తన మనంబున నది బ్రహ్మాస్త్రకృత్యంబని యెఱింగి పూర్వము బ్రహ్మ

తనకిచ్చినవరంబు తెఱంగు విచారించి దానివలన తనకు భయములేకుండుటను తలంచుకొని స్వాయంభువ మంత్రములచే తన బంధమును దొలగించుకొనియు, అస్త్రబద్ధుడై నట్లుండి రాక్షసప్రభావంబు బాగుగ నెఱింగి రావణునితో సంభాషణముచేసి రాముని పరాక్రమశౌర్య సాహసోత్సాహముల దేటపరుప దలచి కపటదైన్యం బంగీకరించి వాయుసేయు తర్జనభర్జనోక్తులకు గర్జింపుచు చేష్టలుమాని యుండె అప్పుడా యింద్రజిత్తు బ్రహ్మాస్త్రంబు వీడినట్లు తెలిసికొని, ఈవానరుని ప్రభావమమేయంబని ప్రశంసించి, బలవంతులగు రాక్షసులంబిలచి దారములచే బంధింపుడని నియోగించిన వారటులంగావించి ఆంజనేయుని కాష్ఠముష్టిప్రహారంబులం బీడించుచు దోడ్కొనిపోయి రావణుని యెదుటనిల్పిరి. అప్పుడా వానని వానింజూచి, అతనితీవికి అతని భోగమునకు నచ్చెరువొంది రావణునిజూచుచుండె.

అంత రావణుండు మారుతినిజూచి, ఈతండు శివకింకరుడగు నందికేశ్వరుడో, లేక, బాణాసురుడో, యని వితర్కించుచు కనుసైగజేసి ప్రహస్తునిజూచి ఈతనివృత్తాంతము నెఱుంగుమని పలికిన ప్రహస్తుండు రావణోక్త వచనప్రకారము మారుతినడుగ నతడు రావణునకభిముఖుండై నేను ఇంద్రాదులు పంపగ దూతనై వచ్చిన వాడనుగాను, నిన్ను శ్రద్ధతో నాశదీరజూడవచ్చితి, నేను వానర వంశమునబుట్టిన వాడను, అమరశత్రువైన నిన్నుజూడంగోరి నీ అశోకవనమునుపాడుచేసితిని, దానికికోపించియుద్ధ

మునకు రాక్షసవీరులు నన్ను డాసిన దేహరక్షణార్థము యు
ద్ధము జేసి సుకరముగ వారినందఱను జంపితిని. దేవదై
త్యవరులైనను అస్త్రబంధనమ్మున నన్నునంటగట్టజాలరు
పూర్వము నాకు బ్రహ్మ యిచ్చిన వరముండగా నిన్నిటఁ జూ
చి కలతెఱంగు జెప్పుటకుగా నస్త్రబద్ధుడనైతి, ఇప్పుడిమ్మ
హనీయాస్త్ర బంధవిముక్తుండనై యున్నవాడను. సర్వజగ
త్ప్రభుండగు శ్రీరామునకు, నమ్మకమైనభటుండను, రా
చకార్యములు దీర్పనీకడకువచ్చితి నామాటలు నిజము.
నీవు వినవలయును, దశరథుని కగ్రసూనుండును తేజోనిధి
యు. జగద్ధితుండునగు శ్రీరాముండు భార్యానుజయుక్తు
డై మునులయట్లు జటావల్కలములధరించి తానుపితృవా
క్యపరిపాలనార్థ మరణ్యమునకరుగుచు దండకారణ్య
ముంజేరి జనస్థాన సమీపమున నివసించియుండగా నమ్మ
హాత్ముని భార్యయును పతివ్రతాతిలకంబును, లోకైక
మాతయునగు సీతంగానక నారఘువల్లభుం డనుజసమేతుం
డై వెదకుచు నీచేనపహరింపబడినదిగావిని ఋశ్యమూకం
బునకువచ్చి సుగ్రీవునితో సఖ్యముచేసి అతని శత్రువగు
వాలి,నవలీలనొక్క కోలనేసి తదీయరాజ్యంబు సుగ్రీవున
కొసంగె. వాలిపరాక్రమము పూర్వమునీ వెఱింగిన దేకదా
అట్టి రామునకు ప్రతీకారము సేయనెంచిన సుగ్రీవుని
యాజ్ఞాప్రకారము సీతను వెదకుటకై భూమండలమంత
యు వ్యాపించిన వానరులలో నేనొకండను. వాయుపు
త్రుండను, నిరుపమాన బలుండను, హనుమదాఖ్యుండ

ను, జానకిని వెదకుచు సముద్రముదాటి వచ్చి ఈయశో కవనమందు గంటిని, నీవు బ్రహ్మకులమునబుట్టి సకలధర్మములు తెలిసి, అన్యదారలజెఱబెట్టుట నీకుదగునా? వీరవరేణ్యుండైన రఘువీరునకు గీడుసేసి దేవదానవులలో నెవ్వాడును ప్రాణముతోడ సుఖముచుబొందడు, కావున నామాటను నిజమునినమ్మి సీతను రామునకర్పించి, నీలంకను, భార్యను పుత్రాదులనురక్షించుకొనుము అట్లుసేయవేనిరఘువర్యుడు యుద్ధమున నీతలలనుత్త్రుంచి మైథిలినిగొనిపోవునని నీతియుక్తముగ జెప్పినవిని రావణుండు క్రోధమూర్ఛితుండై రాక్షసులంజూచి వీనింబరిమార్పుండని యాజ్ఞాపించిన నతనిమర్దనమునువిని అధర్మమూలమనిచింతించి రావణునిజూచి విభీషణుండు అనేకశాస్త్రములచే దూతనుజంపుట యనర్థమనియు, దూతలకు కొరడాదెబ్బవాతవేయుట వైరూప్యమొనర్చుట ధర్మమని బోధింపుచు మఱికొన్ని నీతి వచనంబుల వచించినవిని రావణుండు కోపమును మరలించుకొని అతనితోనిట్లనియె.

ఓతమ్ముడా, నీవు చెప్పినదిరాజనీతికి సరిగానున్నది వీనిని విరూపునిజేయుదము, ఓదైత్యులారా ఈతనితోకకు నిప్పునంటించి పట్టణము నలుప్రక్కలద్రిప్పుకొని రండని యాజ్ఞాపించిన నాదైత్యులు నూనెలోదడిసిన ప్రాతగుడ్డలను, పత్తిని, మారుతివాలంబునకు జుట్టి నిప్పుముట్టించి న,నవ్వావని శరీరము పెంచి అప్పురింగల నిశాచరులుబాలవృద్ధనారీసహితులై ముదంబునజూచుచుంట గ్రోధముపె

జిగి తనతోకచే నచ్చటదానవుల హతంబుసేసి తన్నుకట్టి
నపాశంబులద్రెంచుటకు సమర్థుండయ్యును, తాల్మివహిం
చి రామకార్యమున ప్రవర్తించియున్న నన్నువీరేమియు
జేయంజాలరు వీరుసేయు శరీరపీడనంబు, వాలాగ్నియు,నా
కు శ్రమంబుజేయంజాలదు. ఈలంకా దుర్గమును బాగు
గచూచి పురిశోధనంబుసేయువరకు నూరకుండెదను పిదప
విజృంభించి, బంధంబులందెంచుకొని రాక్షసులవధించె
దనని యోచించి యూరకుండిన మారుతిని రాక్షసులు
త్రాటంబట్టుకొని వీధివీధింద్రిప్పుచుండి రప్పుడు సీత,

పతిశుశ్రూషయు సత్తపశ్చరిత మత్యాస్తైక పత్నీత్వమా,
తతసాశీల్యము నాకుగల్గుట యథార్థంబేని నామీద మ,
త్పతికిన్నిత్యము ప్రేమగల్గుటది తథ్యంబేని మద్వాక్యప,
ద్ధతి శీతుండవు గమ్ము వాయుజునకు న్వాత్ప్రీతితోఁబావకా॥

అనుచు బ్రార్థించిన నగ్నిదేవుండు సీతామహిమంబు
న నాంజనేయునకు చందనశీతలుండై, ఆ సతీతలకంబున
కును, ఔష్ణ్యంబు సోకనీయకరక్షించెను, అప్పుడాంజనే
యుండు తనలో జనక పుత్రి యాశీర్వచనము వలనను,
రఘునందనుని తేజోమహిమవలనను, నాతండ్రి సాచివ్య
మువలనను నగ్నినను గాల్పకుండెనని ఒక ముహూర్తకా
లము చింతించి, చిత్తంబున సీతా రామలక్ష్మణులకు న
మస్కరించి లంకా దుర్గంబును, పట్టణంబును నాచే శోధి
తంబైనది, ఇక విక్రమించెదననియెంచి అంగుష్ఠమాత్ర
శరీరుండై బంధంబులవలన విడివడి రక్కసులు చూచు

చుండ నప్పుడే పర్వతసంకాశదేహుండై పురద్వారము మీదికతివేగముగదుమికి తోరణాశ్రితంబగు పరిఘంబు గ్రహించి ముందుగతన్ను గాచి వచ్చుచున్న క్రూరరక్కసులసంహరించి తనవాలాగ్నిచే లంకాపురంబంతయు గాల్చిన అచ్చటనుండు రాక్షసులందఱు అజ్వాలలకు నోర్వజాలక హాహాకారంబులతో నేడ్చిరి అప్పుడమ్మారుతి, జనకపుత్రియు అగ్నిభయంబునొందెనని కొంతదడవు దుఃఖించి తిరిగిధైర్యమవలంబించి, ఆసతీ తిలకంబునకు హానియుండదని నిర్ణయించుకొని సీతాక్షేమంబు తెలిసికొనుటకు అశోకవనంబునకుంజని అచ్చట దైవయోగమున క్షేమముగానున్న మహీకుమారింగని నమస్కరించి తదనుజ్ఞాతుండై సముద్రతీరంబుననున్న అరిష్టపర్వతం బెక్కి మింటికెగసి సాగరోపరిభాగంబున మైనాకంబును కరంబున స్పృశించి యతివేగంబునంజని మహాదధియుత్తరతీరంబుననున్న మహేంద్ర పర్వతమునవలోకించి యంగదాదివానరులకు నిజవిజయం బెఱుకపడునట్లుగా వాలంబు, నంబర వీధింద్రిప్పుచు ప్రళయకాల మేఘగర్జనమువలె సింహనాదంబుచేసిన నదివిని జాంబవదాదులందరు ఆంజనేయుండు కార్యమును సాధించివచ్చుచున్నాడను సంతోషముతో వృక్షాగ్రంబులను పర్వతాగ్రంబులను అధిష్ఠించి నిక్కినిక్కి చూచుచుండ నమ్మారుతి గరుడునిమాడ్కి మహేంద్రంబున వ్రాలెను.

అప్పుడు అంగదాది వానరులు అతనిముఖలక్షణంబు

లనాలోకించి సీతంజూచివచ్చెనని నిశ్చయించి అతిసంతో షముతో ఫలమూలంబులర్పించి అతనింబరివేష్టించి గాలి చిరప్పాడాంజనేయుండుజూచితిని సీతనని సంగ్రహముగా జెప్పి, తానుజూచిన తెఱంగంతయు సవిస్తారముగాజాం బవదాదులకుదెల్పిన వారందరువిని ఆంజనేయుని విక్రమ సాహసములకు నాశ్చర్యముజెందుచు పలువిధంబులగో నియాడి అంగదుఁడును గలసిరామ సందర్శనాకాంక్షులై, ఉత్సాహముతో గర్జనలుసేయుచు సుగ్రీవునకు ప్రాణప్రదంబై గొప్పదియున్న మధువనంబుజేరి అందలి మధువునంతయు గ్రోలుచుండ ఆవనపాలకుండగు దధిముఖుండను వానరుండు వీరల్లప్పగోపింప. హనుమంతుడు అతనిని లక్ష్యముసేయక వానరులంజూచి కపులారా మీరు భయపడవలదు మీ ఇష్టప్రకారం మనుభవింపుడు. అడ్డమువచ్చిన వానిని చెట్టుకు అంటగట్టివైచెదనని వారునిర్భయముగ మధుపానము చేయుచు, నైజంబులగు వానరచేష్టలం బ్రవర్తించువారిం పవచ్చిన వానిని బ్రహరించి వృక్షంబులకుగట్టివైచి దేవ మార్గంబులజూపి పరిహసించిన నేమి చేయునది లేక గొంగొపు ఈవృత్తాంతమును దధిముఖునకు దెలుప దధిముఖుండు తీఱిగికోపముతో వచ్చి వారింప అంగదుఁడతనిఁబట్టుకొని. విసరివైచె.

అప్పుడు దధిముఖుండు ఆపాటునకోర్వలేక వనపాలురందోడ్కొని రామలక్ష్మణసుగ్రీవులపాలికింబోయి వారి పాదంబులపై వ్రాలి తనదురవస్థను విన్నవింప నది విని

సుగ్రీవుండు వానరులను, కార్యము సాధించిన వారనియె ఱింగి దధిముఖా! కృతకార్యులగు వానరులచే వనంబు భక్షంబగుటకు సంతసించితి, ఇక వానరుల శీఘ్రంబుగ నాయొద్దకు బంపుమనిన నాతండు మిగులవినయంబుతో నంగదాదులం బిలువ వారందఱు హర్షముతో నొండొరులం బురికొల్పుకొని గగనమార్గంబున వెడలి నేనుముందు నేనుముందనుచు ఋశ్యమూకంబు జేరి రామలక్ష్మణసుగ్రీవులం గాంచిరి. ఆంజనేయుండు గంటిని సీతను అని ముకుళిత కరకమలుండై యుండె, అంగదాదివానరులును శ్రీరామునకు నమస్కరించి అంజలిబంధముతో నిలువంబడిన రామలక్ష్మణసుగ్రీవులు మిక్కిలి సంతసించి వారలం గరుణాకటాక్షముచే వీక్షింప హనుమంతుండు మిగులవినయముతో సుగ్రీవాజ్ఞగొని వెడలినది మొదలుకొని సీతాసందర్శనముచేసి వచ్చినంతవరకుగల యావద్వృత్తాంతమును సవిమర్శంబుగా రఘునందనునకు బలికి చూడామణిని చేతికిచ్చి కాకాసురవృత్తాంతము గుఱుతుగ అభిజ్ఞానంబుగ దెలిపినవిని శ్రీరాముండు ఆచూడామణినిజూచి శోకించి దానినిహృదయంబున నుంచి సుగ్రీవునింజూచి వయస్యా! ఈ మణిజూచిన, నాజానకి సంప్రాప్తయయినట్లు నాకుదోచుచున్నది ఇకప్రత్యక్షముగా నెప్పుడు జూడగల్గుదునని అ పెక్కువిధంబుల బ్రశంసించుచు, నాంజనేయునిచే సీతయారాధింపబడిన ప్రకారంబంతయు విని సంతుష్టాంతరంగుండయ్యె.

---

# యుద్ధకాండము.

అప్పుడు రఘునందనుండు ఆంజనేయుని వలన సీతా వృత్తాంతమును విని, ఆంజనేయు ననేకవిధముల బ్రశంసించి ఇతని కరుణలేకున్న ఇక్ష్వాకు కులమంతయు నశించును, ఇట్టిమహోపకారము జేసిన మహానుభావునకు సన్మానమింతకంటె వేఱేమియు గానవని పల్కుచు నా రఘునాథుండు నిఖిలజగద్రక్షాకరంబులును, శ్రితజన శ్రీకరంబులును, రిపుగణభీకరంబులును అగు నిజకరంబులసాచి ఆంజనేయు నతిప్రీతితో గాఢాలింగనము జేసికొని సుగ్రీవుండు వినుచుండ నతనివీక్షించి సర్వవానర పరివృతుండనై వననిధిని ఎట్లుదాటుదునని చింతించుచుండ సుగ్రీవుండు రఘుపతింజూచి యిట్లనియె.

ఓజగదేకవీర, ప్రాకృతునివలె పలవింతించెదవు కృతఘ్నుడు సౌహృదమునువలె విడువుము, నీవు అస్త్రజ్ఞుండవు, అజేయుండవు, సంతాపమును విడువుము వానరసేనా పరివృతులమై సముద్రమునుదాటి శత్రుసంహారము సేయగలమని ప్రోత్సాహపరచిన, రాముండుసుగ్రీవ వచనంబులు విశ్వసించి సుగ్రీవాజ్ఞా సమాగతంబులై, లెక్కకు మించిన వానరభల్లూకాది బలంబులచే జుట్టంబడి, పరాక్రమంబవలంబించి రావణవధ సముద్యుక్తుండై యుద్ధంబునకు వెలువడి సహ్యామలయ పర్వతంబులకేగి, అచ్చటనుండి తాళీవనశ్యామంబగు మహోదధితీరంబు చేరి సుగ్రీవునిచే సైన్యమునచ్చట బ్రవేశింపజేసె.

అచ్చట లంకాపురంబున రావణుండు ఆంజనేయుని భయంకరకృత్యమునుచూచి లజ్జాభయంబులు దోచుచుండ తనయొద్దనున్న వారలంజూచి, రాక్షసులారా! ఒకవానరుడింతకార్యముచేసెను ఇక నేనేమిసేయుదు, ఏవిధముచేతనైనను సముద్రముదాటి శ్రీరాముండు యుద్ధమునకువచ్చును అతనితో యుద్ధమును జేయుటయో, లేక, సంధిచేయుటయో, మనపుర రాష్ట్రకోశములకు హానిలేకుండ యోచించి మీ అభిప్రాయముల దెల్పుడు ఏకార్యము జేసిననాకు జయముగలుగును, దెలియంజెప్పుండనిన విని సమీపస్థులగు రాక్షసులందరు రావణుని పరాక్రమాదుల బొగడి, రామలక్ష్మణుల యుద్ధమున నిస్సంశయంబుగ జయించెదవు గావున యుద్ధసన్నద్ధుండ వగుము సురాబోటి వీరులుండ నీకేమికొదువ అని యుపదేశింపుచు, నందుగొండలగు ప్రహస్త, దుర్ముఖ, కుంభ, నికుంభాదిరాక్షసులు తమతమ ప్రతాపంబుల బొగడుకొనుచు వారిలో ఒక్కొక్కరుండు వానరసేనాసహితంబుగ రామలక్ష్మణులం జయింపగలము, అని రభసాతిశయంబుగ బలుకుచుండ నప్పుడు వారిందఱిని, వారించి,నీతివిద్యా విభూషణుండగు విభీషణుండు అన్నకభిముఖుండై అంజలిబంధంబుతోనిలచి యిట్లనియె.

అన్నా! ఈ ప్రగల్భములాడెడి దైత్యవీరులు, ఒకవానర మాత్రుడువచ్చి అనేక దైత్యులంజంపి వాలాగ్నిచే పట్టణమును గాల్చునపుడు ఎచ్చటికిబోయిరో మహాప్ర

తాపశాలురవలె, తేజోనిధి యగు రాముని భ్రమింతుమని పలుకుచున్నారు. తనకు శత్రువునకుగల తారతమ్యము ను ముందు జక్కగవిచారించి కార్యమునడుపువాడు ఎప్పుడును చెడక సౌఖ్యమును బొందును, అట్లుగానిచో దుఃఖములపాలగును. రామదూతయే ఇంతకార్యముచే యగా ఇకరాముని విక్రమ తేజోవీర్యంబులు అప్రమేయం బులని నిస్సంశయముగ జెప్ప వచ్చునుగదా?

ముందు రాముండు నీకేవిధమైన యవమానమును జేయలేదు. ఆమహనీయుని పత్నిని వంచించి తెచ్చి ని ష్కారణముగా పగగొంటివి. ధర్మాత్ముండగు రామున కు జయము, అధర్మపరుండవగు నీకపజయము కలుగుట సిద్ధము, నీవు సీతనుదెచ్చినది మొదలు ఉత్పాతములే కలుగుచున్నవి. ఈదుర్మార్గులమాటలు వినక నామాటల యందు విశ్వాసముంచి యీ సతీతిలకమును రాముని కర్పించి సురక్షితుండవై పరమానందంబుతో నుండుము. నీవు శ్రీరామునకు సీతనర్పింపవేని, నీయొక్కని పాపము వలన లంకతోగూడ రాక్షసులందఱు నశింతురు. ఇదినిజ ము అని బహుప్రకారముల నుపదేశించుచున్న విభీషణుని మాటల జెడచెవులంబెట్టి సదుత్తరములేక కొలువుచా లించి గృహములోనికింబోయి యీ రాత్రిగడపి మరునా డు కొలువుకూటమునకువచ్చి బంధుమిత్ర మంత్రిసహితం బుగా గొలువున్న సమయంబున పరమసాత్వికా గ్రేసరుం డగు నావిభీషణుండు ఎప్పటియట్ల కొలువుకూటమునకు

వచ్చి సమయముజూచి మృదుమధుర వచనములతో యు క్తి యుక్తముగ నిరూపించి సీతాపహరణమువలన గీడు వాటిల్లునని బోధింప నద్దురాత్ముండు అప్పుడును వినకుండె.

అంత కుంభకర్ణుండు కొంతదడవు సీతను రాముని కర్పింపుమని పరమహితంబు జెప్పిన రావణుండది సమ్మతింపనందున తానును రామునితో యుద్ధము సేయుట కొప్పుకొనియె. మహాపార్శ్వుండను దుర్మంత్రి కుబుద్ధుండగు రావణునిజూచి కృతాంజలియై దనుజేంద్రా! నీవే ఈశ్వరుండవు నీకొక ఈశ్వరుండెవ్వడు. చింతవిడిచి జానకితో నిష్టభోగంబులనుభవింపుము. నీవిట్లు యోచించుటెందుకు ఈ వనితను వేగముగ నాక్రమించి కుక్కుటవృత్తి నవలంబించి కోర్కెదీర సుఖింపుము. అందువలన నేమివచ్చినను రానిమ్ము కోరికె ఘనమా? ప్రాణము ఘనమా? యోచింపుము. రాముడు యుద్ధమునకువచ్చిన నతనిని శస్త్రాస్త్రములచేవధించెదము. అని హితోపదేశముచేసిన నారావణుండతనింజూచి యో మహాపార్శ్వ! నీవు చెప్పినది నాకత్యంత రమణీయంబే కాని యందొక వేధయున్నది, పూర్వము చతుర్ముఖుని కొలువుకూటమునకు పుంజికస్థలయను నొక్క దేవతాస్త్రీ పోవుచుండ మార్గమధ్యమున జూచి నేను కామాతురుండనై బలాత్కారముగ భోగించితి, అంతట అది నలువకడకుబోయి తనయవమానము దెలుప జతుర్ముఖుండలిగి, నేడు మొదలుగ రావణుండు పరాంగననుబలాత్కారముగ భంగపరచినయెడల నతనిశిరము

సహస్ర శకలములగు గాక యనిశపించెను అందుచేత బలాత్కరింపనైతిని గాని రాామునకు భయపడికాదు. ఆమనుజ నాయకుడు కాలసర్పములవంటి నాబాణములకు భీతి నొందక మానడు. అనిన నప్పలుకులను కుంభకర్ణ మహాపార్శ్వవాక్యములనువిని విభీషణుండు కొంతసేపుమరం తచింతాభరంబున నూరకుండి నిట్టూర్పువిడిచి రావణుని జూచి పరమార్థయుక్తంబగు నొక్కవాక్యమునుపలికెను.

ఓయసురనాయకా! సీతను గోరకుము? కోరకుము! అట్లు కోరుట అయిన శిరములపన్నగముతో గ్రిడించినట్లు చెడిపోదువు! తులువలనుగోష్ఠనలు వినకుము? సీతను రామునకర్పింపుమనిన రావణుండలిగి కన్నులనగ్నికణంబులుచెదర, ఓరి! నీవు జ్ఞాతిశత్రుత్వము గనబరచుచున్నావు నీవిచటనుండదగవు ఎచ్చటికైన బొమ్ము అనుచు నంతకంతకు మితిలేనికోపంబున సింహాసనంబు దిగి విభీషణునియురంబున దనపాదముతో దన్నిన నతండు క్రిందబడి మూర్ఛిల్లెనంత రావణుండు కరవాలంబు కేలం బూని విభీషణుని శిరంబుదెగవేయంగమకించినబ్రహాస్తుం డడ్డగించి మంచిమాటలచే మరలింప దిరిగి సింహాసనంబుపై గూర్చుండె.

అంతలో విభీషణుండు మూర్ఛదేరి సామాన్యధర్మంబువదలి విశేషధర్మమునవలంబించి, ఉత్పథప్రవృత్తుండగు గురుండైన పినువందగినవాడుగావున రావణుని విడిచి, సర్వలోకరక్షణ్యుండగు రాము నాశ్రయించెదనని గదాపా

నై నలుగురురాక్షసులతోడ నంతరిక్షమునుపొంది అ న్నను జూచి క్రోధముతో అన్నా! నీవు నిత్యసముండవు ధర్మహీనంబుగ బల్కితివి నీకు వినాశకాలము సన్నిహితమై నామాట నీకు హితముగాకయ్యె, తలవ్రాతదప్పింప నశ్వరితరము హితపరుండనగు నన్ను అక్రమంబుగ నవమానించి వెడలిపొమ్మనియంటివిగావున యదేచ్ఛముగా జనియెద నీవు మద్విహీనుండవై లంకను సైన్యమును సకలమును కాపాడుకొని సుఖముగానుండుము అని పలుకుచు, విభీషణుండు రామలక్ష్మణులున్న స్థలమునకువచ్చి అంతరిక్షమున నిలచియుండ విభీషణునిజూచి సుగ్రీవుండు వానరులారా! యెవ్వడో ఒక రాక్షసుండు నలుగురురాక్షసులతో మనలహింసించుటకు వచ్చుచున్నవాడు సందియము లేదు అనిన, సుగ్రీవ వచనంబులవిని వానరులు వృక్షంబులబెకిలించుకొని మహారాజ! శీఘ్రముగ నాజ్ఞనొసంగుము, ఆదురాత్ముల నేలంగూల్చెదము అని పలుకుచున్న వానర భాషణంబులవిని, విభీషణుండు వారలంజూచి గొప్పకంఠరధ్వనితో, రాక్షసేశ్వరుండును, రాక్షసుండును ఖలుండును నగు రావణునితమ్ముండను, నాపేరు విభీషణుండు. అతడు జనస్థానమునుండి సీతనుహరించి ఇచ్చట రాక్షసీవశముచేసెను, ఆమానిని సురక్షితయైయున్నది. అట్టి రావణుని, పెక్కువిధములైన హేతుమద్వాక్యములతో నేను బోధించినను వాడు వినక దుర్వృత్తుండై నన్ను దాసునివలెని రాకరించి యవమానించుటవలన దారాపుత్రాదుల

వకలి రాఘవుని శరణము పొందితిని, మీరు, సర్వలోకశర
ణ్యుండును, మహాత్ముండునగు రాఘవునితోడ విభీష
ణుం డుపస్థితుండ నయ్యెనని, శీఘ్రంబున నన్నెఱింగింపుడని
(ఇట్లు చెప్పుటచేత రావణుండనుటవలన, లోకకంటకత్వంబును, రా
క్షసేశ్వరుండనుటచే, భృత్యసంబంధ ప్రయుక్త దోషవత్త్వంబును,
ఖలుండనుటచే, కృత్యాకృత్యవివేక హీనతారూప దోషవత్త్వంబును
రాక్షసుండనుటచే జాతిక్రౌర్యంబును, నేనతనితమ్ముండనని చెప్పుట
చే నతని రావణసంబంధ నిబంధనదోషవత్త్వంబును, స్పష్టముగు
టంజేసి, యీ మొదలగు శబ్దముల ప్రయోగించుటవలన సర్వహాని లక్షణ
కార్పణ్యరూపంబైన యంగంబును, సీతను రాఘవునికొసంగుమని పలి
కితి ననుటచేత నానుకూల్యసంకల్పరూపంబైన యంగంబును, దాసుని
యట్లవమానితుండనైతినని పలుకుటచే ఈశ్వరసిద్ధహేతుక కరుణా
పరీపాకసంభూతంబగు రావణాపమానంబుచే గలిగిన ప్రయోజనాంత
రవైముఖ్యంబును, పుత్రదారాదులఁ బరిత్యజించివచ్చితినని పలుకుటవల
న ప్రాతికూల్యవర్జనరూపంబైన యంగంబును, రాఘవునిశరణంబు
నొందితినని పలుకుటవలన నాత్మనిక్షేపణరూపంబైన యంగంబును,
సర్వలోక శరణ్యుండని పలుకుటవలన నధికారిభేదంబులేకుండ సుర
నరవానర తిర్యక్స్థావరాంత సమస్తభూతంబులకు శరణ్యుండమనట్టి
తాత్పర్యంబును, రాఘవుండని పలుకుటవలన సర్వప్రార్థనా వైఫల్యం
బులేనను భావంబును, మహాత్ముండని పలుకుటవలన రాముని సర్వభా
వగతిజ్ఞత్వంబును, నన్నెఱింగింపుడని పలుకుటవలన నేను సర్వవిధబం
ధుత్వంబున రామునకు నాశ్రితుండ ననియెడు నభిప్రాయంబును, శీ
ఘ్రంబని పలుకుటవలన శీతల సురభిపద్మాకరంబు గనుంగొనిన తృషి
తునకుంబోలె విళంబితా సహత్వంబును, ప్రకటింపంజేయుచు, స
ర్వలోకశరణ్యాది వాక్యపంచక ప్రయోగంబున గోప్తృత్వవరణరూ

పంబైన యంగంబును, సుప్రతిష్ఠితుండయ్యెనని పలుకుటవలన విశ్వాస రూపమైన యంగంబును, సుస్పష్టముగా సూచింపజేయుచు భగవచ్ఛాస్త్రోక్త షడ్విధశరణాగతిలక్షణంబు తేర్పడునట్లు,) పలికినవిని సుగ్రీవుండు శ్రీరాముని మొగ్గకుంబోలె, మహాత్మా! ఇప్పుడు మీకు శత్రువగు రావణుండు, తనతమ్ముండగు విభీషణుడు తనకు నీతినిబోధింప దానినివినక నాతనిని యవమానించినందున నావిభీషణుండు దారాపుత్రాదులవిడిచి నలుగురు రాక్షసులతోడ నిచ్చటికివచ్చి దేవరవారిని శరణంబు వేడుచున్నాడు. వాని విధమెట్టిదో మనకు దెలియనేరదు వాడు ప్రచ్ఛన్నముగ గగనతలమునందున్నవాడు రాక్షసులు మాయావంతులు, నమ్మరాదు వీడు మనగుట్టు దెలిసికొనవచ్చిన రావణచారుండు వీనిని విశ్వసింపగూడదు. శరణాగతుండెట్లు పరిత్యాజ్యుండని సందేహింపవలదు మీరువిశ్వసించితిరేని మనసైన్యమునకు హానివచ్చునుగావున వీనిని, వీనితోడవచ్చినవారిని వధించుటయుక్తము అని యూరకుండె.

అప్పుడు రాఘవుండు సుగ్రీవ వచనంబులువిని, హనుమదంగదజాంబవదాదుల నవలోకించి, ఇప్పుడు శరణాగతుండై యున్న విభీషణుండు మనకు పరిగ్రాహ్యుడా? లేక సుగ్రీవమతప్రకారము దండార్హుడా మీ మీయభిప్రాయముల వేర్వేఱుగ వివరింపుడనిన నావానరులు ముకుళితహస్తులై, స్వామీ! దేవరవారు సర్వజ్ఞులు, మేము తమకు ఏమిచెప్పగలము అయినను దేవరవారి యాజ్ఞాను సా

రముగా, మనవిచేసెదము, అనుచు ఉపద్వేదముగ సుగ్రీవుని వచనప్రకారము గొందఱును, పరీక్షించి చేర్పవలయునని కొందఱును జెప్ప, ఆంజనేయుండు వీరిమతములను ఖండించుచు నారాముని జూచి. మహాత్మా! వీనియంతర్గతంబైన భావము, స్వరశుద్ధతను, ముఖంబులవలన సూచింపం జేయుచున్నది. ఇట్టిలక్షణంబులు కపట విహార శీలునకు గలుగ నేరవు నీవును బరేంగితజ్ఞుండవు నీకుఁజెప్పనేల యితండు దుర్వృత్తుండైన రావణునివిడిచి నిన్ను సత్యప్రతిజ్ఞునింగా నెఱింగి వాలివధంబును సుగ్రీవరాజ్యాభిషేకంబును విని, నీశ్రయమును బాగుగవిచారించి, రాజ్యార్థియై మనఃపూర్వకముగా నిన్ను శరణంబు వేడుచున్నాడు, అని బుద్ధికి దగినట్లు, నాకు తోచుచున్నది, దేవరవారు బుద్ధిమంతులలో శ్రేష్ఠులు తమకు తెలియనిదేమియునుండదు ఇక కర్తవ్యాంశమునకు, దేవరవారే ప్రమాణంబనిపలికిన నతనివచనములువిని, రాఘవుండిట్లనియె.

ఓవానరులారా! విభీషణునిగూర్చి నాకునుకొంచెము చెప్పవలయునను నిచ్ఛయున్నది దానిని నాశ్రేయమును గోరుచున్న మీరు వినవలయును, మిత్రభావముచే వచ్చినవానిని, ఎట్టులనైనను విడువజాలను, వానియందు దోషమున్నను వానిని విడువగూడదు, ఇది సత్పురుషులకు నింద్యముగాదు. అనినవిని సుగ్రీవుండు రఘునందనుని జూచి స్వామీ! వీడు ఎట్టివాడైనను కానిండు వ్యసనము

ను పొందియున్న అన్ననువదలి, శత్రుపక్షము నాశ్రయింపవచ్చెనుగదా ఎట్లు పరిగ్రాహ్యు డు? అనిన రాఘవుండు చిరునగవుతో తమ్మునింజూచి లక్ష్మణా! సుగ్రీవుండు శాస్త్రపరిజ్ఞానములేకయు, పెద్దలసేవలేకయు నిట్లు చెప్పుచున్నాడు సామాన్యవిశేషధర్మ పరిజ్ఞాతలు శరణాగతుని విడువగూడదు. వాఁడు భేదపరుచునంటివేని మనము వానికి జ్ఞాతులముకాము, వీడురాజ్యమునుగోరి రావణునివలన భయముజెంది మనల నాశ్రయించెను, దుర్మార్గులగు రాక్షసులకు గుణగ్రహణముండునాయని సందేహింపవలదు దైత్యులలోను, పండితోత్తములుఁగలరు కావున విభీషణుడు పరిగ్రాహ్యుండేయనిన సుగ్రీవుండు లక్ష్మణుని తోడలేచి, నమస్కరించి రఘుకులతిలకా! వీనిని రావణునిచేబంపబడిన వానినిగా నెఱుంగుము, వీనిమధురవాక్యములనమ్మవలదు, సచివసహితుండగు వీడు లక్ష్మణునిచే జంపదగినవాఁడు అనిపలికి మౌనముగానుండిన, దాశరథి, సుగ్రీవునింజూచి, మిత్రమా! నీవు వీనిని వంచకుడనిచెప్పుచున్నావు అట్లైననేమి వీడునాకు గోరంతైన, నహితము జేయుటకు సమర్థుండుగాడు. పిశాచ, దానవ, యక్ష, రాక్షసులెవరైనగాని నాకు అపకారాసక్తులైరేని వారల నాకొనవ్రేలిచేగొట్టిపై చెదను ఇతండుబద్ధాంజలియై దీనుండై శరణాగతుండై వచ్చెనుగావున మనచేరక్షింపదగినవాడు. ఆర్తుడుగాని, దృప్తుండుగాని, శత్రుండుగాని శరణాగతుండై నచో ప్రాణమునిచ్చియైన రక్షించినవానిని రక్షింపవలయు

అట్లు చేయకున్న ధర్మహానిని చెంది లోకగర్హితుండగును. మఱియు భయముచేగాని, అజ్ఞానముచేగాని, కామము చేగాని శరణాగతునిరక్షింపక శిక్షించినయెడల, వాడువీని పుణ్యమును గొని స్వర్గంబునకుబోవును, వానిదోషము వీనిని జెందును, కావున ప్రపన్నుల రక్షింపనియెడల స్వర్గ, కీర్తి, వీర్యహాని సంభవించును. ధర్మిష్టము, యశస్యము స్వర్గ్యమునగు కండుమహాముని వచనంబు సఫలంబుజేసెదను. ఎవండుగాని ప్రపన్నుండై, నీవాడను అని యాచించినయెడ, సకలభూతములకు నభయమొసంగుచున్నాను, ఇది నాకువ్రతము. వీడు విభీషణుండుగాని పరద్వేషధారియగు రావణుండుగాని శరణాగతుండగుటచే రక్షింపక మానను అని, సర్వలోక శరణ్యత్వ, సర్వశక్తిత్వ, సర్వజ్ఞత్వ, పరమకారుణికత్వ పరమసత్త్వాదిగుణవిశిష్టుండనైన నాకనాదిసిద్ధంబగు సహజవ్రత విశేషంబును గలదను నర్థంబు దేటపడునట్లు పలికి వానరులంజూచి విభీషణుని కభయంబు నాచేదత్తంబయ్యె నికదోడ్కొని రండని యాజ్ఞాపించిన, సుగ్రీవుండును శ్రీరఘునందనుని శరణాగతరక్షణ దీక్షాపరతకు నాశ్చర్యమునెందుచు విచ్ఛిన్నసంశయుండై విభీషణుని సచివసహితంబుగా దోడ్కొనివచ్చిన నాతండు అత్యంతభక్తితోడ శ్రీరాముని చరణారవిందములకు బ్రణమిల్లి యిట్లనియె.

చ॥ అనఘుడరావణుసోదరుడ నాతనిచే నవమానితుండనై,
మానకొని సర్వమువ్విడిచి భూతశరణ్యుడవైననిన్ను జ,

కృపన శరణంబునొందితి సుఖంబును రాజ్యముజీవితంబు మిం,
చినకృపసేయుదీనముగ జేకొనిభృత్యునిగాగనేలుమీ.

అనిన దాశరథి విభీషణుని ఉచితసాంత్వ వచనంబుల నభయంబొసంగి, యతనివలన రావణుని బలంబునంతయు నెఱింగి, ప్రేమంబుమీఱ నతనిని కపిసైన్యమున గూర్చుం డనియమించి సాగరజలంబులచే సమంత్రకంబుగ లంకా రాజ్యాభిషేకంబుసేసిన నాతండు పరమానంద భరితుండై వానరులంగూడి రామకైంకర్య నిరతుండైయుండ, నా నావానరులందఱు విభీషణునిజూచి సముద్రమును దాటుడెవి ధమెట్లనియడుగ, నాతండు ఇది సగరపుత్రులచే పరివర్ధి తంబు గావున రఘుపతి, శరణాగతుండైనచో నాసము ద్రుండు ప్రసన్నుండై మార్గమునిచ్చునని తెలిపిన, నది విని సుగ్రీవుండు వేగముగ రామసన్నిధికింబోయి విభీషణ వాక్యంబుల విన్నవింప దాశరథి సుగ్రీవాదులంజూచి మీ యభిప్రాయంబేమనియడుగ ఇంద్రవరుణాదులకైన సేతువు లేక సముద్రమును దాటుటకలవి కాదు. అయినను విభీషణ వాక్యానుసారముగా సముద్రుని ప్రార్థింపుడు. అతండు మార్గవిధానప్రకారమును దెల్పును. ఇక ఆలస్యమెందు కులెండు అని పలికిన రఘురాముండు సముద్రతీరంబున తూర్పుమొగంబుగనిలిచి యంజలిగావించి సముద్రునిప్రా ర్థింపుచు గోసహస్రప్రదాయకంబును, శ్రితజనాభయదా యకంబును, అహితభయదాయకంబునగు తన బాహు దండమును దిండుగాజేసికొని దర్భాస్తరణంబున బరుండి

ఇప్పుడు సముద్రమునైన దాటవలయు. లేక మరణంబునైన జెందవలయు మఱియొకవిధములేదు అని నూనియై విధ్యుక్త రీతిగనుపాసించుచుండ సాగరుండు తన విరోధులను రామునిచే వధింపజేయుటకును, రావణునిభయంబున తత్సంహార క్షమంబగు రాముని పరాక్రమంబు పరీక్షించుటకును మూడురాత్రులవరకు గనపడకుండిన రఘువీరుండలిగి తమ్మునిజూచి ఓ లక్ష్మణా! సామమునఁ నెంత వేడినను, సాగరుఁడు తనరూపమును చూపకున్నాడు తీక్ష్ణ శరంబుల బ్రయోగించి శోషింపజేసి వానరులు కాల్నడతో బోవునట్లు చేసెదనని, ఘోరంబగు చాపంబందుకొని ప్రళయకాలాగ్నివలె వెలుంగుచు దుష్ప్రధర్షుండై అమోఘబాణంబులవదలిన నవి ప్రళయకాల ఝంఝామారుత సహితంబులగు నగ్నిజ్వాలల గ్రక్కుచు సాగరజలంబులఁజొచ్చి చిందరవందరచేసి మహాక్షోభంబుగలిగించె నప్పుడు అమ్మహాధ్వని నభోంతరాళంబులునిండి దిక్కులు భేదిల్లజేసె.

ఇట్లు భయోత్పాతంబుగలిగింప లక్ష్మణుండు అన్నగారికోపంబును శమింపజేయ నెంచి అన్నా! సకల జంతువుల కాశ్రయుండగు సముద్రుడు చెడిపోవుచున్నాడు ప్రసన్నత జెందుము అని ప్రార్థించిన రాముడు కోపముచాలింపక ఆసముద్రునిజూచి ఇట్లనియె.

చ॥ పలుమరుఁద్రోవజూపుడని ప్రార్థనసేయఁగనేల నిన్ను మ
ద్విలసితచాపముక్తశరవేగమున న్భవదంతరాళముల్,
దలకొని ఘోరసత్త్వసహితంబుగ భస్మముజేసి కాల్నడన్,
జెంగ చవనాటకోటి నడిపించెదజూడుము నామకీర్తనన్॥

మఱియు జలోపరిసేతుబంధన జలస్తంభన తద్భేద
నాదిశక్తిత్రయరూపంబైన మదీయవిక్రమంబును, శాస్త్ర
వశ్యత్వ సౌజన్యనిబంధన శరణవరణరూప పురుషకృత్యం
బునెఱుంగవైతివి అనిపలుకుచు సకలజగంబులు భయప
డునట్లుగ ధనుష్టంకారముజేసి సముద్రభయోత్పాదనం
బుగానటకు బ్రహ్మాస్త్రమును సంధింపనప్పుడారాముని కో
పాటోపంబునకు మహాత్మ్యంబులుగలిగిన సముద్రుం
డాక్షోభంబునుసహింపజాలక, నిజరూపంబుధరించి గంగా
సరస్వతీ గౌతమీ ప్రభృతిమహానదులు మనోహర స్త్రీ
రూపధారిణులై యుభయపార్శ్వంబులనడువ, శీఘ్రగమ
నంబున రఘువీరునొద్దకుజనువెంచి చిటులతటఘటితాంజ
లిపుటుండై యిట్లనియె. అనఘా! నీవు కోపింపనేనెంతవాడ
ను పృథివ్యప్తేజోవాయ్వాకాశములు శాశ్వతమార్గ
ముల నవలంబించియుండుట స్వాభావికము, అగాధముగా
ను దాటనశక్యముగాను ఉండుటనాస్వభావము నేను కా
మమువలనను, లోభమువలనను, గర్వమువలనను కాదు,
ఎట్టులైనను నాజలమును స్తంభింపజేసి నాయందలి నక్రమీ
నాదిజలజంతువులవలన గలిగెడి భయము వానరులకు
లేకుండజేసెదను సుఖముగ వెడలవచ్చునని రామునకు
ప్రసన్నుండై, ఓరత్నాకరా! నాయస్త్రం బమోఘంబు
గాన నెచ్చటవిడుతును అని సముద్రునియడుగ నాకుత్త
రావకాశమునందు ద్రుమకుల్యంబను పుణ్యదేశముగలదు
అచ్చట మహాపాపులగు రాక్షసులు పవిత్రములగు నాయు

వకములను ద్రాగుచున్నారు ఆపాపులస్పర్శంబు నేను స
హింపలేకున్నాను ఈయస్త్రంబును వారిపై విడువుమనిన
రాముండట్లుచేసిన నాబాణవేగంబునకు జలమంతయు,
క్షోభంబునొందె. నద్దేశంబు మరుకాంతారంబన ప్రసిద్ధి
వహించియుండ పరమదయాళుండై యచ్చటతిరుగా తృణ
జల సుగంధపుష్పఫల భరితవృక్షలతా గుల్మంబులేర్పడు
నట్లు వరంబొసంగిన సముద్రుండు సంతసించి, విశ్వకర్మ
పుత్రుండగు నలుండను వానరునిచే సేతువును నాయందు
నిర్మింపుము వృక్షపాషాణాదులు మునుగకుండ నేనువహిం
చెదనని చెప్పి రామాజ్ఞగొని సముద్రుండు చనియె, నంత
రాముండు నలునిచే సేతువును నిర్మింపజేసియామార్గమున
సముద్రమునుదాటి లంకానగరంబునుజూచి రమ్యప్రదే
శంబున బ్రవేశించి శాస్త్రదృష్టవిధానంబున సైన్యంబు
విభజించి గరుడాకారవ్యూహమును పన్నుకొని ఆయా
ప్రధానస్థానములయందు మహావీరులగు నంగదాదులను
నిచె. శ్రీరాఘవుండు అంతకుమున్ను కట్టివేయంబడిన రావ
ణదూతయగు శుకుని బంధములవిడిపింపుమనిన వానరు
లువానిని విడిపింప వాడు బ్రోకుదక్కెనని రావణుపా
లికింబోయి దైత్యేశ్వరా! భవదాజ్ఞానుసారంబుగ నేను
సుగ్రీవునికడకేగిన వానరులు అత్యంతకోపముతో నన్ను
కాష్ఠముష్టిప్రహరణంబులచే నొప్పించి త్రాళ్లతో గదల
కుండగట్టివైచిరి అందువలన సుగ్రీవునితో సంభాషింప
వశక్తుండనైతిని ఆరాముని ప్రతాపమును నేను వర్ణింప

శక్తుండనుగాను, భల్లూకవానర సమూహము మేది నియం తెటను గప్పియున్నది. దేవ రాక్షసులకు వలెనే వారికిమనకు సంధికుదుర నేరదు. వారుప్రాకారమునకు వచ్చునంతలో సీతనైననిమ్ము, లేక యుద్ధమునైననిమ్ము అనిన శుకునిం జూచి, రోషసంరక్తలోచనుండై రావణుండు, దేవగంధర్వదానవులు నామీఁదికి యుద్ధమునకువచ్చినను సీతనియ్యను, నాప్రతాపము రామునకు దేటపడ యుద్ధముచేసెదనని పలికి తన యమాత్యముఖ్యులగు శుకసారణులనుబిలచి మీరుప్రచ్ఛన్నవేషముతో రాముని సైన్య బల వీర్య ప్రమాణంబులను అందు ముఖ్యులగు శూరులెవ్వరో వారిని బాగుగా బరిశోధించి తెలిసికొని రండని పంచిన వారు మర్కటరూపముతో సైన్యంబుప్రవేశింప రాక్షస మాయా విశారదుండగు విభీషణుండు వారల నెఱింగి త్వరితంబునబట్టి తెచ్చి రాముని ముంగటనిలిపి వీరు రావణమంత్రులు, కపటవేషముతో మనసైన్యమున ప్రవేశించియున్నవారలని తెలిపిన, వారు, నిజరూపముల దాల్చి శ్రీరామునిం జూచి అతి భయంబుతో యథార్థమును దెలిపి, రామాజ్ఞా ప్రకారము సైన్యమునంతయుజూచి వెడలి రావణునిఁ డగ్గి, అధిపా! రాముని సద్గుణముల ను, వీర్యతేజంబులను, వారిసహాయకుల ప్రతాపంబులను వివరింపశక్యముగాదు. అవిసాటిలేనివి నీవు ఇకశమంబు దాల్చి రామునకు సీతను సమర్పించిసంతోషివై యుండుము, అనిన కోపోద్దీపితముఖుండై వారలంజూచి రావణుండు ఓ

మంత్రులారా! వారివలన మీరు పీడింపబడుటచే నిట్లు పలుకుచున్నారు నాకేమిభయము, అమర్త్యులుండగు రాముడు నాకెంతమాత్రము. నేను సీతనియ్యను, అనుచుమంత్రిసహితుండై ఉన్నతమైన ప్రాసాదము నెక్కి అసంఖ్యాంబహు వానరవాహినిని జూచుచుండ శుకసారణులు వారివారి నామములను పరాక్రమములను ప్రశంసించి చెప్పు గావిని గుండెలవియ నధికకోపంబుతో వారలంజూచి దుష్టసచివులారా! మీరు ఈసమయంబున నాశత్రువులబొగడుటెల్ల, నన్ను దెగడినట్లుగదా, మిమ్ముగూడి దైవయోగంబున నింతకాలము రాజ్యంబేలుచుంటిని మిక్కిలి సమర్థుండనైన నాముంగల భయములేక విప్రియంబులు బలుకుచున్నారు మీగర్వము నేమనవచ్చును. ఇప్పుడు మిమ్ము వధింప వలయును శత్రుపక్ష ప్రశంసాపరులగు మీరు నాకడనుండ నర్హులుకారు తొలంగిపొండు. అని వెడల గొట్టి అచ్చటనున్నమహోదరునివలన శార్దూలాది చారులరావించి, వారిని రాముని సేనావిశేషంబులెఱింగి రండని పంపించినవారు ప్రచ్ఛన్నవేషులై యచ్చటికేగి వారిని పరికించుచుండగా విభీషణుండెరిగి వానరులకుజెప్పిన వారలు శార్దూలుని పట్టుకొని చిదియగొట్టుచుండ దయాళుండగు రఘునందనుండు దూతవధంబుసేయకూడదు విడువుండనిన వారువిడిచిరి.

అప్పుడా శార్దూలుడు ప్రాణముదక్కి రావణునొద్దకు వచ్చి దైత్యేశ్వరా! రామప్రతాపంబును తత్సహాయకుల

అపారశక్తియును వర్ణింపశక్యంబుగాకున్నది సీతమ్మండ
గు విభీషణుండు రామహితార్థియై లంకా రాజ్యాభిషేక
క్లిన్నమస్తకుండై విజృంభించియున్నాడు. వానర బలం
బు సువేలాచలంబున విడిసియున్నది నేనుచూచినకంత
యుం జెప్పితి నికనీయిష్టముచొప్పున నడచుకొనుమనియె.

అప్పుడు రావణుండువిని మనంబున నుద్వేగంబుగలిగి
విద్యుజ్జిహ్వునిబిలచి, మిత్రమా! నీవు నీమాయాబలంబున
రామ శిరమునంబోలు శిరంబును, అట్లని ధనుర్బాణములను
కల్పించుకొని నావెంటరమ్ము అనిపలికి తాను సీతకడకేగి
సులలనా! నీ ధవుడు యుద్ధరంగమున హతుండయ్యె నిదిగో అత
ని శిరంబును చాపంబునుంజూడుము, ఇక నన్ను వరించి
సుఖింపుము అని మాయాలాపంబులు పలుక జానకి యారా
శిరంబును ధనుర్బాణములనుజూచి నిజముగపతిహతుండై
య్యెనని నమ్మి, పట్టరానిశోకంబున నక్కటా, హా, ఇక్ష్వా
కులనందనా! ఇక నేమిసేయుదానను కలహశీలిని యగు
కైకేయివలన కులమంతయు నశింప జేయబడియె. నిరప
రాధియగునిన్ను నిష్కారణముగ మునివేషంబున నర
ణ్యమునకుబంపి ఇంతచేసెనే, యని నిందింపుచు గాలికి విఱి
గినకదళివలె నేలంబడిమూర్ఛిల్లి కొంతతడవుకుదెలివిగాం
చి బహుప్రకారంబుల విలపించుచుండ ప్రహస్తునిచే నొ
క్కరాజ కార్యవిమర్శనంబుకొఱకు బిలువనంపబడి రావ
ణుండటరిగి మంత్రులతో నాలోచించి యుద్ధ సన్నద్ధుండై
భేరీనాదంబులు చెలగింపజేసెను, కొంతదడవుకు మాయా

కల్పితంబగు నా రామశిరంబును ధనుర్బాణంబులును సంత్రాసము జెందెను అంతజానకి దుఃఖాతిశయంబున నేలం బొరలుచుండ విభీషణుని భార్యయగు సరమ సీతనాశ్వాసించి, అమ్మా! దుఃఖింపకుము, ఇది యంతయు రావణుని మాయ యని తెలిసికొనుము. నీభర్త దేవాసురులకు అవధ్యుడు.

క॥ శోకము బరిత్యజింపుము, లోకంబుల్ మెచ్చ నీకు నిజముగ నీకన,
శ్రీకరతిలకుండగు నిన్నుం, జేకొను విజయంబు, నమ్మిసేయుము ప్రీతిన్.

అని చెప్పుచుండ రణభేరీధ్వనులు వినంబడియె నప్పుడు సరమ సీతం జూచి ఇదిగో యుద్ధము ప్రారంభమగుచున్నది. నీభర్త రాక్షసులనందఱిని ఖండించి నిన్ను గైకొనిపోగలడు. భయమును వదలుమని పలికినపిదప సీత దుఃఖమును చాలించెనప్పుడు వానరసింహనాదములు రణభేరీధ్వనులు వినంబడియె. నాధ్వనులు వినిన రావణుండు సభాస్థలికేగి మంత్రులజూచి మీరలేల నొకరిముఖము నొకరు చూచుకొనుచున్నారు, వీరు మహావీరులు యుద్ధమునకు దలపడుదని చెప్పెన, అతని మాతామహుండగు మాల్యవంతుడు అనేకవిధముల నీతి బోధింప రావణుండు వినకుండుటనుచూచి, నీతిశాస్త్రజ్ఞుండగు నతికాయుండు వినయమునొప్ప రావణునికిట్లనియె.

సీ॥ అసురనాయక విను హరధనుర్గ్రసనంబు, పరశురాముని గర్వభం
జనంబు, తాటకాహరణంబు తాటకేయవధంబు ఖరదూషణా
దిక ఖండనంబు, మఱియును విరాధునిమరణంబును గబంధనిధనం

బు వానరసేతచావు, వారిధిపై సేతుబంధంబు వానవభీకరలంకా
ప్రవేశనంబు, నివిసను స్తంబు మననూలో నెంచిచూడ, మనుజ
మాత్రునకు సాధ్యమె పనులు గావు, రాక్షసారాతియగుహరి రాము
డగుచు, నినువధింపంగ జనియించె ననిశలంగు॥

అనిపలికిన నతికాయుని నీతివచనంబులనిందించి కాల
నోదితుండై ప్రహస్తునవలోకించి నీవుకొందఱు రాక్షసు
లంగూడి లంకాపూర్వద్వారంబుననుండుము, మహోదర
మహాపార్శ్వులు పెక్కండ్ర రక్కసులంగూడి దక్షిణ
ద్వారంబునను, ఇంద్రజిత్తు బహురాక్షస పరివృతుండై
పశ్చిమద్వారమునను, ఉండవలయును నేను శుకసారణు
లగూడి యుత్తరద్వారముననుండెద, విరూపాక్షుండు బ
హు రాక్షసపరివేష్టితుండై మధ్య గుల్మంబుననుండును,
ఇత్తెఱంగున లంకారక్షణ ప్రకారంబెఱింగించి యంతఃపు
రంబునకుంజనియె

ఈలంకా గుప్తికర్మంబును విభీషణుండు తనమంత్రుల
గు, సంపాత్యనల, ప్రఘస, శరభులవలనవిని రఘునం
దనునకెఱింగింప శ్రీరాముండు వానరసేనలను వ్యూహా
కారంబుగానుండ నియమించి యందఱినిదోడ్కొని సువే
లాచలంబునెక్కిన వానరులు యుద్ధసన్నద్ధరాక్షస భైర
వా రావంబులతో గూడినలంకనుజూచి, సింహనాదంబు
లు సేయుచు రామునిగొలిచియుండిరి అప్పుడు దాశరథి
త్రికూట శిఖరాగ్రంబుననున్న రావణునిజూచి చాలనా
శ్చర్యముజెందుచుండె. అంత సుగ్రీవుండు రావణసందర్శ

న సంజాతక్రోధము అతిశయింప రయంబునలేచి గరుడానిలతుల్యవేగంబున నతిసాహసంబుతో రావణుండున్నగోపురాగ్రంబుమీదికి లంఘించి, ఓరీ రావణా! నేనురాముని భక్తుండను మిత్రుండను, సుగ్రీవుండను వాడను, నింద్యచరిత్రుండవగు నిన్ను గీటణగింపవచ్చిన వాడననుచు నతనిరత్నకిరీటమును, శ్వేతచ్ఛత్రమును, సువర్ణాంగదములను నేలంబడదన్ని అతి ధీరత్వముతో భూమియందునిలిచిన, రావణుండు కిన్నులనిప్పులురాల నతనింజూచి ఓ సుగ్రీవా!నిన్ను హీన గ్రీవునింజేసెద జూడుమని వానింబట్టియెత్తి నేలపయింబడవైచె, ఇట్లు ఒండొరులు బాహుయుద్ధము నతిఘోరంబునజేయ నప్పుడు రావణుండు తన మాయచే వంచించుసమయంబున నతనిచేజిక్కక సుగ్రీవుండు రామునికడ కేగుదెంచిన నప్పుడువానరసైన్య సమేతుండై రాముండు లంకాసమీపమునుజేరి, వాలిపుత్రునింజూచి, ఓయంగదా! నీవు రావణునియొద్ద కేగినావచనంబులనిట్లనుము. అనిన నంగదుండు రావణుని సమీపమున కేగి మహాధీరత్వంబున నిట్లనియె.

ఉ॥ దాసుడ రాఘవేంద్రునకు దప్పక నిన్ను నుదోఁకఁగట్టి పే, రాసఁజ
తుస్సముద్రముల నుందు జలంబున ముంచినట్టియా, వాసవనం
దనుండయిన వాలికుమారుడ నంగదుండనా, కోపలనేత వీక
వకు గొబ్బునబంధుగవచ్చితిండగ ॥

ఆమ్మహాత్ముండు నీతో జెప్పమనిన విధంబువినుపించెద సావధానుండవై వినుము,

చ॥ నరసురయక్షకింపురుష నాగనభశ్చరసిద్ధసాధ్య కి,
న్నరులకు మానికోటికి ననాగతముంగడు క్రూరబుద్ధిచే,
దురితము నర్చి తీవ్రకదుదుష్టుని నిన్నని లోవధించి ని,
ర్జరులకు మేలుచే యుటకు జయ్యనవచ్చిన వాడ నెంతయున్॥

క॥ దనుజాధమ యే బలమున, వనమున ననుమాయచేత వంచించి
మహీ, తన యంగొని తెచ్చితివా, యనుపమబలమంతజూపు మమ
పరమయ్యెన్॥

చ॥ ఖలుడవు ధర్మహీనుడవు, కాపథవర్తివఁ పండితుండ వీ,
యలఘుతరం బకంటకము, సైనసిశాటజనేశ్వరత్వమా,
విలసితకాలమైన భుజియింపగ నేరవు రమ్ము ధర్మని,
శ్చలుఁ డగు మావిభీషణుడు శాశ్వతుడై యిక లంక నేలెడిన్॥

ఉ॥ రావణసీతనిచ్చి యపరాధని నిస్కరణంబు వేడితిన్,
గావు మటంచు నన్ను గడకన్ బడగ పడిన నిన్ను గాచెదన్,
గావర మెత్తి యవ్విధము గాక పెనంగితివేని నిన్ను బా,
హావిభవంబెలర్ప సమరాంగని గ్రుంతు పరాక్రమంబుగన్॥

అని పలికిన యంగదుని వచనంబులువిని రావణుండు
కన్నుల నిప్పులురాల రాక్షసులంజూచి ముందుగ ఈవా
నరునిబట్టి చంపుడు. అనిన నారాక్షసులంగదుని పైకొని
నవానిని యవలీలంజంపి రావణుని ప్రాసాదమును పగులద
న్ని, జవంబున రాముని కడకుంజనుదెంచె, నంత నిక్కడ
రఘువీరుండు, హనుమజ్జాంబవదాదులం గూడి యుద్ధమున
కు సన్నద్ధుండై యుండె, వానరసేనలు నానాయుధపాణులై
సింహనాదంబులు సేయుచు లంకాపురంబంతయు చెలరే
గియుండిరి అప్పుడు రావణుండు మేడమీఁద నెక్కి సము

ప్రతరంగములవలెనున్న వానరసేనంజూచి కొంతసేపు ది
గులుజెంది, మఱికొంతతడవుకు ధైర్యమవలంబించి పాద
ఘట్టనములతో లోపలికినదిగె, అంతరాముండు రాక్షస
రక్షితంబగు లంకాపురినిజూచి, జానకిపై చిత్తంబునగిలి
కొంతసేపు చింతాక్రాంతుండై. రాక్షసులపై క్రోధంబ
తిశయింప. ఓవానరులారా! ఈరాక్షససేనను హతముజే
యుండనిని నారాముని యాజ్ఞను శిరసావహించి వారలు
ఉగ్రులై సింహనాదముసేయుచు ప్రాణంబులువిడిచియైన
రామునకు ప్రియంబుసేయుగ మాతికంబు మనకభ్యుద
యంబెయ్యదియు నలంపుదు, అన్యదనిశ్చక సంఖ్యాలుగ
శైలవనమలి పాషాణాగ్రము ముష్టిప్రహారంబులచే నచ్చ
టి ప్రాసాదంబులు కూల్చుచు నగ ద్వారబూష్పుచు తోరణం
బుల బడగొట్టుచు «జయత్యతిబలో రామో లక్ష్మణశ్చ
మహాబలః రాజా జయతి సుగ్రీవో రాఘవేణాభిపాలితః,
అని పలుకగా నుచ్చరించుచు, రాక్షసులపై పాషాణంబుల
విసురుచు పరాక్రమ ఘోషంబులతిశయింప వానరులు చె
లరేగి యారాక్షసులను దంతములచే గఱచుచు బాహు
వులచే బడగొట్టుచు మహాసంరంభముసేయుచుండ పర్వత
సంకాశులగు రాక్షసులు మహాభయంకరాకారులై ప్రా
సాదంబులనుండి భిండివాలఖడ్గశూల పరిఘాద్యాయుధం
బులచే వానరుల నొప్పించిన వానరు లతిరౌద్రాకారులై
ప్రాసాదంబులమీదనున్న రాక్షసులక్రిందికి బడలాగి బా
హుముష్టికరతలములచే బ్రహరించి నేలంబడవైచిరి. ఇ

ట్లు వానరరాక్షసులకు దేవాసురులకువలె మహాఘోర
యుద్ధంబయ్యె. అట్టిసమయంబున జంబుమాలిని ఆంజనే
యుండును, మిత్రఘ్నుని విభీషణుండును, వజ్రముష్టిని
మైందుండును, అశనిప్రభుని ద్వివిదుండును, తపన, ప్రఘ
స, ప్రతపన, విద్యున్మాలులను, క్రమముగ, గజ, సుగ్రీవ,
నల, సుషేణులును, రశ్మికేతుయజ్ఞశత్రు, సుప్తఘ్నుల
ను శ్రీరాముండును జంపిరి. ఇట్లువానరరాక్షస సంకుల
యుద్ధము జరుగుచుండ సూర్యుండస్తమించె నంతరాత్రి
యగుటంజేసి, తోకలేనివాడు రాక్షసుండనియు, తోక
యున్నవాడు వానరుండనియు నెఱుంగుచు వారుఘోర
యుద్ధముచేసిరి. అంగదుండు ఒకమహావృక్షంబును బెకి
కికొని ముందుగ గుఱ్ఱములను, సారథినిబరిమార్చి పిదప
ఇంద్రజిత్తును ప్రహరించి విరథుంజేసెను అప్పుడాయిం
ద్రజిత్తు వానరులతోఁ బోరుచు వరదానగర్వితుండై తన
మాయా బలంబున మేఘములయందు దాగి వార
లకదృశ్యుండై క్రూరసర్పరూపంబులగు శరంబులచే రా
మలక్ష్మణులబాధింపుచుండ రామలక్ష్మణులు కొంచెమై
నను చలింపకుండుటనుచూచి ఇంద్రజిత్తు మాయనుపూ
ని నాగాస్త్రములచే వారిని బంధించిన బ్రహ్మవరదానపా
లనంబుకొఱకు ఇంద్రజిత్ప్రయుక్తనాగపాశ సహనంబు
యుక్తమనితలంచి అనుజసహితంబుగా పాశబద్ధుండై నే
లంబడియె తాను ప్రతాపవంతుండయ్యును నిజశక్తిని
మఱుగుపరచి ఇంద్రజిత్తు ఉండుచోటును ఎఱుంగంగోరి

యా వానరయూథపుల నవలోకించి మీార లీరాక్షసుల గతినన్వేషింపుడనిన వానరులు వృక్షంబుల కేలంబూని గగనమార్గంబున వెదకుచుండ ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రము చే వారిగమనశక్తినుడిగింప వారశక్తులై యతనింగన జాలక క్రిందికివచ్చిరి అంత నామాయావి రాజపుత్రులదే హంబున నసంఖ్య శరపరంపరలచే నొకయంగుళమాత్ర మైన నవకాశములేకుండ బ్రయోగింప, వ్రణితదేహులై చేష్టలుమాని శరతల్పంబుల శయనించియుండుటజూచి వా నరులందఱు దుఃఖించుచునిరుత్సాహులై ఆయుధంబులనే లంబడవైచి రామలక్ష్మణులం బరివేష్టించియుండిరి.విభీష ణుండునూత్రము మాయావియగు ఇంద్రజిత్తును గనుం గొనియె నప్పుడు దుఃఖాక్రాంతులైన సుగ్రీవాదులను వి భీషణుండూరడింప వారందఱు ధైర్యమవలంబించి వృ క్షాద్యాయుధంబుల ధరించిరామలక్ష్మణులరక్షింపుచుండిరి. అంత ఇంద్రజిత్తు తండ్రికడకేగి రామలక్ష్మణులు హ తులైరని విన్నవించె నప్పుడు రావణుండు పరమానంద భరితుండై కొడుకునుపొగడి రాక్షసస్త్రీల బిలచి యుద్ధ భూమియందు బడియున్న రామలక్ష్మణులను సీతకుజూపు డని యాజ్ఞాపించిన, వారు సీతను పుష్పకంబుపై నెక్కిం చుకొని యచ్చటికేగిచూపింపగా, నచ్చట శరవిభిన్నగా త్రులై కనులుమూసుకొని శరపంజరమున శయనించియు న్న రామలక్ష్మణులను, దుఃఖాక్రాంతులై రామునింబరి వేష్టించియున్న హనుమదాదులనుంజూచి సీతమిక్కిలి విల

పించుచు ఆహా! నాకు వైధవ్యము లేదనియు, రామునితోగూ
డి అశ్వమేధయాగము జేయుదుననియు సాముద్రికవేత్త
లు చెప్పినమాట లసత్యంబయ్యెనే ఇకనేమిసేయుదానన
ని బహుప్రకారంబుల విలపించుచున్న సీతనుజూచి త్రిజట,
అమ్మా! నీప్రియుండు ప్రాణములతోనున్నవాడు ఇదినిజ
ము, రాముని ముఖకాంతిని నీశుభలక్షణంబులఁజూడ
ఇట్లు కలుగుట కవకాశముండదు అతడు దేవాసురులకజే
యుడు, ఈపుష్పకము, విధవలనువహింపదు, వానరయూ
థపులు తేజోవంతులైయున్నవారు కావున నీహేతువుల
చే వారికిదిమూర్ఛ, మరణముకానేరదు నమ్ముమనిన కృ
తాంజలియై నీవాక్యంబు సత్యంబగు గాకయని పుష్పకం
బెక్కి త్రిజటాయుక్తంబుగ నశోకవనంబు ప్రవేశించె. అం
తనింతసేపునకు రాముండు మూర్ఛదేఱి తనపార్శ్వంబు
న రక్తసిక్తసర్వాంగుడై గాఢమూర్ఛాపారవశ్యంబు
న బడమింబడియున్న లక్ష్మణుంజూచి పరిపరివిధంబుల
చింతించి ఇట్టిసుగుణాఢ్యుండు పోయినవెనుక నేనుజీవిం
పజాలనని దుఃఖించుచుండె.

అప్పుడు సుగ్రీవుండు, రామునూరడించి వానరులకు ఉ
త్సాహబలప్రవర్ధనంబుగా ధైర్యమునుచెప్పిన సుషేణుం
డు సుగ్రీవునింజూచి, క్షీరసముద్ర మధ్యంబుననున్న చం
ద్రద్రోణ పర్వతంబున నానావిధములగు నోషధులున్నవి
అందు సావర్ణ్యకరణి, సంధానకరణి, విశల్యకరణి, సంజీవక
రణియను వానిని దెచ్చుటకు ఆంజనేయుండు సమర్థుండు

గావున నతని నియమిం... ప్రభావంబున రామలక్ష్మణులు ... సు గ్రీవుండు ఆంజనేయుని బిలిచి సంపాతిపనసాదిమహాధపు లంగూడి సంజీవ ... కరణుల గొని తెమ్మని యాజ్ఞాపిం చె నంతలో మేఘమండలమును భేదించునట్లు పెనుగాలి వీచుచుండె నిదియేమని సుగ్రీవాదులు చూచుచుండ గరు డుండువచ్చిన నతనితేజ... ఆతనిప క్షోద్భవంబనియెఱింగిరి, ఆగరుడాగమనంబునం జేసి రామ లక్ష్మణులబంధించిన సర్పంబులు వదలిపోయెను, అంత భుజగాశనుండు తనకరంబులచే రామలక్ష్మణుల స్పృశిం ప, గాయంబులన్నియు మానెను, శరీరంబులెప్పటియ ట్లశోభించె. అంతరాముండు లక్ష్మణునితోడ శరతల్పంబు నుండిలేచి సుపర్ణునవలోకించి, ఇట్లనియె. అనఘా! నీవె వ్వండవు నిన్నుజూడ దశరథుని అజునిజూచినట్లు ప్రీతియ గుచున్నది నీదర్శన స్పర్శనమువలన ధృతిస్మృతి బలవీర్య తేజంబు లుద్భవిల్లినవి నాగబంధములు తొలగిపోయి నవి, అనిన రాముసకు గరుడుండిట్లనియె, ఓ కాకుత్స్థా! నీకు నేను సఖుండను, బైటవ్యాపించెడి ప్రాణంబును, నా పేరు గరుత్మంతుడు మీకుసహాయము చేయవచ్చినవాడ ను. ఈరాక్షసులు స్వభావముచే కూటయుద్ధ విశారదు లు. శూరులును, శుద్ధాంతఃకరణులును ఆగు మీకు ఆర్జ వంబేబలము బహుజాగ్రత్తతో వీరి మర్మంబులెఱింగి వీ రిజయింపుము. ఈనాగపాశంబులవిడిపింప సురాసులకెవ్వ

రికి శక్యముగాదు. నేనువినిస్నిగ్ధత్వము సఫలమును జేసి కొనవచ్చినవాడను. ఈశరబంధమునుండి మీరువదలింబడితిరి, నిత్యము మీరు అప్రమాదముచే నుండవలయును ఇకమీకు జయముగల్గును, అని కౌగిలించుకొని రామునియాజ్ఞనువడసి గరుడుండువాయువేగంబున నంబరంబునకెగసి యథేచ్ఛంజనియె.

అంతవానరులు విశల్యులగు రామలక్ష్మణులజూచి విస్మయంబంది భయంబువిడిచి పరమానంద భరితులై పరాక్రమంబవలంబించి తోకలద్రిప్పుచు సింహనాదంబులజేయుచు భుజాస్ఫాలనంబులు సలుపుచు వృక్షశైలాదులగేలంబూని సంరంభముసేయుచుండ రావణుండువిని దిగులొందితిరిగి ధైర్యమువహించి ధూమ్రాక్షుని యుద్ధమునకుబంపిన, నాతండతిరౌద్రాకారంబుతోవచ్చి వానరులపైబడి ఘోరయుద్ధముగావింప వానరులుచెలరేగి తుములయుద్ధమునందు రాక్షసుల నామరూపములు లేకుండజేసిరి, ధూమ్రాక్షుండాంజనేయునిమార్కొని ఘోరయుద్ధముసేయ గపివరుం డొక్కమహాశిలచే నతనిరథంబు చూర్ణంబుజేసి, గిరిశృంగంబును పెకలించి ధూమ్రాక్షుని శిరంబుపై వైచిన వానిశిరంబు వేయితునుకలయ్యె.

అంతనావృత్తాంతమును హతశేషులవలన వినిరావణుండు చింతాభరంబున, వజ్రదంష్ట్రుని యుద్ధంబునకు బంపగా నాక్రూరరాక్షసుండు వానరులతో మహాఘోరయుద్ధంబు సేసివానరుల గడునొప్పింప అంగదుండు పరాక్ర

మించి ఘోరయుద్ధమొనర్చి తీక్ష్ణధారగల ఖడ్గముచేత వజ్రదంష్ట్రుని శిరంబు తెగవ్రేసె నావృత్తాంతమునువిని రావణుండు మిక్కిలిఖేదమునొంది కొంతదడవునకు ధైర్యంబు జెంది అకంపనుని నియోగించిన వాడు నతిశౌర్యంబున హించి చతురంగబలయుక్తుండై నానాయుధ ధనుర్బాణంబులధరించి వానరులడీకొని మహాప్రళయంబుగావింప వానర రాక్షసులు తలపడి పర్వతంబులు పర్వతంబులు డీకొనుచందంబున పోరుచున్నపుడు రథగజాశ్వపద ఘట్టనమువలన ధూళిమింటికెగసి సూర్యునింగప్పిన గాఢాంధకారంబయ్యె నప్పుడు స్వపక్షపర పక్షంబులెఱుంగ జాలక శిలా పాదప శక్తి తోమరపరశుపట్టిస ప్రాసశూల కరవాలభిండివాల గదా ముసలముద్గర తోమర పరశ్వధ కుంత క్షురికాది సాధనంబులచే దమతమవారినిహింసింపందొడంగిరి అప్పుడు వానరరాక్షస కోలాహలధ్వని మాత్రము వినంబడుచుండెనుగాని రూపంబులుగానరావయ్యె అప్పుడు హనుమంతుండు మహాపరాక్రమం బవలంబించి కాయంబుపెంచి, తనదీర్ఘహస్తములచే మహావృక్షంబుల బెరికికొని అయ్యకంపనుని మస్తకంబుపైవైచిన తలవేయివ్రక్కలై గిలగిలతన్నుకొని నేలంబడియె.

ఇట్లు అకంపనుండు సమసిన వృత్తాంతమునువిని దీనవదనుండై రావణుండు ప్రహస్తుని యుద్ధమునకుబంపిన నారక్కసుండు పెక్కురక్కసులంగూడి వానరులమారెకొని బాణవర్షమునుగురిపింప వారలు వృక్షపాషా

ణంబులచే బెక్కురక్కసుల నుక్కణగింప, మఱికొందరు మహాశూరులగు రాక్షసులు దారుణనారాచంబులను, ప్రహస్తుండు కాలదండసమానములై యతిక్రూరములైన బాణపరంపరలవానరులపై నెరపినకొందఱు వానరులు బాహువులు తెగి శిరములు తెగి నేలంబడిరి. అప్పుడు వానరోత్తములగు ద్వివిద, దుర్ముఖ, జాంబవత్, తారులు, అతికోపనులై మహాబలాఢ్యులగు, నరాంతక, సమున్నత, మహానాద, కుంభహనులనువారిని క్రమముగ యమపురికిబంపిరి. నీలుండను వానరుండు సంరంభించి సురాసుర భయంకరంబగు యుద్ధమునొనర్చి యొక్క మహాశిలచే ప్రహస్తునిశిరమును చూర్ణముజేయ వాడు వజ్రహతంబగు పర్వతము చందంబున నేలంగూలెను.హతశేషులవలన నీవృత్తాంతమునువిని రావణుండు అత్యంత క్రోధావిష్టుండై చతురంగబలసమేతముగ యుద్ధమునకు జనుదేర, సుగ్రీవ, గవాక్షులు రావణుని యాటోపంబుచూచి ఉగ్రులై ఒక పర్వతశృంగంబు త్రొటించి యతనిపై వైచిన రావణుండు నిజబాణంబుచే దానిని ఖండించి మహాకోపంబుచే వారలపై కాలాంతకసన్నిభబాణంబులు ప్రయోగించి వారలమూర్ఛితులంజేసెను అప్పుడు లక్ష్మణుండు రామునడిగి యనుమతిని వడసి రావణునితో యుద్ధముసేయ వెడలిన ఆంజనేయుండు సౌమిత్రిని నివారించి తానుయుద్ధమునకు దలపడి యసురనాయకు నెదుర్కొని ఘోరంబుగ యుద్ధముసేసి తన

యరచేత రావణుని యురంబున నొకవ్రేటువేసిన నతండు ఆ దెబ్బను సహింపలేక రథంబుపై మూర్ఛిల్లి చచ్చినట్లు పడియుండి కొంతదడవుకు మూర్ఛదేరి మహాకోపంబుతో ఇదిగో చచ్చితివనుచు నొకముష్టిప్రహారంబున నాంజనేయుని మూర్ఛిల్లజేసి యంతట నీలునితోఁ దలపడిఘోరయుద్ధము సేసి నీలుని మూర్ఛిల్లజేసిన లక్ష్మణుండు కోపగించి రావణుని, యమోఘబాణంబులచే మూర్ఛిల్లజేసిన నతండు లబ్ధసంజ్ఞుండై కాలాగ్నిసదృశంబగు శక్తిని లక్ష్మణుని యురంబున నేసిన, అతండు మూర్ఛితుండయ్యెనని చూచి హనుమంతుండు వజ్రసన్నిభంబగు తనముష్టిచే రావణుని వక్షంబు బ్రద్దలగునట్లు పొడిచిన వాఁడు చెవులు ముక్కులనుండి రక్తము స్రవింప నేలంబడి మరణోపమానంబైన మూర్ఛంజెందెను.

అంతగొంతదడవుకు లక్ష్మణుండు మూర్ఛందేరి రామసన్నిధిని ధైర్యంబు వహించియుండ, రావణుండు మూర్ఛందేరి కాలాంతకుని భంగి యాయుధపాణియై రామలక్ష్మణులమార్కొనిన రాముండు ఆంజనేయుని భుజంబులపై నెక్కి యమోఘసాయకంబులచే నారావణుని సంధిబంధములవీడగొట్టిన విహ్వలుండై రావణుండు నేలంబడిమూర్ఛిల్లె.

అప్పుడు రాముడు వానింజంపక విడిచె. అంతరావణుండు కొంతదడవుకు మూర్ఛదెలిసి గృహంబునకేగి తన పరాజయంబును బ్రహస్తుని మరణంబును జింతించి

కుంభకర్ణుని నిద్రలేపుటకు రాక్షసుల కాజ్ఞాపించిన, వా రు కుంభకర్ణుని సమీపమునకుబోయి మేఘములవలె గర్జిం చిరి, వానిపై వృక్షపాషాణంబుల రువ్విరి ఖరోష్ట్రగజంబు లచే ద్రొక్కించిరి. తీక్ష్ణశూలములచేబొడిచిరి ఇన్నియుపా యములుచేసినను బ్రహ్మశాపమువలన మేల్కొనకుండిన నప్పుడు తైలమునుగాచి బుంగలతో దెచ్చి కర్ణరంధ్రము లనింపిరి నల్లదుప్పులమందను పైననడిపించి గిరిశృంగ, వృక్షంబులతో గఠినంబుగ దాడనముచేయ వానిని లక్ష్య ముచేయక మేల్కొని యావులించి మొదలు విరుచుకొ నిన న్నెందుకునిదుర లేపితిరి అనియడుగ యూపాక్షుండను రాక్షసుడు రావణుని యనస్థను దెలుపుచు నిన్నుబిలుచుక రమ్మనెనని తెలుప కుంభకర్ణుండు రావణునికడకుంబోయి పెక్కువిధములనీతినిబోధింప, నతండు వినకుండిన, సరి విధిప్రకారము జరుగగలదని యోచించి రావణాజ్ఞా ప్ర కారముచతురంగబలముతో శంఖకాహళదుందుభి నిర్ఘో షపురస్సరంబుగావచ్చి ప్రళయకాల మేఘంబువలె గర్జిం పుచునానావిధ భయంకరాయుధంబులగైకొనినరాక్షసవీ రులు వెంటవచ్చుచుండ వారలంజూచి కుంభకర్ణుండు పా తాళగుహంబోలిన వక్త్రంబు దెఱచి ప్రహసింపుచు రా క్షసులారా! నాసామర్థ్యంబునుజూడుడు ఈవానరులను ఆమానవనాథులను మ్రింగుచున్నాను అనిపలుకుచు సం రంభించి వానరులమ్రింగదలపడిన వారలువానిముందరని లువజాలక పాఱిపోవుచుండ అంగదుండు వారలకు ధై

క్యంబు జెప్పి మరలింపవానరులందఱు తమతమప్రతాపము
ఁ జూపుచు వృక్షశైలంబులచేఁగుంభకర్ణుని నొప్పించిరి,
ఆంజనేయుఁడును శతవిధంబులబోరి మూర్ఛఁజెందె, నీ
లఋషభ శరభగవాక్ష గంధమాదనులు కుంభకర్ణునితో
యుద్ధముచేసి మూర్ఛిల్లిరి, ఇట్లు సుగ్రీవాంగదులును
మూర్ఛిల్లిరి. అప్పుడు కుంభకర్ణుండు మూర్ఛిల్లిన సుగ్రీ
వుని లంకకుగొనిపోవుచుండ నంతలో మూర్ఛదేఱి సు
గ్రీవుండు కుంభకర్ణుని కర్ణనాసికల ఖండించిన, వాడు తి
రిగియుద్ధమునకు దలపడియాకలిచే, నెత్తురువాసనవలన
నోడలెఱుంగక స్వపక్షపరపక్ష వివేకంబులేక వానరరా
క్షసుల నందఱినిబట్టి మ్రింగుచు వానరకంఠంబుల జీల్చి
నెత్తురు ద్రాగుచు మహాసంరంభము సేయుచుండిన వా
నిని వానరులు తేఱిజూడంజాలకుండిన లక్ష్మణుఁడు సం
క్రుద్ధుండై సప్తబాణంబుల నాకర్ణాంతములాగి విడిచిన
వానినీక్ష్యముసేయక నాతండు రాముని మార్కొనిన
రాముండు వానిపై రౌద్రాస్త్రమును, ఇంకను పెక్కు
బాణంబులనుం బ్రయోగించి వానితో ఘోరంబగుయుద్ధ
మును జేసి నానావిధ దివ్యాస్త్రములచే వాని బాహువు
లను శిరంబునుఖండించెను.

ఇట్లు కుంభకర్ణుండు హతుండైన ప్రకారంబును హత
శేషులగు రాక్షసులు రావణునకెఱింగించిన రావణుండు
విలపించుచుండ త్రిశిరుఁడనువాడు అతనిని యూరడించె
ను అప్పుడు రావణుండు తిరిగి పౌరుషంబవలంబించి దే

వాంతక నరాంతక త్రిశిరో౽తికాయ మహోదరమహా పార్శ్వుల యుద్ధమునకుబంపిన హనుమజ్జాంబవదంగద నీలాదులు వారితోఁబోరి వారిని యమపురికిబంపిరి. ఆవి ధమంతయుజూచి అతికాయుడు బ్రహ్మదత్తవరదాన గర్వితుండై ఘోరరూపంబుతో వచ్చుచుండ వానరులందఱు భయభ్రాంతులై కుంభకర్ణుడు తిరిగిబ్రతికి వచ్చుచున్నవాడనియెంచి లక్ష్మణుని శరణముజెందిరి అప్పుడు పరాక్రమ మవలంబించి కాలాగ్నిసదృశుండై అతికాయునితో భయంకరయుద్ధమొనర్చెను ఒండొరులు పరాక్రమంబున తుల్యులై జయముగానకయుండు సమయంబున లక్ష్మణునికడకు వాయుదేవుండు చనుదెంచి రహస్యంబుగా నీతండు ఇతరాస్త్రములచే వధ్యుడుగాడు బ్రహ్మదత్తవరుండు, ఇతనిని బ్రహ్మాస్త్ర ప్రయోగము చేజంపుమనవుడు లక్ష్మణుండు దివ్యశరంబున బ్రహ్మాస్త్ర ప్రయోగంబొనర్చిన, నతికాయుండును పరిఘగదాసికుంతముల లక్ష్మణుపై బ్రయోగించిన లక్ష్మణముక్తబ్రహ్మాస్త్రము వానియాయుధముల మ్రింగుచువచ్చి అతికాయుని శిరంబును ఖండించెను.

ఇట్లు అతికాయుని మరణంబునువిని రావణుండు బహుప్రకారంబుల విలపించుచుండ ఇంద్రజిత్తు తండ్రినూరడించి తానుయుద్ధంబునకువెడలి వానరులతోఁబోరి నానాస్త్రశస్త్రశక్తితో మరనారాచాది సాధనంబులవారలపై బ్రయోగించి మూర్ఛిల్లజేసె, మఱికొందఱు వాన

పులును ఘోరశిలాపాదప ప్రహారణంబులచే నింద్రజిత్తు
ను అతనిసైన్యమును నొప్పించిరి, అప్పుడింద్రజిత్తు కా
లాగ్నివలె నతిక్రోధపరవశుండై వానరులనందరిని శర
పరంపరలచేగప్పి బ్రహ్మాస్త్రంబు రామలక్ష్మణులపై ప్ర
యోగించినవారు అస్త్రంబునకు బద్ధులై పడియుండ ఇం
ద్రజిత్తు మూర్ఛంజెందిన వారలజూచి జయలక్ష్మినిభాం
దితిననుకొనుచు లంకాపురంబుజేరెను. అప్పుడు విభీష
ణుడు మృతప్రాయులై పడియున్న జాంబవదాదులను,
బాణాపీడితులైయున్న రామలక్ష్మణుల విలోకించి వాన
రుల నాశ్వాసించుచుండ జాంబవంతుడు ఆంజనేయుని
దివ్యౌషధముల దెమ్మని నియోగించిన నావాయుపుత్రుం
డు వెడలి ఓషధిపర్వతంబు పెకలించి తెచ్చిన నాయోష
ధగంధాఘ్రాణంబున వానరసహితంబుగా రామలక్ష్మణు
లు విశల్యులైరి. అంతసుగ్రీవుండు రాక్షసులమీది కోపా
వేశంబున లంకనుదహింపుడని వానరులకాజ్ఞాపింప వా
రు లంకాపురంబును దహింపుచుండ రామలక్ష్మణులునిశిత
బాణంబులచే లంకాగోపుర ప్రాకారంబుల చూర్ణంబుచే
యుచుండిరి. అప్పుడు వానరుల కలకలంబులును రాక్ష
సులదారుణఘోషంబునువిని, రావణప్రేరితులై కుంభని
కుంభాదులు యుద్ధమునకువచ్చి వానరులతోబోరుచుండ
అంగదునిచే కంపనుడును, ప్రజంఘుండును, మైందద్వివి
దులచే, యూపాక్షశోణితాక్షులును, సుగ్రీవునిచే కుం
భుండును, హనుమంతునిచే నికుంభుండును, రామునిచే

మకరాక్షుండును, హతుడాయెను. అంత రావణాజ్ఞచే నింద్ర
జిత్తు యుద్ధమునకు వెలువడి యగ్నినారాధించి యయ్య
గ్ని దేవుని చే దివ్యాస్త్ర కవచంబులుగ్రహించి ప్రళయ
కాలాగ్నిచందమున శైలు వెడలి వానరులపై బాణవర్ష
మును గురిపించి ఘోరసంగ్రామంబొనరించి రామలక్ష్మ
ణులను శరపరంపరలచేగప్పి తనమాయచేత నంబరం
బున కెగసి కనులకు గానరాకుండ బాణ్లనుగురిపించుచు
చిత్రవిచిత్ర తరంబుగ యుద్ధముసేయుచుండ రాముండు
అతికోపవశుండై ఇంద్రజిత్తుతో ఇక విళంబముగా యుద్ధ
ముసేయదగదని యుగ్రమూర్తియై కాలాంతకునిమాడ్కి
జంపుటకుద్దేశించిన రాముని మనంబెఱింగి ఇంద్రజిత్తు
మాయాసీతను కల్పించి, దాని తలను దెగవేయబూను
కొని యుండుటనుచూచి దానిని ఆంజనేయుండు నిజమైన
సీతగానెంచి ఇంద్రజిత్తునిచూచి ఓరీ నీవుబ్రహ్మవంశమున
బుట్టియు, పౌరుషహీనుండవై ఇట్టి స్త్రీవధమును జేసితి
వేని నీవొకనరాధముడవా? నిరపరాధియగుసాధ్విని ఇట్లుసే
యుట తగనికార్యము, నిన్ను ఖలుండనియు, వీర్యహీ
నుండనియు లోకులునిందింతురు. సీతనుజంపితి వేని
నాబాహుబలముచే నిప్పుడు నిన్ను యమపురికి బంపెద
ననిన, నామాటలవినక నా మాయాసీతం దెగ వేసిన
జూచి యాంజనేయుండు కోపంబు పెంపున ఇంద్రజిత్తునితో
బోరి నానాప్రహారణంబులచే నొప్పించి రామునియొద్ద కేగి
యా వృత్తాంతమును జెప్పినవిని రాముండు గాఢశోకవివ

శంకితుడై యుండుటనుజూచి లక్ష్మణుండు రామునిగౌగిలి గ్రుచ్చియెత్తి తనతొడలపై నిడుకొని, సీతావధంబువలన బుట్టినశోకంబును, రాముండు రణంబున ప్రచ్ఛన్నునివధించుటధర్మంబుగాదని పలికి బ్రహ్మాస్త్రప్రయోగంబుసేయకుండ నివారించినందునబుట్టిన కోపంబును, పాపాత్ముండగు రావణుండు సుఖియైయుండుటయు, కరగతంబగు రాజ్యమును విడిచి పితృవాక్యపరిపాలనరూప ధర్మాచరణముసేయవచ్చిన రాముడు తత్ఫలభూత సుఖంబుజెందక వ్యసనపరంపరలజెందుటయు మనంబునగలపోసి దుఃఖాతిశయంబునబుట్టిన మనఃకాలుష్యమతిశయింప ధర్మాధర్మంబులసత్యంబని హేతువాదముచేనిరూపించుచు, రామునితోనిట్లనియె.

మహాత్మా! కేవలధర్మానుష్ఠానపరులకైహికసుఖంబుగలుగనేరదు. ఆముష్మికసుఖంబుగలుగుననుటకు శాస్త్రసృష్టంబేకాని ప్రత్యక్షంబులేదు. గావుననది సదసద్రూపంబైయుండునర్థంబు సకలశ్రేయస్సాధనభూతంబు అట్టియర్థము, నీచే నాదరింపబడకుండుటంజేసి ఇట్టి యాపదలు సంభవించె, సర్వపరిత్యాగికి ఆపదలువచ్చుననుటకు జేతజిక్కిన రాజ్యమునువదలి, పితృవచనవ్యవస్థితుండవై యరణ్యంబునకు జనుదెంచి రాక్షసునిచేత, ప్రాణంబులకంటె గరీయసియైనభార్యనుగోల్పడి పరదేశంబున దుఃఖించుచున్న నీవేదృష్టాంతము, ఇంతవగచిననేమి యగును, నేనిప్పుడు భవత్కార్యంబున సంప్రాప్తమైన

ఘూముఖమును, నాశౌర్యకర్మంబున నపనయించెదగా వున నీవిచారము దక్కి నీవు పరమాత్మగా నిన్నెఱింగికొని శౌర్యంబునంగీకరింపుము. సీతానిధనశ్రవణజాత శోకార్ది తుండనైన యేనింకనేమిసేయుటకు సమర్థుడగానంటిరేని నేనుగావించెద నన్నునియోగింపుడు నేనుభవత్ప్రియార్థం బుత్పన్నుండనైన వాడనుగావున జానకీనిధనంబు సహింప జాల, నీవు సకలశాస్త్రార్థతత్వజ్ఞుండవు. స్వామీ! నన్ను, శక్తిగలిగిన శౌర్యంబుజూపవలయుంగాక, ధర్మాధర్మఖం డనంబిట్లుగావించితివని నిరసింపవలదు జానకీనిధనంబుని విరుద్ధుండనై ధర్మాధర్మఖండనరూపార్థం బుపన్యసించి తి,నింక సీతానిధనప్రతీకారార్థంబుగా లంకనంతయుభస్మం బుగావించెదనని బహుప్రకారంబుల లక్ష్మణుండు సీతా పతినిభ్రాతృవాత్సల్యమున నాశ్వాసింపుచుండ నప్పుడు విభీషణుండు చనుదెంచి నారివిధమంతయు నెఱింగి రా మలక్ష్మణులతో నిట్లనియె,

అనఘులారా! ఇదియంతయు అసత్యము సీతావధ ము కానేరదు. ఇంద్రజిత్తుమాయ యని యెఱుంగుడు చింతనువదలి కర్తవ్యమునందు బ్రయత్నింపుడని తెలియ జెప్పి మఱియునిట్లనియె. ఓ రామా! ఇప్పుడు ఇంద్రజిత్తు శత్రుజయము నపేక్షించి నికుంభిలకేగి యచ్చటహోమ ము సేయుచున్నాడు, అదిపూర్తి అయినయెడల వానిని జయించుటకష్టము పూర్తికానియెడల వానిని మనము జయింపవచ్చును కావున వాని హోమమును విఘ్నము

గాలించి వానితో యుద్ధముచేయుటకు లక్ష్మణుని నియో గింపుము మేమందరము సహాయులమై ఇంద్రజిత్తును డీకొ నెదమనిన రాముండు సమ్మతించి యాజ్ఞనొసంగిన వారు మహాటోపంబున వెడలి నికుంభిలజేరి వానరులు హోమ సమీపముననున్న రాక్షసులవధింపసాగిరి ఆంజనేయుని జూ చి ఇంద్రజిత్తు నానాయుధంబుల గేలంబూని కోపంబున సతనిని మార్కొని మహాఘోర సంగ్రామంబొనర్చుచుం డుటను విభీషణుండు లక్ష్మణునకుజూప నదియెఱింగి ఇం ద్రజిత్తు విభీషణుని నిందింపగా, విభీషణుండతనికి అనేక భంగులబుద్ధిచెప్పినను కాలచోదితుండై వాడువినక అధిక ప్రగల్భములాడుచుండిన లక్ష్మణుండు క్రుద్ధుండై రాక్ష సాధమా ! మాటలతోనేమి ప్రయోజనము యుద్ధమునకు రమ్మా ఘోరసాయకమ్ముల నిన్నుంగూల్చెద జూడుమని న నతండు కోపంబుచే మండిపడి యుద్ధమునకువెడలిన న ప్పుడు భూమివడకెను కులపర్వతములు చలించెను. ఇట్లు సంరంభంబుతోవచ్చిన నయ్యిరువురు తలపడి మహా ఘోర సంగ్రామంబొనర్చిరి అప్పుడనేక వానరరాక్షసు లు హతులైరి ఇంద్రజిత్తు లక్ష్మణునిపై అనేకదివ్యాస్త్ర ముల బ్రయోగించె, లక్ష్మణుండనేకాస్త్రంబులు ఇంద్ర జిత్తుపై బ్రయోగింపవాడు మిక్కిలిక్రుద్ధుండై సౌమిత్రి పై దానవాస్త్రంబువేసిన నాయస్త్రమునుండి యసంఖ్యం బులగు శూలచక్ర ఖడ్గకుంత ముద్గరాది ఘోరాయుధం బులు వెలువడి యాకాశంబునిండిన, లక్ష్మణునకపాయ

ము రాకుండ దేవమునులు ఆశీర్వచనంబులు వలుకుచు కాపాడుచుండిరి. అప్పుడు లక్ష్మణుం డాయస్త్రమును మూచి మహేశ్వరాస్త్రమును బ్రయోగింప నదియాదా నవాస్త్రమునుదగ్ధము జేసె. లక్ష్మణుండప్పుడుఅధిక రౌద్రుం డై యనంతబలంబును నప్రతిహతంబునగు నైంద్రాస్త్రమును సమంత్రకముగా శరాసనంబునందు సంధించి.

ధర్మాత్మాసత్యసంధశ్చ రామో దాశరథిర్యదీ ।
పౌరుషేచా ప్రతిద్వంద్వః శరైనంజహి రావణిమ్॥

అని ప్రయోగించిన నది ప్రళయకాలాగ్నివలె జాజ్వల్యమానమగుచు వెడలి ఇంద్రజిత్తు శిరమునుఖండించెను.

వాని పాటునుచూచి వానరులు హర్షకలితులైరి. రాక్షసులు మొగములు వేలవేసుకొని రావణునకు జెప్పిన, నతండు దుఃఖసాగరమగ్నుండై కొంతదడవుకు అపారక్రోధంబువహించి చంద్రహాసంబుగొని సీతంజంపబోయిన సుపార్శ్వుండను రాక్షసుడు రావణునకడ్డంబువచ్చి దానవేశ్వరా! నీవు పులస్త్యబ్రహ్మ వంశంబునబుట్టినవాడవు వేదవిద్యాప్రతిష్ఠితుండవు, నీతివిదుడవు, స్త్రీవధంబు దగనికార్యము, పెద్దలునిందింతురు అని పలువిధములనీతినిబోధించి మఱియు నిట్లనియె. ఓ రాక్షసేశ్వర! ఈకోపమును రామునిపై జూపుము కార్యసిద్ధియగును అకృత్యమువలననేమిఫలమని పలికిన సుపార్శ్వవచనంబులువిని చంద్రహాసంబతనిచేతికిచ్చి యింటికి వెడలి మూలబలంబును యుద్ధమునకుబంపిన వారి మహోన్నతఘోర రూపములజూచి

యుచ్చైరుపొందుచు వానరులు వృక్షపర్వతములమీఁద నె
క్కునేనుఁగుల వారిని ఆరోహణము చేయుచు వారితోఁ గలయఁ
బడి మహాఘోరయుద్ధము చేసి వారిని దంతములతోఁ గఱ
చుచు గోళ్లతోఁ జీల్చుచు పర్వతంబులు వైచుచు వృక్షం
బులతోఁ బ్రహరించుచు నారును నారాక్షసులవలన బహుప్ర
హారణంబుల బడుచుండుటఁగని రఘునందనుండు దానవు
లపై సమ్మోహనాస్త్రంబు బ్రయోగింప నాయస్త్రప్రభా
వంబువలన యుద్ధమున నారాక్షసులకు రాముఁడొక్కఁడు
ననేకవేల రాములుగఁ దోచుచుండిన. నితఁడు గుఱ్ఱముల
జంపె, నితఁడు ఏనుఁగులబరిమార్చె ననుచు నొండొరులనె
య్యెంచి యొరుల ప్రహరించుచు తమలోఁదము బెనంగి హతు
లైరి. అమ్మహాయుద్ధంబున నొక్కరామునిచేత ఒక
జాములోపల నూటడెబ్బదియారుకోట్ల సలువది యొకల
క్షయేఁబది యాఱువేల చతురంగబలంబులు హతంబయ్యె.

అప్పుడు హతశేషులు ఈవృత్తాంతము రావణునకెఱిం
గింపవానికి దుఃఖరోషంబులు వృద్ధియై నిప్పులుఁ గ్రక్కుచుఁ
గోఁకవలె యెగురుచు రోషరక్తాక్షుండై యుద్ధమునకు వెలువ
డి కాలాంతకునివలెనె వానరులపై ననేకబాణంబుల వైచి
న వారు భిన్నాంగులై ప్రాణంబులవిడిచిరి. ఇట్లు వానర వీరు
ల నుక్కణగించి యుద్దండక్రీడగావించుచుండ సుగ్రీవుఁ
డు వారికి నభయంబొసంగి తాను మహావృక్షపాషా
ణంబులచే రావణసైన్యమును నుసుమాడి ద్వంద్వయుద్ధ
మున మహోదరుని వధించె. అంగదుండు మత్తుని వధించె.

అంత రామ రావణులు యుద్ధమునకుఁ గలపడి యన్యోన్యజయకాంక్షతోడ దారుణంబుగఁ బోరుచు నిరంతరంబుగా నొండొరులమీఁద బాణవర్షంబులు గురియుచు లోకభయంకరులై యస్త్రప్రయోగములచే పరస్పరము జిగీషులైరి అప్పుడు రామ బాణనిర్భిన్నహృదయుండగు రావణుండధిక క్రోధంబున నసురాస్త్రమును రామునిపై వైచిన నద్దానినుండి సింహశార్దూల కాక కంక కోక గజోష్ట్రశ్వ నాగాదిముఖంబులుగల భయావహంబులగు ననేకసాయకంబులుద్భవించి నభంబునిండిన వీక్షించి రాముడు పావకాస్త్రము ప్రయోగించె నద్దానినుండి అగ్నిదీప్తముఖంబులును, వజ్రసూర్యసంకాశంబులును, చంద్రార్ధచంద్రవదనంబులును ధూమకేతువదనంబులును మహోల్కాముఖసన్నిభంబులునగు ననంతసాయకంబులు గగనంబునిండ నశానప్రయుక్తబాణంబులనెల్ల దహించెను, ఇట్లు ఘోరసంగ్రామంబు జరుగుచుండ విభీషణుండు రావణుని రథాశ్వముల హతముజేసె, రావణుడు ప్రయోగించిన శక్తిచే లక్ష్మణుండు మూర్ఛిల్లె, నప్పుడు రాముండు అధిక క్రోధోద్రేకముతో బాణంబులచే రావణుని నిష్ఠురంబుగ జిరియఁగొట్టెను.

అంత రావణుండు రాముని యెదుటనిలువజాలక పాఱిపోయి లంకకుచేరి, ఓమందోదరీ! నే నేమిచెప్పుదు నేడు యుద్ధమున రాముడు ప్రళయకాల యముని పగిది యుగ్రమూర్తియై సాయకవర్షమును గురిపింపసహింపజాలక ప్రాణ

ములుదక్కి పాఱివచ్చితిని, హరుని నేత్రాగ్నినైన సహిం
పవచ్చునుగాని, రామబాణవేగమును సహింపలేనైతినని
పలువిధముల రోదనముసేసి యెటజూచినను రామబాణ
ములున్నట్లు తోచుచున్నవి, కనుమూసినను దెరిచినను,
రాముడు గనబడుచున్నాడు వేయిచెప్పనేల జగమంతయు
రామమయముగా దోచుచున్నది, దేవీ! నాకిప్పుడొండు
శరణంబు లేదు పూర్వము నాసంగీతమునకు మెచ్చినశంక
రుడు చెప్పినవొప్పున దుర్గనింగూర్చి హోమంబుజేసి
అందు సంభవించినదివ్య రథాస్త్రకవచంబుల గ్రహించి
యుద్ధమునకుబోయిన నాకుజయమబ్బును అనిపలికి నియ
మవంతుడై శివాలయంబునకుంజని హోమముసేయ సమ
కట్టిన నప్పుడచ్చటికి మండోదరిచనుదెంచి భర్తనుచూ
చి దానవనాథ! ఇట్లుసేయుట నీపౌరుషమునకు భంగము
గాదా, నీవు వేల్పులజయించినవాడవు ఇరువదిచేతులున్న
వి నీచేనోడిపోయిన దేవతలు, ఇప్పుడు మనల బ్రార్థించుచు
న్నాడనినగరా? నీ వీహోమమును మాని పౌరుషంబవ
లంబించి బలంబులగూర్చి శత్రువుల జయింపుము. ఇంత
భయముగల నీవు ఏల సీతనుగొనివచ్చి యానతీకాంతుని
తో వృథావైరముగొంటివి, ఆయన దేవాదుల కజేయుడు,
ఐననువచ్చునది రాకమానదు ధైర్యశాలివై యుద్ధమునకే
గుమనిన భార్యావచనంబులు విని రావణుండు హోమ
ముచాలించిభార్యాసహితంబుగ గృహములోనికిబోయెను.

• అంతరాముడు పదునాలవ నాటిరాత్రి యుద్ధంబున

సమరేయు రావణశక్తిచే నిహతుండై గాఢమూర్ఛంజెం దియున్న లక్ష్మణునింజూచి దుఃఖించుచు సుషేణునకు లక్ష్మణునిస్థితిజూపెన నతండు, సౌమిత్రి మృతుండుగాడు శుభలక్షణంబులు గనబడుచున్నవని రామునిసందియంబు వాపి సంజీవనీపర్వతమును దెమ్మని ఆంజనేయునకు జెప్పిన నతండు అట్లొనర్చెదనని గగనంబునకెగసి ఉత్తరాభిముఖుండై పోవుచుండ ఈవృత్తాంతమును చారులవలన రావణుండువిని తానేమియుజేయజాలక ఒంటరిగాబయలుదేఱి

(అర్ధరాత్రియందు మారీచపుత్రుండగు కాలనేమి ఇంటికిబోయి అతని కీవృత్తాంతము దెలిపి నీవు హనుమంతుని మార్గమధ్యమున వధింపుము, అందుకు శక్తుండవుగావేని ద్రోణగిరివద్ద మాయచే వనమునిర్మించుకొని కపటమునివై యుండి అతనికి విఘ్నముసేయుము అనిన కాలనేమి ఇట్లనియె దైత్యనాథా! నీయాజ్ఞనుశిరసావహించెద, ఐనను నాయొక్క విన్నపమొకటికలదు. కోపగింపక యాలకింపుము నీమాటలవిని మామయ్యరామునిచే హతుండయ్యె, మహాశూరులందరు రామునిచే హతులైరి, నీయొక్కని యపరాధమునంజేసి లంకయంతయు పాడగుచున్నది. అయ్యార్తశరణ్యునికి సీతను సమర్పించి శరణంబువేడి సజీవుండవై సుఖింపుమనిపలికిన రావణుండు కోపగించి చంద్రహాసముతో నతనిజంపనుద్దేశించిన కాలనేమివాని యాటోపముజూచి నీకింతకోపమేల నీవుచెప్పినట్లు చేసెదననిపలికి యనుజ్ఞవడసి, ద్రోణగిరికేగి అచ్చటరమణీయంబగు నాశ్రమము నిర్మించుకొని అందుమునివేషియైయుండి హనుమంతుని రాకనుప్రతీక్షించుచుండె, అప్పుడచ్చటికి హనుమంతుడే చేర కపటమునియగు కాలనేమి ఆంజనేయునివంచించుటకు ప్రయత్నింప నమ్మారుతి వానిసత్కారమునంగీకరింపక, ద

ప్పితీరుటకు తటాకముజూపుమనిన వాడొక్కయగాధ సరోవరముజూ పింపనందుదిగిన మారుతిని ఒకముసలి మింగిన నాంజనేయుండు నిజ శక్తిచే దానిగర్భముఛేదించుకొని పైకివచ్చి దానిసీడ్చివైచిటవేసిన అది యారూపమువిడిచి ధాన్యమాలియను పేరుగల దివ్యాప్సరసయై విల చితనశాపకారణంబాంజనేయునకు దెలిపికాలనేమివృత్తాంతము నెఱిం గించిన ఆంజనేయుండు క్రుద్ధుండై వానింబట్టి వధించిద్రోణగిరికి గొనివ చ్చుచుండ నందిగ్రామంబున భరతునిజూచి యాకారవైలక్షణ్యము నుబట్టి రాముడని యనుమానించి తిరిగియొక మునివర్యుడేయుం డునని కొనుచు వచ్చుచుండ భరతుండతనిజూచి పెద్దభూతంబనుకొని బాణంబువేయంబూనిన నాకాశవాణిమీకు మిత్రుడు అతనింజంప వల దనిపలికిన భరతుండూరకుండె నప్పుడాంజనేయుండు సముద్రంబుపై బోవుచుండ రావణాజ్ఞచే మాల్యవంతుండు పదికోట్లరాక్షసులతోగూడి యడ్డంబువచ్చినవారినందరిని తనపాదములచేతను వాలముచేతను చూ ర్ణముచేసిమాల్యవంతు నొకచేత పొడిచికాళ్ళచే రసాతలంబంట బడవే సినవాడు ప్రాణంబులవసెలెను హతశేషులు లంకకుజనిరి.)

అంత వాయుపుత్రుండు పర్వతసహితుండై తేజోమూ ర్తియై సమీపించుచుండ శ్రీరాముండుచూచి సూర్యుం డనియెంచి లక్ష్మణ ప్రాణశంకితుండైయుండు సమయంబు న నాంజనేయుండు పర్వతంబుగొని ప్రవేశించె నందలి యోషధీప్రభావంబున లక్ష్మణుండు సజీవుండయ్యె నంద గును విశల్యులైరి అంత నాంజనేయుండు ద్రోణపర్వతము ను తిరిగి యథాస్థానంబునజేర్పబోవుచుండ రావణప్రేరిత రాక్షస సంఘము లడ్డమువచ్చిన వారినెల్ల తనవాలము తో వధించి మనోవేగంబునబోయి యప్పర్వతము నెప్ప

టిచోటనునిచి క్రమ్మరచనుదెంచి రఘునందనుని చరణారవిందముల సేవించిన రామలక్ష్మణులు సంతసించి సేనంగూడ్చుకొని కోలాహలము సేయుచుండ రావణుండు విని దిగులొంది శుక్రాచార్యులనాశ్రయించి యతిభయంకరమగు పాతాళహోమంబు గావించుచుండిన మహోత్పాతంబులుపుట్టె నదియెఱింగి విభీషణుండు శ్రీరామునికి తెలుప రాఘవుండు అంగదాదులబిలిచి రావణుండు సేయుహోమము తుదముట్టినయెడ వానిని జయించుటకష్టముగావున మీరందరు అచ్చటికిబోయి హోమధ్వంసము చేయుడని యాజ్ఞాపింపవారు లంకనంతయు ధ్వంసముచేయుచు కనబడిన రాక్షసుల జంపుచు రావణుని జాపుడని యడుగుచు బాలవృద్ధులను పీడించుచు రావణుసుండుచోటునెఱుంగక వ్యాకులపడుచుండ విభీషణ పత్నియగు సరమవలన మార్గము తెలిసికొని యంగదుండు పాతాళగుహనుజొచ్చి యతివేగముగ రావణునిగనుంగొని హోమసామగ్రిని, అతనిచేతనుండు స్రుక్స్రువంబులను హోమపాత్రములను బలాత్కారముగలాగియగ్నియందు బడవైచి రావణునిపిడికిట గుండెలవియబొడిచిపొడిచి తీక్ష్ణనఖంబుల చిల్లులుబడునట్లు గిల్లిగిల్లి తలవెండ్రుకలను మీసాలనుపెఱికి పెఱికి, పీరుండవై రోషంబుండిన యుద్ధమునకురమ్ము అని లాగిలాగి యొంతపిలిచినను వానుకనులు దెరువక నిష్ఠనువదలకుండె నంత నంగదుండొక్కింత యోచించి పటువేగముగ రావణుని యంతఃపురమునకుబోయి మందోద

రింగాంచి దానితలవెంట్రుకల బట్టుకొని ముక్తాభూషణం
బులుఝుఘల్లనపుడమింబడ వక్షోనిక్షిప్తమణిభూషణంబులు
చిందరవందరై రాల నమ్మందోదరి నతిసాహసంబుతో నీ
డ్చుకొనివచ్చి రావణు నెదుట నిలువంబెట్టియిట్లనియె.

ఉ|| రావణ నీవు మున్నల యరణ్యమునం బతియొద్దలేనిచో,
వావిరి దప్పరుండవయి వంచన దెచ్చితి వామహీసుతన్,
నీవును నీదుబాంధవులు నేఁడుగనుంగొనుచుండ బల్మిరీ,
దేవినిబట్టి యీడ్చికొని తెచ్చితి చూడుము దీని మ్రుంగఁగన్||

అప్పుడు మందోదరి రోదనమొనరింపుచు భర్తనుజూ
చి ప్రాణనాథా మహాపరాక్రమశాలియు నాకేంద్రనంద
నుండునగు ఇంద్రజిత్తు బ్రదికియుండినయెడ నివ్విధమును
జూచి యూరకుండునా?

ఉ|| వాసవతుల్యుడైన రఘువర్యుని దేవిని వ్రచ్చిలించితా
ల్లాపము మీరఁదెచ్చితివి లంకకు శంకయొకింతలేక నీ,
కోపమురిత్తపోవునె యధోగతికిన్నిను బుచ్చుగాకఁకన్,
ఏపరవోవునే యనుభవించిన గాక నిజాపరాధముల్||

ఉ|| కాలముదాయివచ్చిన నకార్యము కార్యముబుద్ధిఁ దోఁచునం
బాలురు దోఁచినంత పనిసల్పుదు రాజ్యహితోపదేశముల్,
మేలని చూడరంతమున మిక్కిలిహాని యొనర్చుసీత నీ,
పాలిటికాళరాత్రి యని భావమునందలపోయవాలితే||

చం|| రణమునకేఁగుపోయి రఘురాముని మ్రొగ్గలఁగొంతసేపు మా
ర్గణముల కల్మిఁజూపి తుదిరాజలలాముని విస్ఫురద్ధను
ర్గుణపరిముక్తకాండములఁగూలుము భూస్థలినిట్లుగానిచో
గుణమడిగర్గి రామునకుఁగొబ్బున జానకినిమ్ము దీశ్వరా||

అని యిట్లు మండోదరి శోకరోషభయలజ్జాపరాభవ కలితయై పలికినవిని రావణుండు హోమంబుచాలించి దిగ్గునలేచి క్రుద్ధుండై కరవాలంబుచే నంగదుని వక్షంబుపగుల నేసి వానిని మూర్ఛితుంజేసి మండోదరిని విడిపించిన నది యేడ్చుచు గృహంబునకు జనియె.

అంత హనుమదాదివానరులు రావణునితో భయంకరమగు యుద్ధముసేసివానినిచీకాకుపఱచి రాముకొద్దకుజని, హోమంబు చెఱిచివచ్చితి మనిచెప్పిరి. అంతరావణుండు హోమముచెడినందుకు చింతించుచు ఇంటికేగి ఏడ్చుచున్న భార్యనుజూచి.

చ॥ నళినదళాయతాక్షి కదనంబున రామునిజంపఁటోండె నన్,
యాశ్రలఘునరిత్రుడవ్య విశిఖాళిజచ్చుటయొండెవంతెఱఁగా,
పలుకులికేలయేన చట బంచకినొందిన నీవు దుఃఖము,
వ్వలనిడిచానకిం గునిమి వహ్నిముఖంబున డావువెుకృటక

అని పలికినవిని మండోదరి మిక్కిలి దుఃఖించి కన్నీటిబొట్లుచనుమిట్టలపై జిందుచుండఁమగనినిజూచిఇట్లనియె,

ఉ॥ మానవవాహురాఘవుని మానవమాత్రునిగావలంచితో
మానితశావకేము శరవర్ధితులై సురలెల్లవేడఁగా,
మానవరూపధారియయి మర్త్యజగంబున దుష్టదైత్యులన్,
బూనివధింప నాజికటుపుట్టిన మాధవుగానెఱుంగుమా.

ప్రాణనాయకా! యుద్ధమున నీకుజయమబ్బుట సంశయము మరణమునిశ్చయము, నాకునీతోడ ననుగమనంబుసేయరాదు నాకుముదిమియు మరణములేకుండ మాంత్రి

లు రథియైన రావణునకు పదాతియగు రామునకు రణ
ము సమంబుగాదని పలికినవిని దేవేంద్రుండు సారథియగు
మాతలిని, దివ్యరథమును, బంపిన దానినధిష్ఠించి రాఘ
వుండు రావణునితో మహాభయంకరంబగు సంగ్రామెుం
బొనర్చి రావణునితోనిట్లనియె.

నీచా! నీవు నాయెదుట జానకిని గ్రహించియుండిన
ఇది వరకు ఖరాదులకు గలిగినగతినీకు గలిగియుండును,
ఇప్పుడు నాదృష్టిపథంబునకు వచ్చితివి నిన్నీరణభూమియం
దు నా బాణపరంపరలచే ఖండ ఖండములుచేసి కాకగృ
ధ్రింబులీక్షునట్లుచేసి యమపురికి బంపెదజూడుము అని
యత్యంతరోషముతో ఘనశరంబుల వానిపై వెదచల్లిన
వాడుతట్టుకొనలేక రథంబుపై మూర్ఛిల్లె నప్పుడు సారథి
రథంబును ప్రక్కకుకొనిపోయెనంత గొంతసేపునకు మూర్ఛదె
లిసి సారథినిజూచి ఓరిదురాత్మా! ఏలరథంబుతొలగదో
లితివి, శత్రువులుజూచి నన్ను పరిహసింపరాయని కోప
ముతోనిందించిన, సూతుండిట్లనియె. రాక్షసేంద్రా! నేను
భీతుండగాను భేదముపొందిన వాడనుగాను, సమయమెఱి
గి నీకు, రథాశ్వములకు, విశ్రాంతినొందించుటకొరకు నే
ను ఇట్లు భర్తృస్నేహపరుండనై చేసితి. ఇకనీవు చెప్పిన
ట్లు సూతకృత్యంబుగావించి ఋణంబుబాపికొనియెద, నని
న రావణుండు సంతోషించి సూతా! ఇప్పుడు రావణుండు
పగతునివధింపకగాని మరలడు. వేగంబుగరథంబును రాము

ని సముఖమునకు దోలుమని హస్తాభరణంబొసంగిన నతం
డు రథంబును రామునిముందరనిలిపె.

అంతకు మున్ను దేవతలతోడ వచ్చిన నగస్త్యుండు యుద్ధపరిశ్రాంతుడై రావణవధోపాయమును యోచించుచు న్న రాముని వీక్షించి రయంబునదగ్గరకువచ్చి శత్రుజయ కరంబగు నాదిత్యహృదయం బుపదేశింప, రాఘవుండు నిష్ఠాయుక్తుండై జపించిన నాదిత్యుండు ప్రసన్నుండై వత్సా! శీఘ్రంబున రావణునివధింపుమని పలికిన రాఘ వుండు నష్టశోకుండై కోదండముధరించి రావణకర్ణరంధ్ర ములు పగులునట్లు ధనుష్టంకారముచేసి రావణునితోడ దలపడి మహాఘోరంబగు ద్వంద్వయుద్ధము సేయుచుండ మహోత్పాతంబులుగలిగె నప్పుడు దేవగంధర్వసిద్ధసా ధ్యచారణులు వ్యాకులచిత్తులై రామునకు స్వస్తియ గుగాకయని మంగళంబులు పలుకుచుండిరి, అప్పుడు రా మరావణయుద్ధము నిరుపమానంబై యొప్పె, నంతరా ముడు ఒక మహానాయకంబుచే రావణుని శిరంబునుఖం డింపనది భూమిపయింబడిన వెంటనే వేఱొకశిరము పొ డమె. ఇట్లు పలుమారు శిరంబు లుత్పన్నంబులగుటకు నాశ్చర్యమునొందుచుండ మాతలిచే ప్రేరితుండై బ్రహ్మా స్త్రంబుప్రయోగించిన వజ్రంబుపర్వతము భేదించుకరణి రావణునివక్షస్థలంబు భేదించిన వాడుగతాసుండయ్యె, న ప్పుడు రక్కసులందరు రోదనముచేసిరి, ఇంద్రాదిదేవత లు పుష్పవర్షముసుగురిపించిరి, వాయువుచల్లగవీచె, ఆక

సంబున దేవతలు సాధుసాధు అని ప్రశంసించిరి. ఇవ్విధంబున శ్రీరాముడు శత్రువుల జయించి సుగ్రీవాంగదహనుమదాదులతోడ సరసాలాపంబులాడుచుండె.

ఇట్లుహతుండైన రావణునిజూచి విభీషణుండు శోకింప శ్రీరాఘవుండు విభీషణు నూరడించె, మండోదరి మొదలగు రావణభార్యలు యుద్ధభూమికివచ్చి ఉచ్చైస్స్వరంబుతో రోదనంబుచేసిరి. అప్పుడు రామాజ్ఞచే రావణునకు విభీషణుడు విధ్యుక్తరీతిగ దహనాది సంస్కారమును జేసె, పిదపరామాజ్ఞచే లక్ష్మణుండు విభీషణుని లంకారాజ్యాభిషిక్తుంజేసిన నాతండు సంతోషయుక్తుండై మంత్రులతోగూడి రామలక్ష్మణులను రత్నాభరణాద్యమూల్యవస్తువులచే బూజించె, నప్పుడు శ్రీరాఘవుండు నిజవిజయము నాంజనేయునిచేత సీతకుజెప్పిపంపిన నతండు సీతకు రావణవధ వృత్తాంతమును దెలిపి తల్లీ! కావలియున్న రాక్షసస్త్రీలను జంపుటకాజ్ఞనొసంగుమనిన జానకి మారుతి కిట్లనియె.

ఆంజనేయా! వారు రావణాజ్ఞచే ప్రవర్తించినవారు. రావణుండు మడిసె నికవీరేమిసేయుదురు అపకారులయందుగూడ ప్రత్యపకారముచేయకుండుటయే నుంచిదివధార్హులగునట్టివారియందును సజ్జనులచే గారుణ్యంబుగ రక్ష్యంబైయుండు లోకంబున నపరాధంబును గావింపనివారెవ్వరుండైనను లేరు, దయావంతునికి అందరు రక్ష్యులు. కావున శీఘ్రంబుజంపవలదనిన నావచనంబులవిని మారుతి

అమ్మా! ఇప్పుడు నీవిభున కేమి సందేశమును జెప్పెదవనిన, మారుతీ! ఇక నాప్రాణవల్లభుని సేవింపగోరుచున్నానని చెప్పగా, నాసందేశమును రాఘవునకు మారుతి విన్నవింపవిని శ్రీరాముండు(రావణభవనోషిత సీతాపరిగ్రహంబునం గు లోకాపవాదంబగుననియు. నిర్దోషయగు సీతాపరిత్యాగమందు మహాదోషంబగుననియుం దలంచియేమిసేయువాడనని కించిద్వ్యాకులితస్వాంతుండై పరిశోధన సేయక ప్రతిగ్రహించితినేని, లోకులు సీతయందును నాయందును దోషమారోపింతురని తలంచి జగన్మర్యాదను గాపాడుటకై యవతరించిన సాక్షాద్విష్ణుండగుటచే ఘన “శ్రేష్ఠుండగువాడు నెట్టిదానినాచరించు నదియేయితరజనులా చరింతురను” న్యాయంబనుసరించి జానకి నిష్పాపయనియెఱింగియు లోకాపవాదనివృత్తికొఱకు నగ్నియందు పరుషితుండైనవాడుపోలె బహుపరుషోక్తులాడును, నట్టివిదగ్ని ప్రవేశము సేయించి బ్రహ్మేంద్రాది ప్రార్థితుండనై యామెమీద నిత్యశుద్ధయైన దేవి నంగీకరించుటలంఘన భూమిం జూచుచు) ఓ విభీషణా! జానకిని శిరస్స్నానముచేయించి అంగరాగాదులచేనలంకరించి దివ్యాభరణోపేతనుగావించి వేగముగదోడ్కొనిరమ్ము, అనిన నతండు రామాజ్ఞాప్రకారము సీతను విమానంబుపై నెక్కించుకొనివచ్చి శ్రీరామునిసమీపమున నిలిపె. అప్పుడు సీత లజ్జచే దలవంచుకొని ఆర్యపుత్రా! యనిమధురంబుగా నుచ్చరించి వస్త్రముచే ముఖము నొత్తుకొని రోదనంబుగావించె. పిదప పతిదేవతయగు నాసీత ఆశ్చర్యము, సంతోషము, ప్రీతి అతిశయించుచుండ భర్తనువీక్షించి, మనోవ్యాకులము వదలినిర్మలపూర్ణచంద్రముఖియై యొప్పుచుండె, నప్పుడుతనప్రేమా

లనున్న సీతనుజూచి రాఘవుండు హృదయాంతర్గత క్రోఘుండై యిట్లనియె.

ఓజానకీ యుద్ధమున శత్రువునుజంపి నిన్నుచెఱవిడిపించితి, నాపౌరుషముచెల్లినది. నాశ్రమంబును సఫలంబయ్యె, నాప్రతిజ్ఞతీరె నేనుధన్యుండనైతిని, దైవకృతంబగు నీయాపదను పౌరుషశక్తిచేపగతునిజంపి యపనయించి త్రిభువనములందు యశంబుగాంచితిని సముద్రమునుదాటుట మొదలగు వాంజనేయుని పరిశ్రమము సఫలంబయ్యె దుష్టభ్రాతను వదలినన్నాశ్రయించిన విభీషణునికోర్కెయు నీడేరె. ప్రాణములుదాచక యుద్ధముజేసిన వానరులు కార్యసిద్ధిపొందిరి. లక్ష్మణునిపరాక్రమము సఫలంబయ్యె రావణుండుహతుండైన కారణమున మేమందరము సఫలకృత్యులమైతిమి, అనినవిని సీతనిజభర్తృవచనంబులు తనయందు నైరాశ్యమును సూచించుచుండుటకు భీతిల్లుచు కన్నీళ్లనువిడుచుచుండె, ఇట్టులదుఃఖించుచున్న సీతంజూచి రాముండుమఱింతయలిగినిర్దయుండై కనుబొమలు కుటిలముగాజేసి అడ్డముగాజూచుచు ఓసాధ్వీ! వానరసేన గూర్చుకొని సముద్రలంఘనముజేసి శ్రమజెంది శత్రుజయముచేసిన దంతయునీకొఱకుగాదు పౌరుషమును చారిత్రమును, కులాచారధర్మమును కాపాడుటకును అపవాదము పోవుటకును, ఈరీతినొనర్చి నాడను ఇదినిజము కులము తేజముగల పురుషుడు బరగృహోషితయగు బత్నిని మరలగ్రహించునా! రావణాంకపరిభ్రష్టవై, దుష్టదృష్టి

చే బరిదృష్టమైన నిన్నెటులబరిగ్రహింతును మాకునీతో
టికార్యంబులేదు, నీమీఁదబ్రీతిలేదు యెచటికేనియు నరు
గుము. పుత్రతుల్యులగు లక్ష్మణసుగ్రీవ విభీషణాదుల
లో నెవ్వనినైన నాత్మభరణార్థమనుసరింపుము. అనిపలి
కినరాముని పరుషోక్తులవిని జానకిగడగడవడకుచు కన్నీ
ళ్లువిడుచుచు మిక్కిలి వ్యథజెందిలజ్జచే దలవంచుకొని గ
ద్గదస్వరముతో నిజభర్తకిట్లనియె

ప్రాణనాథా! ప్రాకృతుఁడు ప్రాకృతనువలె కర్ణకఠోర
ముగానేలపలికితివి? ఇట్టిమాట నీవనుటకు నేను వినుటకు
ననర్హమైయున్నది, ఓమహాత్మా! నీవుతలంచిన విధము
నాయందులేదు, నాపాతివ్రత్యముచేతనే శపథముజేసెద
ను, దుష్టస్త్రీప్రవర్తనను గ్రహించి స్త్రీజాతియంతయు
ను అటులనుండునని శంకించుచున్నావు, నేనుదుఃఖముచే
వివశురాలనగుటచే రావణగాత్రస్పర్శముగలిగినది. కోరి
కచేతగాదు. ఇదిదైవముతప్పు, నాస్వాధీనమైన హృదయ
ము నీయందునిలచియున్నది అప్పుడు పరాధీనమైన శరీర
విషయమై అనాథయగునేను యేమిచేయగలను? ఓమాన
దా! చిరకాలంబునుండి యొక్కచోట సహవాసంబును,
సహసల్లాపంబును, సహసంచారంబును, సహక్రీడయు
ను, సహసంసర్గమును గావించినవాడవయ్యును మత్స్వ
భావంబెఱుంగని కారణమున నేను నీచేమిక్కిలి వధింప
బడితిని, నీవు మత్కుశలంబరసిరమ్మని హనుమంతునేలపం
పితివి? నీవలననైరాశ్యంబెఱింగినయెడ, నేనప్పుడెప్రాణం

గులవిడుతును, నాకింతకాలము భవద్వియోగజనితదుఃఖా నుభవము లేకయుండును, నీకును జీవితసందేహకరంబయిన యీశ్రమంబులేకయుండును. నీసుహృజ్జనపరిక్లేశమును గలుగకుండును. స్వల్ప మనుష్యునిచేతవలె స్త్రీత్వము మాత్రము పురస్కరింబడియె, మచ్ఛీలంబు గ్రహింపబడకుండె, జనకుని నెపముచే భూమినుండి ఉద్భవించుటను, నాసుచరిత్రమును నీ వెఱింగియు బురస్కరింపకుంటివి, బాల్యంబున నిచే జేయుంబడిన పాణిగ్రహణం బప్రమాణీకృతంబయ్యె, నీయందుగల నాభక్తియు సహచరీత్వమంతయు వెనుకకుంద్రోచితివి, అనిపలికితత్సమీపంబున దైన్యముజెంది చింతింపుచున్న లక్ష్మణుని జూచి, గద్గదస్వరముతో అనఘాత్మా! నేను మిథ్యాపవాదమునొందిజీవింపజాలను దీనికౌషధంబగు చితిని జేర్పుము, సద్గుణములచే బ్రీతినొందని భర్తచేతవిడునంబడిన నాకుభూమియేగతికావున నగ్నింబ్రవేశించెదనని పలికినవిని లక్ష్మణుండురాఘవుని మోమును జూచియభిప్రాయంబెఱింగి చితిని సమకూర్చె నప్పుడు జానకితలవంచుకొని మెల్లగా రామునకు ప్రదక్షిణంబుసేసి దేవబ్రాహ్మణులకు నమస్కరించి అగ్నిసమీపంబున బద్ధాంజలిపుటయై యందరు వినుచుండవినయముతో నిట్లనియె.

సీ॥ అనిశంబు మచ్చిత్త మాత్మనాథుని యందు సడలిక వర్తించుటనిక్క
మేని । నకలరిగ నృతవ్రశంకితనైన యేమర్వినతిశుద్ధ చారిత్రనైతి
నేని, కరము వాఙ్మానస కర్మంబుచేమనోధిపుమాట మీరివర్తిం

యనేవి, సూర్యచంద్రవాయ్వగ్నులు రాత్రిసంధ్యాదిని భూనభంబులు సర్వభూతములును, సకలదిక్పాలకులు నాకు సచ్చరిత్రము, సర్వమునకు తెలిసినది కాబట్టుట సత్యమేని, సకలహేతువులో కైక సాక్షియైన. చిత్రభానుండు నన్ను రక్షించుగాక॥

అనిపలుకుచు వానరరాక్షసులందరు చూచుచుండ అగ్నికి ప్రదక్షిణముచేసి నిర్భయంబుముట్టిమండుచున్న అగ్నికుండమున ప్రవేశించె

అప్పుడు సర్వజనులును హాహాకారముచేసి ఆశ్చర్యపడుచుండిరి. అప్పుడు సాధ్వియగ్నియందు బడుటనుజూచి దేవమునులందరు దైన్యముపొందిశోకించిరి. అప్పుడు సర్వజనులహాహాకారంబువిని రాఘవుండును చింతాక్రాంతుండై బాష్పవ్యాకులలోచనుండయ్యె. అంతమహేంద్రయమవరుణకుబేరులును, బ్రహ్మమహేశ్వరులును విమానస్థులై వచ్చి రాఘవునికినమస్కరించి ప్రాంజలులై యిట్లనిరి.

ఇనకులతిలకా! హవ్యవాహనుని యందుబడుచున్న సీతనుజూచి జ్ఞానులలో శ్రేష్ఠుండవును సర్వలోకకర్తవునగు నీవు ఎందుకు ఉపేక్షించితివి! దేవగణంబులలో శ్రేష్ఠుండవైననిన్ను నీవేల ఎఱుంగకున్నావు. నీవుసకలజగదుత్పత్తిస్థితిలయములకు ఆదికర్తవు స్వయంప్రభుండవు, పరముండవు, లోకంబుల కాద్యంతములయందుండెడి వాడవు ప్రాకృతుండగు మనుష్యునిమాదిరి సీతనేలయుపేక్షించుచున్నావు. అనిపలికిన పితృశివేంద్రాది దేవతలవచనంబులవిని ధర్మాత్ములలో శ్రేష్ఠుండగురాముండువారలకిట్లనియె.

ఓ త్రిదశశ్రేష్ఠులారా! దశరథపుత్రుడనై రామనాముడనగునన్ను మనుష్యుండని తెలంచుచున్నాను నేనెవ్వండను నాస్వరూపమెట్టిది! నన్ను విష్ణుండంటిరి? నేను జనించుటకు కార్యమెయ్యది తెలుపుడు? వినంగోరితిననిన, జతుర్ముఖుండిట్లనియె.

సత్యపరాక్రముడవగు నోరామా!వినుము నీవుశంఖచక్రాదిపంచాయుధ ధరుండగు శ్రీమన్నారాయణుండవు, విభుండవు, శత్రుహంతవు. పరబ్రహ్మవు, అక్షగుండవు, పురుషోత్తముండవు, పరమాత్మవు, సర్వకారణుండవు, అవ్యయుండవు, అజేయుండవు, శాశ్వతుండవు,సత్యకాముడవు, సత్యసంకల్పుడవు, సర్వేశ్వరుండవు, సర్వనియంతవు, సర్వాధారుండవు,యజ్ఞంబునీవ, వషట్కారంబునీవ, ఓంకారంబు నీవ,సత్యంబునీవ, సకలలోకములధరించినవాడవు, నీయొక్కహృదయము నేను, నీజిహ్వసరస్వతి, నీకోపముఅగ్ని, నీప్రసాదము చంద్రుడు, నీస్థైర్యముభూమి, నీశరీరము నిఖిలజగంబులు, నీరెప్పలుదివారాత్రములు, నీతనూరుహంబులు దేవతలు. నీప్రాణములువాయువులు, నీసంస్కారములు వేదంబులు, నీకర్ణంబులుదిక్కులు, నీనేత్రంబులు సూర్యచంద్రులు,పూర్వము వామనావతారంబెత్తి మహాసురుండగు బలినిబంధించి మూడడుగులచే లోకత్రయమునాక్రమించి మహేంద్రుని రాజ్యమందు స్థాపించిన మహానుభావుండవీవ, సీత సాక్షాల్లక్ష్మి, నీవువిష్ణుండవు కృష్ణుండవు ప్రజాపతివి, రావణవధార్థము మానుష

దేహముధరించి భూమియందు అవతరించితివి. రావణుం డు నిహతుండయ్యె. ఇంకను మిగిలినకార్యములదీర్చి వై కుంఠమునకు వేంచేయుదువు, నీబలవీర్యపరాక్రమంబు లమోఘంబులు, నీదర్శనంబమోఘంబు నీయందుభక్తిగల వారు సఫలమనోరథులగుదురు, ఇటులనిన్నునుతించిన వారు ఎప్పుడును అవమానమునుపొందరు. అనిపితా మహునిచే జెప్పబడినవాక్యములనువిని అగ్నిహోత్రుం డు సర్వజనులుచూచుచుండ, మూర్తిమంతుడై చితినుం డివెలువడి, బాలసూర్యునివలె ప్రకాశించుచున్నదియు, స్వర్ణాభరణ రక్తాంబరముల ధరించినదియు, వాడని పుష్ప మాలికలధరించినదియు బాలయునగు సీతను అంకపీఠం బున నిడికొని రామునకభిముఖుండై యిట్లనియె.

రఘుకులతిలకా! ఈ జనకపుత్రియందు గల్మషంబే దియులేదు. నీ వచనమించుకయైన నతిక్రమింపదు. సు వృత్త, సాధ్వి, అనన్యశరణ్య, నిత్యముత్వద్గతాంతరా త్మయైయుండునది, నీపరోక్షంబున నదుష్టాత్మునిచే బలా త్కారముగ దొంగిలింపబడి అశోకవనమధ్యమున దాచ బడి రాక్షసస్త్రీరక్షితయై రావణుం డెన్నిమాయలుపన్ని నను దర్జనభర్జనలచే నెంతరాయిడిపెట్టినను వినక వానిని తృణప్రాయునిగ నెంచి త్వదధీనచిత్తయై విశుద్ధభావయై నిష్పాపయైయున్న నీమెను బరిగ్రహించి నిష్కళంకుడవై యేలుకొనుము. నాకు బ్రతిజెప్పక నామాటను తప్పక వినవలయును, అనిన నగ్నిదేవుని వచనంబులకు హర్షించి

కొంతతడవు చింతించి బాష్పవ్యాకులలోచనుండై ధర్మాత్ముండగు రాముడు అతని కిట్లనియె.

త్రిదశశ్రేష్ఠా! సీత ముల్లోకములయందు పావనురాలగును, రావణగృహంబున దీర్ఘకాలము నివసించినసీతను, దశరథపుత్రుండగు రాముడు కామాతురతచే బాలిశుండై పరిశోధింపక పరిగ్రహించెనని సాధువులు చెప్పుదురు. జానకి అనన్యహృదయయు, భక్తయు, మచ్చిత్తానువర్తినియునని నేనెఱుంగుదును, లోకప్రజయము విశ్వసించుటకొఱకు, అగ్నియందు బడుచున్నదు పేక్షించియుంటిని. సాగరము వేల నతిక్రమింపనట్లు, స్వతేజోభిరక్షిత యగు సీతను రావణుండు అతిక్రమింపను ఆ దుష్టుండు, మండుచున్న అగ్నిశిఖనువలె వశము చేయఁదగని ఈ సాధ్విని ప్రధర్షింపజాలఁడు. ఈసతి రావణుని యైశ్వర్యము కానేరదు. దినకరుని బాసియుండని ప్రభంగ ఈ సాధ్వి నన్ను బాసియుండనేరదు. ఆత్మవంతుండు కీర్తినివలె, ఎల్లప్పుడు నేను విమలచారిత్రయగు సతిని విడువజాలను. అవశ్యము మీవచనము నంగీకరించి పరిగ్రహించుట నాకు కర్తవ్యంబని జానకినిం బరిగ్రహించె.

అప్పుడందరు అమందానందముతో హర్షాశ్రువుల విడలుచు రాముని సద్గుణంబుల నత్యంతాశ్చర్యము నొందుచు ప్రశంసించుచుండిరి. అప్పుడు శ్రీరఘునందనుండు సీతాసంయుక్తుండై నిష్కళంక పూర్ణచంద్రుని మాడ్కి ప్రకాశించుచుండె.

ఇట్లు శుభకరరీతిగ బలుకుచున్న రామవచనంబుల విని మహేశ్వరుండు రామునింజూచి, ఓ పుండరీకాక్షా! సర్వలోకభాగ్యముచే నద్భుతకార్య మొనర్చితివి, రావణ భయంబనియెడి యంధకారము వ్యాపించియుండెను, అద్దురాత్ముని సంహరించి ఆచీకటిని బోకడచి జగంబులకమితహర్ష మొసగితివి. ఇక నయోధ్యకేగి, భరత శత్రుఘ్నుల బ్రీతితోడమన్నించి తల్లులకానంద మొసగి సేవించి రాజ్యంబుగైకొని ప్రజలబ్రోచి అనురూపులగు బుత్రులంబడసి అశ్వమేధయాగంబు జేసి త్రిలోకవిశ్రాంత కీర్తినిబడసి ద్విజులకు ధనంబొసగి స్వస్థానంబునకు వేంచేయుము. ఇదిగో ఈ విమానస్థుడగు రాజు నీతండ్రియగు దశరథుడు మానుషలోకంబున నీకు గురుండై సత్పుత్రుండవగు నీచే తరింపజేయబడి స్వర్గవాసము చేయుచున్నాడు. లక్ష్మణసహితుండవై నమస్కరింపుము. అనిశంకరవచనంబులాలకించి తమ్మునితోగూడి తండ్రియగు దశరథుని సేవించిన, నతండు విమానస్థుండై పుత్రులను జూచి యతిసంతోషముతో రామలక్ష్మణుల గౌగిలించుకొని తనయంకమునునిడుకొని రామా! నిన్నెడబాసినవెనుక నాకు, స్వర్గము దేవర్షిసమ్మానము, రుచింపదయ్యె, నిన్ను వనవాసము జేయించుటకై కైక పలికిన పరుషవచనములు నాహృదయమందే నిలిచియున్నవి. ఇప్పుడు వనవాసముతీరి శత్రువుల జయించి కుశలివై సలక్ష్మణుండవై యున్న నిన్ను గౌగిలించుటచే. దుఃఖవిము

క్తుండ నైతిని సుపుత్రుడ వగు నీచే నేను తారితుండ నైతిని, రావణవధార్థము దేవతలచే మొదట పట్టాభిషేకము విఘ్నము సేయబడిన సంగతిని ఇప్పు డెఱింగితి. వనమునుండి మరలి కృతకృత్యుండ వై గృహంబు జేరిన నిన్ను జూచి కౌసల్యాదులు ధన్యులగుదురు. పట్టాభిషిక్తుండ వైన నిన్ను సేవించి పౌరులానందింపగలరు. అనురక్తుండును, బలాఢ్యుండును, శుచియు, ధర్మచారియు నగు భరతునితో జేరియున్న నిన్నుజూడ నాకు వాంఛగలుగుచున్నది. సీతా లక్ష్మణ సహితుండ వై పదునాలుగేండ్లు వనవాసంబుగడపి రావణవధంబుసేసి విధిశివేంద్రాదులకు హర్షముగలుగజేసి కృతకృత్యుండ వై శాశ్వతయశంబు సంపాదించితివి, ఇక భ్రాతృసహితంబుగా రాజ్యస్థుండ వై దీర్ఘాయుష్యమునుపొంది సుఖివై తేజరిల్లుము, అనినవిని రాముండు తండ్రినిజూచి యంజలిచేసి, ధర్మజ్ఞా! నీవుమున్ను సపుత్రవైన నిన్ను పరిత్యజించెదనని కైకేయితో నాడితివి, ఇప్పుడాశాపం బమ్మహాదేవినంటకుండ ననుగ్రహింపుమనిన నతండగుగాక యనిరామునితో బలికి, లక్ష్మణుని గౌగిలించుకొని పుత్రా! నీవనవరతంబును రామకైంకర్యము చేయుచుండుము. నీవు యశంబు వడయుదువు, సర్వదేవతలకు నియామకుండై పరమాత్మయనంబడు రాముని శుశ్రూషవలన నీకు స్వర్గయశోమహిమంబులు గలుగునని పలికి జానకిని జూచి దశరథుం డిట్లనియె. ఓ జనకపుత్రీ నీభర్తవచనంబులకు నీ

వెలుఁగుకుము నీవు స్వతఃపరిశుద్ధవనుట నెల్లవారు ఎఱుంగుటకు నిట్లుచేసెను. పరదైవము, నీకు శుభుండునగు నమ్మహానుభావుని శుశ్రూష నేమరక సేయుచుండుము. అని యిట్లు పుత్రులను, కోడలిని గౌరవించి దివ్యవిమానం బెక్కి దశరథుం డింద్రలోకంబునకుం జనియె

అంత దేవేంద్రుండు రఘునందనునిఁ జూచి మహాత్మా! నీదర్శనము నాకు మోఘంబయ్యె నిక్కిలి సంతోషయుక్తులమైతిమి నీమనోభీష్టమును దెలుపుము. అనిన మహేంద్రా! నాయందు ప్రీతిగలిగెనేని దారపుత్రాదుల వదలి నాకై సహాయార్థమువచ్చి ఈయుద్ధమున మృతులైన వారందఱు సజీవులగునట్లును, వానరులుండుచోట వృక్షములు అకాలఫలవంతములై నదులు జలపూర్ణంబులై యుండునట్లనుగ్రహింప వలయుననిన ఇంద్రుండు రాఘవోక్తప్రకారము అనుగ్రహించిన. వానరాదు లందరు తత్క్షణమున యెప్పటివలె లేచినిలిచిరి. ఫలపుష్పభరితంబులై వృక్షములు శోభిల్లె, నదులు జలపూర్ణంబులై యొప్పె. నిట్లు ఇంద్రాదిదేవతలు రామునకుఁ బ్రీతిసేసి రామాజ్ఞగైకొని స్వర్గంబునకు బోయిరి.

అంత విభీషణుండు రాఘవునిఁ, స్నానాద్యలంకృతుండవై నాచే పూజితుండవగుమని వేడిన శ్రీరాముండు, అత్యంతముహర్షించి సుఖోచితుండగు సుగ్రీవుండు నాకు హితముజేయ ప్రవర్తించి శత్రువులకోర్చి యుద్ధమునగాసిసియున్నవాడు, ఈ వానరులును యుద్ధపరిశ్రాంతులైన

వారలు మదర్థముగా వారినందఱ బహూకరింపుమని మఱియు నిట్లనియె. సుకుమారుండును, మహాబాహుండును, కుమారుండును, సత్యప్రతిజ్ఞుండును, ధర్మచారియు, నాకు పరమభక్తుండునునగు భరతునివదలి, నేను ఎట్లు అభ్యంజనస్నాన వస్త్రాలంకారంబుల నంగీకరింతును, అతనిని వేగముగజూడవలయును, ఈక్షణంబున నయోధ్యకుం బోవలయును. దూరపథంబు నెవ్విధంబున జేరగలను? అనినవిని యంజలిఘటించి విభీషణుండు, స్వామీ! ఇదిగో జూడుడు పుష్పకవిమానము దీనిమీద నెక్కినయెడ ఒక్కపగటిలో నయోధ్యనుజేరవచ్చును. విచారపడవలదు. భవదర్థము భద్రపరచియున్నవద్దానిం దెప్పించెద దానినెక్కియరుగుడు, నేను నీకు అనుగ్రాహ్యుండనైతినేని నాగుణంబులకు నీవు సంతసించితివేని నాయందు సౌహార్దంబుండెనేని, సీతా లక్ష్మణ సహితుండవై సుహృద్గణంబులతోడ నిచ్చటయుండి సర్వప్రకారములచే నాచే బూజితుండవై వెడలుము. నేను నీయందలి ప్రీతిచేతను గౌరవముచేతను వేడుకొని నిన్ను ప్రసన్నునిజేసికొనుచున్నాను. నీకు నేను ప్రేష్యుండను, ఆజ్ఞాపించువాడను కాను, అనివిభీషణుండు వినయంబుతో పలికిన వానరరాక్షసులువినుచుండ దాశరథి యిట్లనియె.

ఓ విభీషణా! నీ సాచివ్యముచేతను, సౌహార్దము చేతను నీభక్తిచేతను నేను సర్వప్రకారంబుల బూజింపబడితిని. ఇంక నితరమైన పూజలతో నేమున్నది. ఇప్పు

డు విళంబము జేయజాలను, భరతుని జూడవలెనని మన స్సు త్వరపడుచున్నది. నన్ను మరలించుటకు భరతుండు చిత్రకూటమునకువచ్చి శిరముసోక పాదంబులబట్టి యాచించెను. అప్పుడు అతనివచనమును నేను సఫలము సేయ లేదు. తల్లులగు కౌసల్యా సుమిత్రాకైకేయీలను గురు మిత్రజనంబులను పౌరులనుజూడ వేడ్కగలిగె వేగంబు గవిమానమును దెప్పింపుమని రాఘవుండు బలికిన విభీష ణుండు పుష్పకంబుదెప్పించి ధ్వజపతాకకింకిణీ ఘంటాజా లాలంకృతంబుచేసి యెదుటంబెట్టి, దేవా! ఇంకను నేనేమి చేయదగినదో యాజ్ఞాపింపుము అనినదాశరథి మనంబున విమర్శించి లక్ష్మణుండు వినుచుండ స్నేహ పురస్కృతం బగునొక వాక్యమునుపలికెను.

ఓ భక్తవర్యా! ఈవానరులు యుద్ధంబున ననివర్తులై పోరిశత్రువులజయించిరి వీరిపరాక్రమమున దైత్యరాజ్య ము నీకు సంప్రాప్తంబయ్యెగావున కృతకృత్యులగు వీరిని యథార్హంబుగ బూజింపుము దీననీకుగీర్తిగలుగును నాకు హర్షంబుగలుగుననిన విభీషణుండు సంతుష్టుండై వానరు లనందరిని అమూల్యస్వర్ణరత్నాభరణ నూతనాంబరదు కూలాది దానంబుల బరితృప్తులంజేసిన రఘువీరుండత్యం తముదంబునొంది సీతాలక్ష్మణసమేతుండై పుష్పకంబె క్కి, సుగ్రీవాదివానరులను, దైత్యేంద్రుడగు విభీషణుని, కృతజ్ఞతాసూచకంబులగు మృదుమధురవాక్యములచే గౌ రవించి ఇకమీరు స్వస్థానంబునకుజేరి సుఖింపుడని యా

జ్ఞనొసంగిన, నప్పుడు విభీషణ సుగ్రీవాదులందరు నిటల తటఘటితాంజలులై సీతావల్లభునకిట్లనిరి

ఉ॥ కేల్మొడలిర్పనేము రఘువీరయయోధ్యకువత్తుమిందఱన్ ।
దోట్కొనిపొమ్ము భ్రాతృసహితున్నను బట్టాభిషేకునిన్
జూడ్కులవింగుగా నచటజూచి పురంబును గాంచి యవ్వలన్ ।
వీడ్కొనిమాగృహంబులకు వేగమె వచ్చెదమట్లు సేయవే॥

అనినవారిమాటలకుసంతోషించి రఘునాథుండిట్లనియె.

చ॥ ఘనమతులార మీరిపుడు కౌతుకమొప్పగ మాయయోధ్యకున్
జనుకొనివచ్చుటెంతయు బ్రమోదము గాదెనువ్యాగ్యతంబుగా
జనియెదమశ్వరంబుగని చయ్యనవత్తురుగానిరందుమీ।
రనుపమలీలనందరు రయంబున బుష్పకమెక్కుడీ త్వరన్॥

అనిపలికిన వారందరును సపరివారంబుగ బుష్పకంబెక్కిన రాఘవుండు సీతనంకపీఠంబుననుంచికొని లక్ష్మణ సహితుండై కుబేరునిమాడ్కి పుష్పకాగ్రభాగంబున నధివసించె, నిట్లందరు యథాసుఖంబుగా నాసీనులైన పిదప అద్దివ్యవిమానంబు రామునిచేననుజ్ఞవడసి మహావేగంబున నాకసంబునకెగసి యతిత్వరితగమనంబున జనుచుండె.

అప్పుడు రాఘవుండు సీతాదేవికిలంకాపురంబును, యుద్ధభూమినిజూపుచు నచ్చటనడిచిన యుద్ధవిశేషంబులను, మఱియుదారిలోని విశేషంబులను దెలుపుచు కిష్కింధ సమీపమునకుజేరి ఓసీతా! ఇదిగోచూడుము కిష్కింధాపురి, ఇచ్చట వాలిహతుండయ్యెనని చెప్పిన సీత, భర్తనుజూచి యిట్లనియె. స్వామీ! సుగ్రీవపత్నులైన తార

మొదలగువానరసతులుగొలుచుచుండ భవత్సమేతనై యయోధ్యకునేగ దలంపుగలిగినది యట్లానతిచ్చి యను గ్రహింపుడనిన వినియటుగావించెదనని, యచ్చట బుష్పకంబునిలిపి రఘురాముండు సుగ్రీవునితోనిట్లనియె.

ఓసగార్యపుత్రా! జానకి, యయోధ్యకు వానరనారీసహితంబుగబోవలయునని కోరుచున్నది, వానరులందరు పత్నీయుక్తులై వేగముగవచ్చునట్లు ఆజ్ఞాపించు నీవును పత్నీయుక్తుండవై శీఘ్రంబుగరమ్ము అనిన రామాజ్ఞను శిరసావహించి వారందరు తమతమపత్నులం దోడ్కొనివచ్చి పుష్పకంబెక్కిన నంతనద్దివ్యవిమానంబు గగనంబునకెగసి రాముని యభిమతప్రకారంబరుగుచుండ మార్గమందలి పంపాతీరచిత్రకాననములను, జటాయునివసించు వటవృక్షంబును, ఖరాదివాసస్థానమును, చిత్రకూటంబును, సరయూనదిని, ప్రదర్శింపుచుపోవుచుండె, నంతలోనయోధ్య గానంబడియె నప్పుడు సుగ్రీవాదులు ఆపుష్పకంబునుండి స్వర్గతుల్యంబగు నాయయోధ్యనునిక్కినిక్కిచూచుచుండ నంతలో భరద్వాజాశ్రమ సమీపంబున శ్రీరాఘవుండు పుష్పకంబుదిగి, అప్పుడు పదునాలవ వత్సరంబు పూర్ణంబగుచుండ చైత్రశుక్లపంచమీ దివంబున భరద్వాజుని గని భరతాదుల కుశలంబడిగిన నతండు రాముని సేవించి రామా! భరతుండు పాదుకాన్యస్తరాజ్యుండై పంకదిగ్ధవృషము చందముననుండి తాపసవేషుండగు భవదాగమనంబునిరీక్షించుచు క్షేమంబుగనున్నవాడు. గృహమున

నుండువారందగును క్షేమవంతులై యున్నవారలు. దాశరథీ! నీచరిత్రమునంతయు దపోలబ్ధపరిజ్ఞానంబున దెలిసికొంటిని, దేవమునిహితంబుకొఱకు దుష్టసంహారంబొనర్చి లోకత్రయంబును రక్షించితివి. నీకభీష్టంబైన వరంబొసంగెదవేమము, మద్దత్తంబైనయతిథిసత్కారంబువడసి రేపకడ సాకేతంబున కరుగుమనిన దాశరథిసంహృష్టుండై, మునినాథ! పురమార్గంబున వృక్షంబులు అకాలఫలపుష్ప మధుభరితంబులగున ట్లనుగ్రహింపుడనిన నయ్యనఘుండట్లగుగాక యనిపలికిన, నావృక్షంబులు తత్క్షణమున పత్రపుష్పఫలమకరంద సమృద్ధములయ్యె, వానరులందరు భరద్వాజునిగొనియాడుచు ఆవృక్షములయందలి ఫలమకరందము ననుభవించుచు అమందానందమునొందిరి, అంతనాసీతానాయకుండు దూరంబున నయోధ్యనుచూచి ప్రియకాముండై కర్తవ్యంబునాలోచించి మారుతికిట్లనియె.

ఓ యాంజనేయా! నీవు త్వరితంబుగ నయోధ్యకేగి రాజమందిరంబున నందరికుశలము నెఱుంగుము, ముందుగ శృంగిబేరపురంబునకేగి, మిత్రుండగు గుహునకు నాక్షేమమును జెప్పి, అతనివలన నయోధ్యకు మార్గంబు నెఱింగి భరతునింజూచి నాచరిత్రమునంతయు నతనికిం జెప్పియతని ఇంగితాకార చేష్టలగ్రహింపుము, సర్వకామసమృద్ధంబై హస్త్యశ్వరథయుక్తంబై పితృపైతామహంబగు రాజ్యమెవరికిరుచింపదు! అతండు రాజ్యార్థియైనయెడల సకలభూమినతండె పాలించుగాక, అతనిమనస్సు నెఱింగి వేగముగర

మ్ము అనినమారుతి, మనుష్యరూపముధరించి శృంగిబేర పురంబునకుబోయి గుహునికి రామకుశలం బెఱింగించి, అయోధ్యకు రెండుక్రోసులదూరమున నందిగ్రామమున, చీరకృష్ణాజినాంబర ధరుండును, జటిలుండును, మలదిగ్ధాంగుండును, భాతృవియోగదుఃఖ పీడితుండును, ఫలమూలాశియై రామపాదుకలకు రాజకార్యముల దెలుపుచు ధర్మస్వరూపుండై యున్న భరతునిజూచి, ప్రాంజలియై పలికెను, అనఘా! చీరజటాధరుండై దండకారణ్యమునందున్న నెవ్వానినిగూర్చి నీవు పరితపించుచున్నావో అట్టికాకుత్స్థుండు నీకు కుశలమునుబలికెను, నీకుప్రియమును చెప్పుచున్నాను శోకమును విడువుము. రావణునిజంపి సీతనులభించినసమృద్ధార్థుండై మహాబలులగువానరులతోడసీతాలక్ష్మణసమేతుండై అయోధ్యకువచ్చుచున్నాడు. అనిన మారుతి మాటలవిని భరతుండు హర్షాతిశయముచే మోహంబుజెంది మూర్ఛితుండై కొంతదడవునకులేచి సంభ్రమముతో మారుతినిగాగిలించుకొని హర్షాశ్రువులచే దడుపుచునిట్లనియె.

అయ్యా! నీవు దేవతవో మనుష్యుడవో కనికరముచేనిచ్చటికివచ్చినవాడవు, నాకుప్రియంబును బలికిననీకు ఒకకోటిగోవులను నూరుగ్రామములను, కుండలాదివరాభరణాలంకృతలును, శుభాచారలును, స్వర్ణవర్ణలును సునాసోరులును, చంద్రాననలును, అగుపదియార్గురు కన్యలనుదానముచేయుచున్నాను, అనిపలికి రామాగమనశ్రవణసంజాత సంతోషమువలనతిరిగి మారుతికిట్లనియె.

ఓపుణ్యాత్మా! నాప్రభువు అరణ్యమునకేగి పెక్కువర్షంబులుగడచె. నాథునిక్షేమవార్తనేను నీవలనవింటిని, బ్రతికియుండిన శుభములు బడయవచ్చునను లోకవార్తసత్యమయ్యెంగాక మందానందముగలిగె. నరవానరులకెట్లుసఖ్యముగలిగె? నెచ్చట ఏమికారణమువలన గలిగెనని, యడిగిననాంజనేయుండు నడిచినవృత్తాంతమును సాకల్యముగజెప్పి యమ్మహాత్ముని రేపు పుష్యమీనక్షత్రమున భరద్వాజాశ్రమంబున, విభీషణసుగ్రీవాంగద మైందద్వివిద జాంబవన్నీలాది వానరపరివృతుండై సీతాలక్ష్మణయుక్తుండై యున్న రాఘవునిసందర్శింపగలవనిన, మారుతి సత్యవచనంబులవిని భరతుండిట్లనియె.

ఓపావనీ! రఘుకులతిలకుండు వేంచేసినకారణమున నేటికి నాపుణ్యంబుఫలించె, నామనోరథంబులీడేరె, నాకునర్వశుభములు సమకూడె, నాదేహాత్మనిర్మలతనొందె, నని బహువిధంబులుగా నానందించి శత్రుఘ్ననకిట్లనియె.

తమ్ముడా! మననాథుండు వేంచేయుచున్నాడు పురంబును విచిత్రతెరంబుగనలంకరింప మంచిపనివారలనియోగింపుము. మనము అందరము రఘుకులాగ్రణికి నెదురేగవలయును, గావున స్తుతిపురాణజ్ఞులను, సకలవైతాళికులను, బ్రాహ్మణులను, సర్వవాద్యకుశలులను, వేశ్యలను, శ్రేణీముఖ్యులను, రాజదారలసైన్యంబులను, రాజన్యులను తక్కినజనంబులను, చంద్రకాంతాననుండగు రాఘవుని సేవించుటకు శీఘ్రంబుసం జనుదెంచువారుగా

నియమింపుము. అనిపలికిన శత్రుఘ్నుండు భరతాజ్ఞా ప్రకారము సర్వంబునుగావింప, భరతుండు వారలంగలసికొని రామపాదుకలు శిరంబుననిడికొని శ్వేతచ్ఛత్రచామరంబులతోడ భేరీశంఖ కాహళదుందుభి ముఖ్యమంగళవాద్యంబులు చెలంగుచుండ పరమానందయుక్తుండై మాల్యమోదకహస్తులైన విప్రులు, నానాయుధ ధరులగువీరభటులు, సర్వాలంకారయుక్తులగు చతుర్వర్ణములవారును శ్రేణీముఖ్యులును సర్వాలంకారయుక్తంబగు చతురంగబలంబును వెంటనరుగుదేర శత్రుఘ్నసచివ సమేతుండై రాముని యెదుర్కొనిపోవుచు, వారింగానక భరతుండు, అంజనేయా! రఘునాథుండువచ్చిన జాడగానకున్నాను, కపులు వచ్చినచందము దెలియదు. వానరులకు స్వభావమైన చపలచిత్తము చేనిట్లు బలుకలేదుకదాయని యడిగిన, మారుతి భరతునకంజలిచేసి యిట్లనియె. అనఘా! నేనుకపిత్వమూని ఇట్లుపలుకలేదు. ఇదిగోచూడుము, రామాగమనకారణంబున వృక్షంబులు అకాలమునఫలపుష్పమధు భరితంబులై యున్నవి, వానరబలంబిప్పుడు గోమతినితరింపుచున్నది. అంబరంబున వానరకోలాహలధ్వని చెలగుచున్నదివినుము? కపులువాలు కీనదిదాటివచ్చుచున్నారు. ధూళిజాలంబాకసంబున కెగురుచున్నది చూడుము? పూర్వముతపంబునబ్రహ్మను మెప్పించి యెద్దానిని కుబేరుండు వడసెనో, కుబేరునిజయించి యెద్దానిని రావణుండువడసెనో, రమణీయరత్నకాంతులచే జెలంగుచు విచిత్రతరంబై

వాయువునో వేగంబులకంటె నత్యంత జవంబుగలయట్టి పుష్పకవిమానంబున సీతా లక్ష్మణ సహితుండై రాముండు వేంచేయుచున్నాడు, వీక్షింపుమని చెప్పుచుండనంతలో మణిసువర్ణ ప్రకాశంబు వెలుంగుచుండ న వ్విమానశ్రేష్ఠంబు సమీపంబునకువచ్చిన, జూచిభరతునితోడవచ్చిన వారందరు రథంబులుడిగ్గి సంభ్రమమునసేవించిరి. భరతుండు ఆనందమగ్నుండై కన్నులకఱవుదీర సీతా లక్ష్మణ విభీషణసుగ్రీవాది పరివృతుండగు రఘునందనునిసేవించెను.

అంత రామాజ్ఞచే విమానంబుమహీతలంబునకు దిగిన భరతుండుసమీపించి సాష్టాంగముగప్రణమిల్లిన, చిరకాలంబునకు గనబడినభరతునిలేవనెత్తి రాముడు తనయంకంబుననిడికొని, ఆనందముతో నాలింగనము జేసికొనియె నంతభరతుండులక్ష్మణునకు సీతకును స్వనామంబుచ్చరించుచు ప్రణామంబుచేసెను, పిదపసుగ్రీవాదులంగౌగిలించికొని కుశలప్రశ్నంబుజేసి, సూర్యపుత్రా! మానలుగురు సోదరులకు నీవు అయిదవసోదరుడవు అనిపలికి, విభీషణుని సాంత్వపూర్వకముగ గుశలప్రశ్నంబుజేసిన, శత్రుఘ్నుండును ఉచితప్రకారంబున నాగరసందర్శనంబు గావించె, అప్పుడు శ్రీరాముండు విమానంబుదిగి కౌసల్యాచరణంబులకుమ్రొక్కి మనస్సును ప్రసన్నతనొందించె. సుమిత్రాకైకేయుల చరణంబులకు మ్రొక్కెను. అప్పుడు పౌరులందరు రామా! నీకు స్వాగతంబనిపలికిరి. అంత భరతుండు వినయాన్వితుండై పాదుకలను రాముని పాదంబులకు

దొడిగి ప్రాంజలియై మహానుభావా! నిన్ను సేవించుటచే నాజన్మంబు కృతార్థంబయ్యె, నీరాజ్యంబును నీయొక్క తేజఃప్రభావముచే మర్యాదలు దప్పకుండ నేలితి, ఇక దీని నత్యాదరంబున జేకొనుము. భాండాగారంబు దశగుణితంబయ్యె కటాక్షింపుమనిన, అచ్చటనున్న వానరులు, విభీషణుండును, భరతుని వాక్యములవిని ఆనందబాష్పముల వదలిరి, అప్పుడు శ్రీరాముండు భరతునంకవుపై నిడికొని సైన్యయుక్తుండై ఆ విమానముతోడనే భరతాశ్రమము నకుజేరి విమానమునుండి భూమికిదిగి ఆ విమానమును కుబేరునొద్దకు బొమ్మని యాజ్ఞనొసంగిన నది ధనదాలయంబునకునేగె

అంత రాఘవుండు వసిష్ఠునకు నమస్కరించి ఒక యాసనంబున నాసీనుండయ్యె. నప్పుడు భరతుండు శిరంబున నంజలిగీవించి, రఘునాథా! నాతల్లిని గౌరవించి యీరాజ్యమును న్యాసపూర్వకముగ నాకిచ్చితివి. నీవిచ్చిన ఈ రాజ్యమును తిరిగి నీకు యిచ్చుచున్నాను. మహోక్షంబు మోయందగిన భారము దూడమోయని యటుల సకల జగద్రక్షణక్షముడవైన నీవు దాల్పదగిన భారమును నేను దాల్పజాలను. హంసగతిని, కాకంబును, అశ్వగతిని ఖరంబును అనుసరింపనటుల నీమార్గమును నేననుసరింపజాలను. అప్రమేయా! పరమప్రీతితో మంత్రివర్గము బొగడ పట్టాభిషిక్తుండవై దివ్యతేజంబుచే వెలుంగుచు నందర సంతోషింపజేయుము, ఇక తూర్యసంఘాత నిర్ఘోషముల

చేతను, కాంచీనూపుర నిస్వనంబులచేతను, మధురగాన ధ్వనులచేతను మేలుకొనుము. జ్యోతిశ్చక్ర మెందాక దిరుగుచుండునో, భూమి యెంతవరకుండునో అంతవరకు సమస్తమునకు నీవు స్వామిత్వమును వహింపుము. అనిబద్ధాంజలియై వేడుచున్న భరతునిమాటలవిని రఘువీరుండటులంగానిమ్మని యంగీకరించి శుభాసనంబున గూర్చుండెను.

అంత శత్రుఘ్నుని పనుపున సుహస్తులగు శ్మశ్రువర్ధకులతినిపుణులు రాముని బరివేష్టించిరి, భరత లక్ష్మణ సుగ్రీవ విభీషణులు, సుస్నాతులును అలంకృతులునై సపిదప రాముండు శిరోద్ధృత జటామండలుండై సుస్నాతుండై చిత్రమాల్యానులేపనుండై మహార్హవసనుండై తేజోలక్ష్మితో ప్రకాశించుచుండె. అంత రాజపురుషులు శ్రీరాముని, లక్ష్మణుని, నవరత్న సువర్ణాభరణంబులచే నలంకరించిరి. దశరథ స్త్రీలు సీతను సర్వాభరణ భూషితం జేసిరి. కౌసల్య వానర స్త్రీల నలంకరించె. అంత శత్రుఘ్నుని యాజ్ఞచే సుమంత్రుడు రథమునలంకరించి ఉత్తమాశ్వంబులగట్టి గొని తెచ్చి రాముని ముందటనిడిన నద్దాని నారోహించి రాముండు అయోధ్యాపురికి బోవునమయమున విభీషణ సుగ్రీవాది వానరులు దివ్యాంబరాభరణమాల్యాలంకృతులై నగరంబు జూడ నరిగిరి. సర్వాలంకారసంయుక్తలగు వానర కాంతలు సీతా సమేతంబుగా నగరంబు జూడనరిగిరి. అయోధ్యయందలి దశరథుని మంత్రులు వసిష్ఠుని మున్నిడుకొని రాముని పట్టాభిషేకవిషయమై ఆలో

చనసేయుచు మంగళ ద్రవ్యముల జేర్పుండని వారి వారికి నియమించుచు రాముని బరివేష్టించి సాకేతంబునకు బోవుసమయంబున, భరతుండు పగ్గములను, శత్రుఘ్నుండు ఛత్రమును గ్రహించిరి, లక్ష్మణుండు సురటిచే విసరెను, చంద్రసంకాశంబగు రెండవ చామరంబును విభీషణుండు వీచె. ఆకాశంబున దేవగణంబులు, ఋషిగణంబులుసేయు స్తోత్రధ్వనులు శ్రీరామునకు వినంబడుచుండె శత్రుంజయ మను నేనుగునెక్కి సుగ్రీవుండు వెడలె. తొమ్మిగి వేల యేనుగలెక్కి వానరులు మనుష్యరూపులై వెడలిరి, శంఖధ్వనులచేతను, సంగీత వాద్య విశేషధ్వనులచేతను ఢక్కా మృదంగ దుందుభి ధ్వనులచేతను నతి సంభ్రమముగా నయోధ్యకేగు సమయమున రాఘవుండు తన మంత్రులతో సుగ్రీవ సఖ్యమును, ఆంజనేయుని ప్రభావంబును, వానరులుచేయు నద్భుతకర్మను, రాక్షసులయొక్క బలమును, విభీషణుని సంయోగంబును ప్రశంసింపవారందరు మిక్కిలి విస్మయమునుపొందిరి. ఇవ్విధంబున నయోధ్యకు బ్రవేశించి తండ్రి గృహంబునకుజేరి, కౌసల్యా సుమిత్రా కైకేయిలను నమస్కరించి, భరతునింజూచి, నేనుండెడి యశోకోద్యానంబుగల మందిరంబున సుగ్రీవుని బ్రవేశింపజేయుమనిన, భరతుండు సుగ్రీవ హస్తమును బట్టుకొని మర్యాదతోనామందిరమునవిడిచె. అంత శత్రుఘ్నప్రేరితులైన భృత్యులు తైలదీపములు, కనకపర్యంకాస్తరణంబులను గ్రహించి ప్రవేశింప, భరతుండు కపి

నాయకునిజూచి, రామాభిషేకార్థము జలంబుల గొనితె చ్చుటకు దూతలనియోగింపుమనిన, సుగ్రీవుండు నాలుగు సువర్ణఘటములనుగొని జాంబవంతునకు, హనుమంతు నకు, వేగదర్శికి, ఋషభునకు నొసంగి సూర్యోదయమున కుముందు చతుస్సముద్రజలమును తేవలయునని యాజ్ఞా పించెను. తక్కిన వానరులను ఐదునూర్లనదులలోని జలం బులదెమ్మని యాజ్ఞాపించిన వారందరు వాయువేగంబున బోయిరి. తూర్పుసముద్రమునుండి సర్వరత్నవిభూషితం బగు కలశమును జాంబవంతుండును, దక్షిణసముద్రము నుండి జలకలశమును ఋషభుండును, పశ్చిమసముద్రము నుండి రక్తచందన శాఖాసంవృతంబగు జలకలశమును, వేగదర్శియును, ఉత్తరసముద్రమునుండి శీతలోదకపూ ర్ణంబగు రత్నకుంభమును వాయుపుత్రుండును దెచ్చిరి. తక్కిన వానరులు పంచశత నదీజలంబులదెచ్చిరి. అప్పుడు మంత్రులు జలకలశంబులు వచ్చినవని తెలుప వసిష్ఠుండు. వామదేవ జాబాలి కాశ్యప కాత్యాయన గౌతమ సుయజ్ఞ విజయాది మహామునులతోగూడి రత్నపీఠమందు సీతతోడ శ్రీరాముని గూర్చుండబెట్టి, పరిశుద్ధంబులై పరి మళయుక్తంబులైనజలంబులతో నిగమోక్తప్రకారము మం త్రములచే నభిషేకంబుజేసిరి. ఇట్లు ముందుగ ఋత్విగ్బ్రా హ్మణులును, అనంతరము కన్యలును, పిదపయోధులును, వంతోషముతోడ. వసువులు ఇంద్రునివలె సీతా సంయు క్తుండగు శ్రీరామున కభిషేక మొనరించిరి.

పూర్వము బ్రహ్మనిర్మితంబును, మనువు మొదలగువారిచే ధరింపబడి వంశక్రమాగతంబగు రత్నకిరీటమును వసిష్ఠుండు శ్రీరాముని శిరంబునబెట్టె, అప్పుడు శ్వేతచ్ఛత్రమును శత్రుఘ్నుండును, శుభ్రంబగు వింజామరమును సుగ్రీవుండును, రెండవ వింజామరమును విభీషణుండును, ధరించియుండిరి. ఇంద్రప్రేరితుండై వాయుదేవుండు సువర్ణపద్మమాలికను, నవరత్నకలిత ముక్తాహారంబును రాఘవునికొసంగె. నప్పుడు దేవగంధర్వులు గానముజేసిరి, అప్సరస్త్రీలు ఆడిరి, అప్పుడు భూమి పరిపూర్ణసస్యవతియై యొప్పె, వృక్షంబులు పుష్పఫలవంతంబులయ్యె, ఆమహోత్సవంబున రాఘవుండు అనంతంబులగు గోదానంబులును అశ్వవృషభదానంబులును ముప్పదికోట్లు సువర్ణనాణ్యంబులును, బ్రాహ్మణులకొసంగె, వెలగల నానాభరణవస్త్రములను కాంచనమణివిగ్రహ మాలికను సుగ్రీవునకు రాఘవుండొసంగె, వైడూర్యవిచిత్రితంబులై వజ్రరత్నయుక్తంబులగు నంగదములను అంగదునకిచ్చెను, మణిశ్రేష్ఠములతోగూడిన నతిశ్రేష్ఠమగు ముక్తాహారమును సీతకొసంగె, మంచిశుభ్రములైన వస్త్రములను. మంచియాభరణములను చేతబట్టుకొనిజానకిని చూచుచు వాయు సూనునకొసంగెనప్పుడు జానకితనకంఠమునుండి అనర్ఘరత్నమాలికనుదీసి కరంబుననుంచుకొని వానరులను భర్తనువీక్షించుచుండ, ఇంగితజ్ఞుండగు రాఘవుండు సీతమజూచి పౌరుషము, పరాక్రమము, బుద్ధి ఇవి ఎవనియం

ను గలవో ఎవ్వనిప్రభావంబున బరితుష్టవైతివో వానికి
మ్మనిన జానకి దానిని మారుతికంఠమున వేసె, నప్పుడా
హారముచే, శ్వేతాభరణముచే నచలముభంగి శోభించె,
అటులనే తక్కినవానరులకును విభీషణునకును వస్త్రాభ
రణంబులొసంగెను, ఇట్లు, సుగ్రీవాదివానరులందరు యథా
స్థముగ సత్కరింపబడి పరమానందమగ్నులై సీతాలక్ష్మ
ణ భరత శత్రుఘ్న సమేతుండగు రాముని కన్నులకఱవు
దీర సేవించి బహువిధములుగ స్తుతించి నమస్కరించి రా
మునియనుజ్ఞనడసి నిజనివాసంబులకరిగిరి. విభీషణుండు
...ముని విషువంజాలక సేవించుచుండిన రాఘవుండు తన
చే నర్చింపబడుచున్న రంగశాయిని రంగవిమానసహిత
ముగా విభీషణునకొసంగి నాగుకేతుగా నర్చించుకొనుచు,
శాశ్వతంబుగ రాజ్యమును పాలించుచుండుమని యా
జ్ఞనొసంగిన మిక్కిలి సంతుష్టాంతరంగుండై లంకాపురిం
జేరె. నప్పుడు పరమోదారుండును ఏకపత్నీవ్రతుండును,
అగు రాముండు సత్యముచే లోకమునువశపరచుకొని మ
హాయశుండై రాజ్యపాలనంబుసేయుచు లక్ష్మణునకిట్లని
యె, ధర్మజ్ఞా! నీవు నాతోడం గూడి యువరాజువై రాజ్య
పాలనంబొనర్పుము అని యనేకప్రకారంబుల ననునయిం
చినను సమ్మతింపకుండె. నంతభరతుని యౌవరాజ్యంబున
నభిషిక్తుం జేసి పిదప అశ్వమేధవాజసేయ పౌండరీకాదియ
జ్ఞంబులుచేసి పదివేల సంవత్సరములు రాజ్యపాలనంబుసే
యుచు శతాశ్వమేధంబులొనర్చె. నప్పుడు స్త్రీలు విధవాత్వ

మనోందకుండిరి వ్యాధిదుర్భిక్షాదులు లేకుండె, చోరబాధ, వృద్ధులు బాలురకు కర్మంబు చేయుట, అనర్థకర్మంబులు జరుగకుండె, రాముడు రాజ్యమేలుచుండగా నందరుని రామయులై సపుత్రులై సంతోషయుక్తులై దీర్ఘాయుష్యవంతులై విగతశోకులై స్త్రీబాలయువ వృద్ధులందరు రామరామయని సర్వకాలములయందు రామకథాసుధారసపానసంతుష్టహృదయులై యుండిరి. జగమునందు అంతటను రామకథా ప్రసంగముదక్క వేరొండులేక సర్వము రామ మయంబై యొప్పుచుండె. రాముడు రాజ్యమునేలుచుండ ప్రజలు ఒకరినొకరు హింసింపరు. ఎల్లప్పుడు వృక్షములు ఫలవంతములై మనోహరముగనుండును. కాలము తప్పక మేఘుడువర్షించును, వాయువు సుఖముగవీచును, ప్రజలు స్వకర్మంబులతో తృప్తులై కులోచితకార్యములే చేయుచుందురు. అందరు ధర్మపరాయణులై యుందురు. పదునొకండువేల సంవత్సరములు శ్రీరాముండు భ్రాతృయుతంబుగ రాజ్యమును పాలించెను.

అమోఘంబగు నీ శ్రీరామచరితంబును భక్తితోబఠించినవారికిని, వినినవారికిని సకలపాపంబులు తొలంగును. పుత్రులుగలుగుదురు, ఐశ్వర్యము, సుఖప్రాప్తి, ప్రియబంధుసమాగమము. కుటుంబవృద్ధి ధనధాన్యవృద్ధి ఉత్తమస్త్రీప్రాప్తి, దీర్ఘాయుష్యము. ఆరోగ్యము కీర్తి. సౌభాత్రకము, వృద్ధి, శుభపరంపర, ఇవియన్నియు గలుగును గావున వృద్ధికాములగు వారందరు నియమముచే ననుది

నము రామచరిత్రంబును బఠించుచు వినుచు నుండవల యును. అట్లుండుటచే దేవతలు పితృదేవతలు సంతోషించుచు వారికి సకల సౌఖ్యంబు లొసంగుదురు.

# ఉత్తర కాండము.

---

ఇవ్విధంబున సకలసురనరమునివర మనోహరంబుగ బట్టాభిషిక్తుండై, సర్వలోకశరణ్యుండై యొప్పుచున్న రాఘవుండు స్వాశ్రిత సత్కారంబులగావించి సుగ్రీవ విభీషణాదుల స్వకీయరాజ్యములయందు, స్థాపించి అనుజసహితుండై నిష్కంటకముగ రాజ్యము నేలుచుండె, నప్పుడు తన్ను సేవింపవచ్చిన కణ్వకౌశికాది మహర్షులతోడ సత్కథాలాపంబులు సలుపుచు మహీకుమారింగూడి లోకోత్తరసుఖంబు లనుభవించుచుండ వేయివత్సరంబులకు సీతాదేవి గర్భవతియయ్యె, అంతశ్రీరాముండు, రాక్షసగృహోషితయగు సీతను రాముడు పరిగ్రహించెనని నిందించుచున్న పౌరులవాక్యములను చారులవలనవిని, లోకాపవాదమును వారింపదలచి మానుషధర్మమునుజూపుటకై సీతను అరణ్యంబునవిడిచిరమ్మని లక్ష్మణునకాజ్ఞాపించిన నతండు చింతాక్రాంతుండై భ్రాతృవాక్యంబులకు బదులాడనేరక జానకినిరథంబుపై నెక్కించుకొని పోయి వాల్మీకాశ్రమ సమీపంబునవిడిచివచ్చెను, అంతనక్కడ సీత తన్నుఒంటరిగావిడిచిపెట్టి లక్ష్మణుండుపోవుటనుజూచి భర్తనుదలం

చుకొని యెలుంగెత్తి వెక్కివెక్కి యేడ్చుచుండ నప్పుడ యార్తధ్వనినివిని వాల్మీకి మహర్షివచ్చిచూచి యామె ను ఓదార్చి తనయాశ్రమంబునకు దోడ్కొనిపోయి సాద రంబుగబూజించుచుండె, భర్తృపరతంత్రగావున సీత, ఆఋష్యాశ్రమమున మునిపత్నీమానితయై వసించుచుండె. అంతగొన్నిదినంబులకు కుశలవ నామకపుత్రద్వయముగలి గెను,వారికి వాల్మీకి జాతకర్మాదికృత్యంబులాచరించి, మి క్కిలి గౌరవప్రేమములతో బెనుచుచుండె.

అయోధ్యయందు శ్రీరాముండును సకలభోగంబులవ గలి శమదమాది గుణసంపన్నుండై విష్ణ్వారాధనంబు సేయుచు సకలదిగ్దేశములజయించి ప్రఖ్యాతిగాంచిన సోద రులు పరిచర్యసేయ, గోమతీ తీరంబున స్వర్ణ సీతా సమే తుండై అశ్వమేధాది నానాయజ్ఞంబులుసలుపుచుండె.

వాల్మీకి నారదోపదేశమువలన దానురచించిన శ్రీరా మాయణమును కుశలవులకు వాచోవిధేయఁబగునట్లు ఉపదేశించె. నంత వారు మహర్షుల సభయందు శ్రుతి లయ సమన్వితముఁగను, నవ రసంబులు వ్యక్తపడునట్లు సజ్జన మనోహారంబుగను, గానముసేయు నామహర్షులు మిక్కిలి యానందించి కుశలవులకు, కృష్ణాజినమునొకరు, జపమాలికనొకరు, కమండలము నొకరు, ఇట్లు అనేక విధములగు సత్కారములజేసిరి. అంత నొక్కనాడు మునివేషధరులగు కుశలవులు అయోధ్యకేగి, రాజమా ర్గంబున నతిమనోహారంబుగ రామాయణము గానముసే

యుచుండ శ్రీరఘునందనుండువిని అత్యాశ్చర్యమునొంది వారిని తమ గృహమునకు రప్పించి తమ్ములతోగూడ సభయందు కుశలవులవలన రామాయణమును సర్వంబు విని, మహారాజ లక్షణోపేతులై మునివేషంబుల దాల్చి యున్న వారినింజూచి ప్రేమానందంబు లతిశయింప, వారికి నానారత్న సువర్ణాభరణాంబరాదులొసంగిన వారు రామానుజ్ఞగైకొని వాల్మీకాశ్రమంబునకు జనిరి.

తరువాత కొంతకాలమునకు శ్రీరాముండు అశ్వమేధ యాగము సేయుసమయంబున వాల్మీకి కుశలవులను సీత నుదోడ్కొని రాముని యజ్ఞశాలకు జనుదెంచి రాము నితో నిట్లనియె.

ఓ సర్వలోకశరణ్యా! నిష్పాపయు, సుచరితయునగు నీ సీతను విడువందగదు పరిగ్రహింపుమనిన, రాముండు వాల్మీకి కిట్లనియె. మునిసరా! జానకి పాపరహితయని నేనెఱుంగుదును. పూర్వము రావణునిచే బలాద్గృహీత యై లంకయందు నివసించినందున సర్వలోక సమాదర ణంబు వడయుటకై అగ్నిప్రవిష్టయయిన సీతను బరిగ్ర హించి, అయోధ్యకేగి రాజ్యపరిపాలనము సేయుచుండ, కొంతకాలమునకు పురజనుల నిందావాక్యములవిని యో ర్వజాలక నేను మీయాశ్రమంబునకు బంపితిని, కావున లోకసంతుష్టికొఱకు ఈ మహర్షి రాజమండలమున సీత ప్రత్యయము చేయవలయుననిన నావాక్యమును సీతవిని, తలవంచుకొని భూమినిజూచి, ఓ ధరణీ నేను సూర్య

నను ప్రభవలెను, పుష్పమునకు పరిమళమువలెను, రామునికి సహధర్మచారిణినై మనోవాక్కాయ కర్మలచే నాకు నితరాసక్తి లేకుండుట నిజమైనయెడల నాకుమార్గమునొసగుమని ప్రార్థించిన, నప్పుడు సభికులందరు చూచుచుండ తత్క్షణంబున భూమి బ్రద్దలై అందు మహాపరాక్రమముగల నాగములు దివ్యరత్నాలంకృతమగు సింహాసనమునుగొని తేర, ఆ విచిత్రమును చూచి సభికులందరు పరమాశ్చర్యమునొందుచుండ భూదేవి మనుష్య స్త్రీ రూపధారిణియై స్వాగతంబనుచు నాసీతను తనచేతులచే నెత్తికొని యాదివ్యరత్న సింహాసనంబున గూర్చుండబెట్టిన, తత్క్షణంబున జానకి దివ్యరూపంబును ధరించి, దివ్య సుందరులు తన్ను బరివేష్టించి కొలుచుచుండ యజ్ఞవాటమందలి సభికులుచూచుచుండ రసాతలంబునకుజనియె. నంత దేవతలు బుష్పవృష్టిని గురిపించిరి. అచ్చటి సభికులు సీత భూప్రవేశంబగుటజూచి సీతా మహాత్మ్యంబునకచ్చెరువొందుచు, దుఃఖింపసాగిరి. శ్రీరాముండును శోకసంతప్తుండై తన పుత్రులజేరదీసికొని మహర్షులతోడ నయోధ్యకు బ్రవేశించె. నంత గొంతకాలంబునకు మాతృవర్గము స్వర్గతంబయ్యె.

అంత శ్రీరాఘవుండు రాజ్యపరిపాలనంబుసేయుచుండ పదునొకండు వేలసంవత్సరములుగడచె నప్పుడొకనాడు యముండు మునివేషధరుండై శ్రీరాముని యొద్దకువచ్చి ఓరామా! నీతో రెండుమాటలను చెప్పుమని బ్రహ్మ

వన్నుబంపెను. మనము ఇరువురము మాటలాడు నప్పుడు ఎవండుగాని వచ్చిన యెడల వాడు వధార్హుండగునని యూజ్ఞాపింపుమనిన శ్రీరాముండు యముని వాక్యము నంగీకరించి లక్ష్మణుని బిలిచి, అతనిని ద్వారమందు కావలియుండ నియమించి అంతర్గృహంబున కేగి యమునితోడ సంభాషింపఁదొడఁగె నప్పుడు యముండు స్వామీ! మీరు చెప్పినచొప్పున భూలోకవాసమునకు నియతమైన పరిమిత కాలము గడిచినది, ఇఁక లీలావిభూతినివిడిచి స్వస్థానంబగు నిత్యవిభూతికి వేంచేసి, సకలదేవతలకు ఆనందము గలుగంజేయుఁడు, అనిన విని రాముండు యముని వచనంబుల నంగీకరించె, నంతలో దూర్వాసుండు ద్వారము దగ్గరకువచ్చి లోపలికి విడువుమనిన లక్ష్మణుండు ఇది సమయముగాదు కొంతదడవు విశ్రమింపుఁడనిన దూర్వాసుండు కోపించి కులక్షయంబగునట్లు శపించెదననిన లక్ష్మణుండు భయపడి తనమరణంబునకు సమ్మతించి రామసన్నిధికేతెంచి తద్వృత్తాంతమును దెలిపి, సత్యప్రతిజ్ఞుండగు రామునిచే విసర్జింపబడి, సరయూ నదీతీరంబు జేరి ధ్యానబంధము జేసి, ప్రాణాయామంబాచరింపుచుండ దేవతలతోడ మహేంద్రుండచటికివచ్చి లక్ష్మణుని జనులకు గన్పడకుండ సశరీరుని, స్వర్గంబునకు దోడ్కొనిపోయెను. అచ్చట సభాస్థలమున లక్ష్మణుని జూచినతోడనే యముండు అంతర్ధానంబు నొందె నంత రాముండును దూర్వాసుని యథోచితముగ బూజించి లక్ష్మణుని విసర్జిం

చినందుకు జింతించుచు, కుశలవుల రాజ్యంబున స్థాపించి అనుజయుక్తుండై పరమపదంబునకుబోవ యత్నించుచున్న వృత్తాంతము నెఱింగి సుగ్రీవాది వానరులును విభీషణుండును అయోధ్యకువచ్చి రాముని సేవించి మేమును వెంటవచ్చెదమని ప్రార్థించుచుండ విభీషణునిజూచి శ్రీరాముండు చంద్ర సూర్యులుండు పర్యంతము రంగవిమానమును బూజించుకొనుచు రాజ్యపరిపాలనము సేయుచుండుమని నియోగించెను. ఆంజనేయునిజూచి పరమ భక్తుండవగు నీవు నాచరిత్రము లోకముననుండు నంత వరకుభూమియందుండి అంతంబున నాస్థానమును జేరుము అని యాజ్ఞాపించెను, జాంబవంతుని మైందునిద్వివిదునిజూచి మీరుకలియుగ ప్రవేశమువరకు భూమియందుండి పిదపనన్ను జేరుడని చెప్పి తక్కినవారిని తన వెంట వచ్చుటకు అంగీకరించి శ్రీరాముండు వసిష్ఠునిమున్నిడుకొని ధర్మప్రకారము మహాప్రస్థానికవిధిని నడుపుచు క్షౌమాంబరధారియై బ్రహ్మను సంధానము సేయుచు దర్భలను హస్తమునవిడికొని మానిగ్రైగృహంబు వెలువడి సోదరులుపురజనులు వానరులుతిర్యక్ స్థావరములు తన్ను అనుసరించివచ్చుచుండ సరయూనదీ జలావగాహనము జేసెను. అప్పుడు బ్రహ్మసర్వదేవపరివృతుండై అచ్చటికివచ్చి యిట్లనియె.

శ్రీమన్నారాయణా! నీకు మంగళము, దుష్టసంహారముచేసి మాకష్టముల తొలగించితివి. ఇక నీవు పరమవ్యోమంబునకు వేంచేయుము. అని కృతాంజలియై

పలుకుచుండ' పుష్పవృష్టిగురిసె, దివ్యాప్సరసలు నృత్యము జేసిరి, తుంబురునారదులుగానముచేసిరి. ఇట్లు శ్రీరాఘవుండు సశరీరుండై వైష్ణవ దివ్యతేజంబుతో వెలుంగుచు శంఖచక్ర రూపములధరించిన భరతశత్రుఘ్నులతోడ దివ్యాభరణ దివ్యవస్త్ర దివ్యస్రక్చందన దివ్యకౌస్తుభ వనమాలాది అసాధారణలక్షణ లక్షితుండై యొప్పుచుండె, నప్పుడు అయోధ్యయందలి తిర్యక్స్థావరజంగమములు అన్నియు, ఋక్షవానరులందరు నిరవశేషముగ సరయూనదీ జలస్నానముచే దివ్యరూపంబులుధరించి దివ్యవిమానారూఢులై పరివేష్టించి స్తోత్రములుసేయుచుండసిద్ధ చారణ గంధర్వ దేవమునులందరుజయజయధ్వనులుసలుపుచుండ దేవదుందుభితూర్యనాదంబులు చెలగ శ్రీరాముండు శాశ్వతంబును అక్షయంబును నగుపరమపదంబుజేరె.

ఇట్టి పరమపావనంబగు శ్రీరామచరితంబును నిత్యము పఠంచువారును, వినువారును, సకలపాప విముక్తులగుచు పుత్రపౌత్రులులేనివారు పుత్రపౌత్రులను, ధనహీనులు ధనమును, పొందుదురు, పాపములుచేసినవారు, ప్రతిదినము రామకథాసుధారసమును జదువుచుండిన పరిశుద్ధుండగును, మఱియు ఆయుష్యమును, కుటుంబవృద్ధిని, సకలసంపదను, ఆరోగ్యమును, కీర్తిని, తేజమునుపొంది, అంతమున వైకుంఠమునుజేరి, పరబ్రహ్మనుసేవించుచు నిత్యానంద పరవశుండై నిత్యసూరులగూడి బ్రహ్మానందము ననుభవించును. శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ.